Telugu Dialect Bulletin Series - 14

# తెలుగు మాండలికాలు
# మహబూబ్‌నగర్ జిల్లా

రచయిత

డా. కె. లక్ష్మీనారాయణ శర్మ





తెలుగు అకాడమి
హైదరాబాదు
1999

# భూమిక

ఉన్నత స్థాయిలో విద్యాబోధన వాహికగానూ, పాలన భాషగాను తెలుగును సుసంపన్నం చేయడానికి, ఆధునికీకరించడానికి తగిన మార్గాలను, సాధనాలను సూచించే నిమిత్తం ఏర్పడిన గ్విన్ కమిటీవారి నివేదికను, భారత ప్రభుత్వం వారు రూపొందించిన పథకాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, 1968లో రాష్ట్ర భాషా సంస్థను స్థాపించడానికి తెలుగు అకాడమి అని పేరు పెట్టింది.

తెలుగు అకాడమి స్థాపించడంలోని ప్రధాన ఉద్దేశాలు ఇవి :

1. తెలుగు భాషా వ్యాప్తికి పెంపు చేయడానికి భాషను అభివృద్ధిపరచడానికి సుసంపన్నం, ఆధునికీకరణ చేయడానికి కృషిచేయడం.
2. పాలన సౌలభ్యం కోసం తెలుగును అధికారభాషగా ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం చేసే కృషిలో సహకరించడం.
3. ఉన్నత విద్యలోని అన్ని స్థాయిల్లోనూ తెలుగును బోధనా మాధ్యమంగా ప్రవేశపెట్టడానికి విశ్వవిద్యాలయాలు చేసే కృషిలో సహకరించడం.

తెలుగు అకాడమీ ముఖ్య కార్యక్రమాల్లో ఆధునిక ఆంధ్ర భాషకు వర్ణనాత్మక వ్యాకరణం రూపొందించడం ఒక ప్రముఖ కార్యక్రమం. ఈ కార్యక్రమం తొలిఘట్టంలో పర్యటన పరిశోధన, రెండో ఘట్టంలో జిల్లాలవారీ పరిశోధన పత్రికల ప్రచురణ, తరవాత మూడో ఘట్టంలో ఒకే మాండలికానికి చెందిన ఈ జిల్లాల పరిశోధన పత్రికల ఆధారంగా ప్రాంతీయ మాండలిక వ్యాకరణాలను రూపొందించడం. నాలుగో ఘట్టంలో మొత్తం ఆధునికాంధ్ర భాషకు సమగ్ర వర్ణనాత్మక వ్యాకరణం రచించడం.

ఈ మహబూబ్‌నగర్ జిల్లా పరిశోధన పత్రిక ప్రచురణపైన వివరించిన రెండో ఘట్టానికి చెందినది. ఈ మాండలిక పరిశోధనల వల్ల దిగువ ప్రయోజనాలు సిద్ధిస్తాయి.

1. తెలుగు మాండలికాలలోని ఏకత్వాన్ని నిరూపించడం.

2. ఈ ఏకత్వాన్ని వర్ణనాత్మక వ్యాకరణంగా రూపొందించడం.

3. తెలుగు వ్యావహారిక భాషకు అధిక ప్రాధాన్యం కలిగించడం.

4. ఆధునిక ప్రామాణిక తెలుగు భాషా స్వరూపాన్ని ఆవిష్కరించగలగడం.

5. పాఠ్యగ్రంథాల్లో ఆధునిక ప్రమాణ తెలుగు భాషను వినియోగించుకోవడం మొదలైనవి.

తెలుగు అకాడమీ చేస్తున్న ఈ కృషి సహృదయుల, భాష పరిశోధకుల ఆదరాభిమానాలను చూరగొంటుందని విశ్వాసం. ఈ పరిశోధన పత్రిక తయారు చేసేందుకు పరిపాలనా పరమైన సహకారాన్ని, నిరంతర ప్రోత్సాహాన్ని అందించిన డాక్టర్ ఎ. మంజులత (డిప్యూటీ డైరెక్టర్) గారికి ధన్యవాదాలు. మహబూబ్‌నగర్ జిల్లా భాషా సేకరణ లోగడ శ్రీ కె. రమేష్ కుమార్ 1985-86లో చేపట్టి, ముగించారు. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయం భాషాశాస్త్ర శాఖలో పనిచేస్తున్న వారికి, వ్యవహారాన్ని అందించి జిల్లా మాండలికాన్ని వివరించేందుకు వీలు కల్పించిన వ్యవహర్తలకు కృతజ్ఞతలు. ఈ బులెటిన్‌ను కంపోజ్‌చేసిన భాస్కర్ గ్రాఫిక్స్ వారికి సుందరంగా ముద్రించిన శ్రీ బాలాజీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారికి ధన్యవాదాలు.

# ప్రవేశిక

'సామాజిక భాషా పరిశీలన' అనే బృహత్పథకం కింద తెలుగు అకాడమీ పరిశోధన పత్రికలను జిల్లాల వారిగా 'తెలుగు మాండలికాలు' అనే శీర్షిక కింద ప్రచురిస్తోంది. ఇప్పటి వరకు 13 ప్రచరణలు వెలువడ్డాయి. ప్రస్తుతం 'మహబూబ్‌నగర్ జిల్లా – తెలుగు మాండలికం'' పద్నాల్గోది. ఇందుకుగాను ప్రధానంగా టేపుల ద్వారా సేకరించిన వ్యవహారం, ప్రశ్నావళుల ద్వారా సేకరించిన సమాచారం వినియోగపడింది. అయితే విషయ సేకరణకు బులిటెన్ తయారీకి మధ్య ఏర్పడిన కాల వ్యవధి వల్ల సేకరించిన సమాచారం పూర్తిగా ఉపయోగపడలేదు. కొంత మేరకు నిరుపయోగమూ అయింది. కాబట్టి మిగిలిన సమాచారం ఆధారంగా ఈ పరిశోధన పత్రిక తయారు చేయడం జరిగింది.

ఈ బులిటెన్‌లో పరిశీలించిన విషయాలకు అయిదు అధ్యాయాల్లో చర్చించడం జరిగింది. మొదటి అధ్యాయంలో మౌలికంగా మాండలిక భాషా స్వరూపం అవగాహనకు వీలుగా జిల్లా గురించిన నైసర్గిక లక్షణాలను ఇవ్వడం జరిగింది. విషయసేకరణ విధానం రెండో అధ్యాయంలోనూ, మహబూబ్‌నగర్ జిల్లా భాషా స్వరూపం మూడో అధ్యాయంలోనూ వివరించడం జరిగింది. మూడో అధ్యాయంలోనే జిల్లా వ్యవహారంలో గోచరించే సామాన్య లక్షణాలు, ఈ వ్యవహారంపై గోచరించే అన్య భాషా ప్రభావం, విద్యావంతుల, నిరక్షరాస్యుల వ్యవహార విశేషాలు, పదజాల విశేషాలు, ఆధునిక ప్రమాణ వైవిధ్యాలు వివరించడం జరిగింది. నాలుగో అధ్యాయంలో వ్యవహార ఖండికలున్నాయి. అయిదో అధ్యాయంలో మాండలిక పద (బంధ) కోశం పొందు పరచడం జరిగింది. ఈ పరిశీలన వల్ల మహబూబ్‌నగర్ జిల్లా భాషా స్వరూపం స్థూలంగా విశద పడుతుంది.

# విషయ సూచిక

# 1. మహబూబ్‌నగర్ జిల్లా

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మహబూబ్‌నగర్ జిల్లా పశ్చిమ దిశగా ఉంది. ఈ జిల్లా 16°, 17° ఉత్తర అక్షాంశ రేఖల మధ్య 77°, 79° తూర్పు రేఖాంశాల మధ్య విస్తరించి ఉంది. ఈ జిల్లాకు ఉత్తరాన హైదరాబాద్, నల్లగొండ జిల్లాలు, తూర్పున నల్లగొండ, ప్రకాశం జిల్లాలుగా దక్షిణాన (కృష్ణా, తుంగభద్ర నదుల కవతల) కర్నూలు జిల్లా, పశ్చిమంగా కర్ణాటక రాష్ట్రం (రాయచూరు, గుల్బర్గా జిల్లాలు) ఉన్నాయి. **18,432** చ.కి.మీ. విస్తీర్ణంతో ఉండే ఈ జిల్లా రాష్ట్రంలో ద్వితీయ స్థానం ఆక్రమిస్తూ **6.70%** ప్రాంతాన్ని కలిగి **4.62%** జనాభాను కలిగి ఉంది.

**1870**లో పరిపాలనా సౌలభ్యం కోసం ఈ జిల్లా ఏర్పాటైంది. అప్పట్లో దీన్ని నాగర్‌కర్నూలు జిల్లాగా పిలిచేవారు. ఎనిమిది తాలూకాలుండేవి. **1881** నాటికల్లా ఈ జిల్లాలో పది తాలూకాలు (మహబూబ్‌నగర్, జడ్చర్ల, ఇబ్రహీంపట్నం, కల్వకుర్తి, అమ్రాబాద్, నాగర్‌కర్నూల్, మక్తల్, నారాయణపేట, కోయిల్‌కొండ, పర్గి) గా మారాయి. **1883**లో పరిపాలనాసౌలభ్యం కోసం జిల్లా ప్రధాన కేంద్రాన్ని హైదరాబాద్ నిజాం (మీర్ మహబూబ్ అలీఖాన్) పేరిట ఏర్పాటైన మహబూబ్‌నగర్ కు మార్చారు. **1905**లో ఇబ్రహీంపట్నం తాలూకాను మెదక్ జిల్లాలో కలిపారు. కోయిల్ కొండ, నారాయణపేట, మక్తల్ తాలూకాలలో ఉండే **73** గ్రామాలను ఈ జిల్లాను అనుకొని ఉన్న కర్ణాటక రాష్ట్రంలోని గుల్బర్గా జిల్లాలో కలిపారు. తరువాత కాలంలో కోయిల్ కొండ, జడ్చర్లలను మహబూబ్‌నగర్ తాలూకాలోనూ, నారాయణ పేట తాలూకాను మక్తల్ తాలూకాలోనూ విలీనం చేశారు. అందువల్ల జిల్లాలో **6** తాలూకాలు మిగిలాయి. **1921 –31** కాలంలో అమర్ చింత సంస్థానాన్ని మహబూబ్‌నగర్‌లో విలీనం చేయడంవల్ల ఆత్మకూరు తాలూకాను ఏర్పాటు చేశారు. అప్పటినుంచీ **1950** దాకా జిల్లా స్వరూపంలో ఏ తేడాలు లేవు. **1950**లో జాగీర్లు, సంస్థానాల విలీనంతో వనపర్తి, షాద్‌నగర్, కొల్లాపూర్ (జటప్రోలు) తాలూకాలు కొత్తగా ఏర్పాటయ్యాయి. రాష్ట్రాల పునర్విభజన కాలంలో **(1956)** ఈ జిల్లా ఎన్నో మార్పులకు గురయింది. పర్గి తాలూకా హైదరాబాదు (ప్రస్తుతం రంగారెడ్డి) జిల్లాలో విలీనమైంది. కర్ణాటక రాష్ట్రంలోని

రాయచూర్ జిల్లా నుంచి ఆలంపూర్, గద్వాల తాలూకాలు, గుల్బర్గా జిల్లానుంచి కొడంగల్ తాలూకా ఈ జిల్లాలోకి వచ్చి చేరాయి. తిరిగి 1958లో కల్వకుర్తి తాలూకాలోని మద్నాపూర్ గ్రామం నల్లగొండ జిల్లాలోని దేవరకొండ తాలూకాకు బదిలీకాగా 1959లో హైదరాబాద్ జిల్లా (ప్రస్తుతం రంగారెడ్డి) లోని చేవెళ్ళ (షాబాద్) తాలూకాలోని 9 గ్రామాలు షాద్‌నగర్ తాలూకాలోకి వచ్చి చేరాయి. అప్పటి నుంచీ ఈ జిల్లాలో ప్రాంతీయపరమైన మార్పు లేమీ జరగలేదు. ఇటీవల కాలంలో మండలాలు ఏర్పడేదాకా ఈ జిల్లాలో 4 రెవెన్యూ మండలాలు (మహబూబ్‌నగర్, నాగర్‌కర్నూల్, గద్వాల్, నారాయణపేట), 12 తాలూకాలు (మహబూబ్‌నగర్, షాద్‌నగర్, కల్వకుర్తి, అచ్చంపేట, కొల్లాపూర్, గద్వాల్, అలంపురం, వనపర్తి, మక్తల్, కొడంగల్, ఆత్మకూర్) ఉండేవి. 1985 మే నెలలో తాలూకాలను, ఫిర్కాలను రద్దుచేసి వాటి స్థానే 64 రెవెన్యూ మండలాలను ఏర్పాటు చేశారు. అవి : కొడంగల్, మద్దూరు, దౌలతాబాద్, బొమరాస్‌పేట, కోసగి, దామరగిద్ద, మక్తల్, ఊటుకూర్, నారాయణపేట, ధన్వాడ, మంగనూర్, కోయిలకొండ, నవాబ్‌పేట (ఎనమగొండ్ల), మహబూబ్‌నగర్, హన్వాడా, జడ్చర్ల, బాలానగర్, ఫారూక్‌నగర్ (షాద్‌నగర్), కేశంపేట, కొందుర్గ్, కొత్తూరు, ఆమన్‌గల్, కల్వకుర్తి, వెల్దండ, వంగూరు, మాడుగుల, మిడ్‌జిల, తలకొండపల్లి, గోపాలపేట, తాడూరు, కొత్తకోట, వనపర్తి, పెబ్బేరు, ఘనాపూర్, పెద్దనందిపాడు, మూసాపేట, ఆత్మకూరు, దేవరకద్ర, చిన్నచింతకుంట, నర్వ, ఇజ్జ (ఐజ), గద్వాల, మలదకల్, ఘాట్, ఆలంపూర్, వడ్డేపల్లి (శాంతినగర్), మానోపాడు, ఇటికియాల్, కొల్లాపూర్, పెద్దకొత్తపల్లి, కోడేరు, పానగల్, విషన్‌గండ్ల, అచ్చంపేట, అమ్రాబాదు, లింగాల, బాలమూర్, ఉప్పునూతల.

పూర్వం మహబూబ్‌నగర్ జిల్లా మొత్తం ఒకటిగా లేదు. క్రీ.శ. 480 లో పాలనలో ఉన్న చోళులు అటు ఉత్తరాన మూసీనది మొదలు ఇటు దక్షిణాన కృష్ణానది వరకు విస్తరించి ఉన్న మహబూబ్‌నగర్ నల్లగొండ జిల్లాల భూఖండాన్ని పాలించేవారు. ఈ ప్రాంతాన్ని చోళుల పేరుతో వ్యవహరించేవారు. చోళుల అనంతరం జిల్లా భాగాలను శాతవాహనులు, బాదామి (పశ్చిమ) చాళుక్యులు, రాష్ట్ర కూటులు పాలించారు. అనంతరం అనేక రాచరికాలకు నిలయమై చివరకు కాకతీయ మహాసామ్రాజ్యంలో భాగమైంది. ఆ సామ్రాజ్యపతనానంతరం తక్కిన తెలంగాణా ప్రాంతం లాగానే ఈ ప్రాంతం బహమనీ సుల్తాను అధీనమైంది. బహమనీ వంశం పాలన తరవాత జిల్లాలోని కొంత భాగం ఢిల్లీ కుతుబ్‌షాహీ, అధీనంలో మరికొంతభాగం బీజాపూర్ సంస్థానంలోకి వెళ్ళిపోయింది. 1686 లో సికిందర్‌షా, అదిల్‌షాలు ఔరంగజేబు చేతిలో పరాజయం

పాలవడంతో బీజాపూర్ రాజ్యం డిల్లీసామ్రాజ్యంలో విలీనమైంది. ఈ జిల్లా ప్రాంతం యావత్తూ ఔరంగజేబు సామ్రాజ్యంలో అంతర్భాగమైపోయింది. ఆ విధమైన స్థితి 18వ శతాబ్దారంభం వరకూ కొనసాగింది. 18 వ శతాబ్దారంభంలో హైదరాబాదు సంస్థాన స్థాపన జరిగి ఈ జిల్లా నైజాం నవాబుల పాలనలోకి వచ్చింది. 1948 లో భారతదేశంలో విలీనమయ్యేదాకా గద్వాల్, వనపర్తి, జడ్చర్ల, అమర్ చింత, గురుకుంట సంస్థానాలు స్వతంత్రంగా కొనసాగాయి.

ఈ జిల్లాను భౌగోళికంగా రెండు భాగాలుగా విభజించవచ్చు. అక్కడక్కడ చిన్న చిన్నకొండలు కలిగి మైదానప్రాంతం మొదటిదైతే, అమరాబాదు నుంచి ఫర్హాబాదు వరకు విస్తరించిన మైదాన ప్రాంతాలు రెండవ భాగం. ఇక్కడ సగటున 800 మీటర్ల ఎత్తున కొండలు వరసగా దాదాపు తూర్పునుంచి పశ్చిమానికి దక్షిణాన సరిహద్దుగా ఉన్న కృష్ణానది ఒడ్డు వరకు వ్యాపించిఉన్నాయి.

ఈ పర్వత శ్రేణుల్లోని చాలా ప్రవాహాలు ఈ ప్రాంతాన్ని చీల్చి ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికి పయనించే వీలులేకుండా చేస్తున్నాయి. ని ఉత్తర, పశ్చిమ ప్రాంతాలు ఎక్కువ ఎత్తులో ఉన్నాయి. జిల్లా ఆగ్నేయ భాగంలో అచ్చంపేటకు దక్షిణంగా విశాల శిఖరాగ్రాలు కలిగిన కొండలు ఉత్తర దిక్కునుండి దక్షిణ దిక్కుగా వ్యాపించి ఉన్నాయి. ఈ కొండలు దూరం నుంచి చూస్తే , ఒకదానిపై ఒకటి నిలిచి ఉన్నట్లు గోచరిస్తాయి.

ఈ జిల్లాలో ప్రవహించే నదుల్లో ప్రధానమైనవి కృష్ణా, తుంగభద్రలు. దేశంలోనే పెద్దదయిన కృష్ణానది ఈ జిల్లాలోని మక్తల్ తాలూకాలో ప్రవేశించి గద్వాల, ఆత్మకూరు, వనపర్తి, కొల్లాపూరు, ఆలంపూరు, అచ్చంపేట తాలూకాల ద్వారా ప్రవహిస్తోంది. కృష్ణకు ఉపనది అయిన డిండి జడ్చర్ల తాలూకాలో ( ప్రస్తుతం మహబూబ్‌నగర్) పుట్టి కల్వకుర్తి, అచ్చంపేట తాలూకాలలో ప్రవహించి చంద్రగిరికి 29 కి.మీ. ల తూర్పుగా కృష్ణలో విలీనమవుతోంది.

జిల్లా విస్తీర్ణంలో అడవులు 16.44% ఆక్రమించి ఉన్నాయి., రమారమి 300 లక్షల హెక్టార్ల విస్తీర్ణం గల అడవుల్లో మేలురకం టేకు అధికంగా లభిస్తుంది.

ఈ జిల్లా వాతావరణం వేసవిలో ఎక్కువ వేడిగాను. ఋతుపవన కాలంలో, చలికాలంలో ఆహ్లాదకరంగా ఉంటుంది. చలికాలంలో గరిష్ఠ ఉష్ణోగ్రత 28.2° సె. గాను, కనిష్ఠ ఉష్ణోగ్రత 16.5° గాను నమోదవుతుంటుంది. దక్షిణం నుంచి ఉత్తరం వెళ్ళేకొద్దీ వర్షాలు ఎక్కువ. సాధారణ వర్షపాతం 754 మి.మీ. లు. నైరుతి రుతుపవనాల

ద్వారా 611 మి.మీ.లు, ఈశాన్య ఋతుపవనాల ద్వారా 92 మి.మీలు, వేసవిలో 47 మి.మీ.లు చలి కాలంలో 4 మి.మీ.లు వర్షపాతం ఈ జిల్లాకు సమకూరుతుంటుంది.

ఈ జిల్లాలో క్రిసోటైల్ రకం అస్బెస్టాస్, బంకమన్ను ఫెల్స్ పార్, క్వార్ట్జ నిక్షేపాలున్నాయి. నాణ్యతకు పేరుపొందిన క్రిసోటైల్ రకం అస్బెస్టాస్ ఖనిజం కొల్లాపూర్ తాలూకాలోని సోమశిల గ్రామానికి ఉత్తర ఈశాన్యం మధ్య దిశగా 1.4 కి.మీ దూరంలో సార్లకొండ అడవిలో లభిస్తోంది. షాద్‌నగర్‌కు పశ్చిమాన 16కి.మీ. దూరంలో శ్రీరంగాపూర్‌లో మేలురకం బంకమన్ను లభిస్తోంది. దాదాపు పదివేల టన్నులు ఉండ వచ్చని అంచనా. గాజు పరిశ్రమలో ఉపయోగించే ఫెల్స్‌పార్ ఖనిజం కల్వకుర్తి తాలూకాలోని బాపనపల్లి, మావునపురం, కోటకొండ దగ్గరలో లభిస్తుంది. 1989-90 సంవత్సరంలో 1014 టన్నులను ఉత్పత్తి చేశారు. గాజు తయారీలో ఉపయోగించే క్వార్ట్జ ఖనిజం గ్రానైట్ రాళ్ళలోని రంధ్రాల్లోనూ, ముడతలోనూ ఉంటుంది. ఈ ఖనిజ స్ఫటికాలు కురుకుంటకు వాయవ్యాన 3 కి.మీ. దూరంలోనూ, తిరుమలపూర్‌కు దగ్గరలోనూ, షాద్‌నగర్‌లోని చోళ్ళపల్లె, విఠల్ ప్రాంతాలలోనూ లభిస్తున్నాయి. జిల్లాలో ఎక్కువ మోతాదులో గాజు మన్ను నిల్వలు కూడా ఉన్నాయి.

ఈ జిల్లా జనాభా (1991 జనాభా లెక్కల ప్రకారం) 30, 77,050. జనసాంద్రత చ.కి. మీ.కు 167 వెయ్యి మంది పురుషులు 973 మంది స్త్రీలుంటారు. గ్రామీణ ప్రాంతంలో 77.4% ప్రజలు పట్టణ ప్రాంతాల్లో 45% దారిద్ర్య రేఖకు దిగువన జీవిస్తున్నారు.

మహబూబ్‌నగర్ జిల్లాలో తెలుగు మాతృభాషగల జనాభా తర్వాత గణించదగిన వారు ఉర్దూ, కన్నడ, మరాఠీ, హిందీ భాషలు మాట్లాడేవారు. ఈ జిల్లా సరిహద్దు ప్రాంతాన్ని ఆవరించి కర్ణాటక రాష్ట్రం ఉంది కనక ఆ ప్రాంతాల్లో కన్నడ భాషా ప్రభావం ఎక్కువ. ద్విభాషా స్థితి కన్పిస్తుంటుంది. ఈ జిల్లాలో ఇంకా యెరుకల, తమిళ, ఖత్రి, సౌరాష్ట్ర, గుజరాతి, మార్వాడీ, మలయాళం భాషలకు చెందినవారు స్థిరపడి ఉన్నారు.

జిల్లాలోని మొత్తం సాగుభూమిలో 13.00% విస్తీర్ణం 81.25% మాత్రమే నీటి పారుదల సదుపాయాలను కలిగిఉంది. మొత్తం నీటిపారుదల ఎక్కువగా బావుల ద్వారానూ కొంత చెరువుల ద్వారా, మిగిలినది ఇతర ఆధారాల ద్వారా జరుగుతుంది. ముంచింతల (ఆత్మకూరు), కసారి సముద్రం (నాగర్‌కర్నూల్) శ్రీ వారి సముద్రం (కొల్లాపూర్), చంద్రసాగర్ (అచ్చంపేట), ఘనప సముద్రం (ఘనాపూర్), ఈ శంకర

సముద్రం (కనాయిపల్లె), రంగ సముద్రం (వనపర్తి) చెరువుల ప్రధానంగా నీటి పారుదలకు వినియోగపడుతున్నాయి. గుర్తించదగిన ప్రాజెక్టులు అంతర్ రాష్ట్ర రాజోలిబండ డైవర్షన్ పథకం, కోయిల్‌సాగర్, సర్లాసాగర్ పథకాలు నీటిపారుదలకు వ్యవసాయ వినియోగంలో ఉన్నాయి. రావలపల్లె దగ్గర కృష్ణానది మీద జూరాల ప్రాజెక్టు, భీమా ఎత్తిపోతల నీటిపారుదల ప్రాజెక్టు నిర్మాణంలో ఉన్నాయి.

జిల్లాలో ఎక్కువ ఎర్ర నేలలున్నాయి. నదీ ప్రవాహ ప్రాంతాల్లో నల్లరేగడి నేల లెక్కువ. మొత్తం సాగు భూమిలో **56.78%** ఆహార పంటలు - వరి, జొన్న, రాగి, సజ్జ, రాగి, మొదలయినవి పండిస్తారు. మిగిలిన ప్రాంతాల్లో ఆహారేతర పంటలు - మిరప, వేరుశెనగ, ఆముదాలు, కందులు, ఉలవలు పండిస్తారు. పాలెంలో ప్రాంతీయ పరిశోధనాకేంద్రం ఉంది. కొర్ర ఆరిక, వరిగలు, పప్పుదినుసులు, ఆముదాలు మొదలయిన పంటల్లో పరిశోధనలు చేస్తున్నారు.

జిల్లాలో భారీ, మధ్యతరహా పరిశ్రమలు **33** ఉన్నాయి. వాటి పెట్టుబడి **11522** లక్షల రూపాయలు. వీటి ద్వారా **5301** మందికి ఉపాధి లభిస్తోంది. పరిశ్రమల్లో ప్రధానమైనవి. సూర్య లక్ష్మికాటన్ మిల్స్ లిమిటెడ్, సియెట్ అగ్రోప్రొడక్ట్స్ లిమిటెడ్, సూర్యలతస్పిన్నింగ్ మిల్స్ లిమిటెడ్, హరిహంట్ అగ్రో ప్రొడక్ట్స్ లిమిటెడ్, ఎన్.సి.ఎల్. ఇండ స్ట్రీస్ లిమిటెడ్. జిల్లాలో చేనేత పరిశ్రమ కాలానుగుణంగా మెరుగులు దిద్దుకొంటోంది. గద్వాల్, నారాయణ్‌పేట్ ప్రధాన చేనేత కేంద్రాలు.

ఈ జిల్లాలో శ్రీశైలం ప్రాజెక్టు ఏడోగట్టు మీద జల విద్యుత్ స్టేషన్ నెలకొల్పుతున్నారు. జూరాల జల విద్యుత్ కేంద్రంకూడా ఈ జిల్లాలోనే ఉంది.

**1795** కి.మీ. నిడివిగల ప్రభుత్వ రహదార్లు, **3337** కి.మీ. నిడివి గల జిల్లా పరిషత్ రహదార్లు, నాగపూర్ నుంచి బొంబాయికి వెళ్ళే జాతీయ రహదారి (నెం.**7**) **172** కి.మీ. నిడివితో ఈ జిల్లాలో ఉన్నాయి. మద్రాసు - రాయచూర్ - బొంబాయి రైలు మార్గంలో కొంత సికింద్రాబాదు - ద్రోణాచలం రైలు మార్గంలో కొంత ఈ జిల్లా నుంచే సాగుతుంది. ఇటీవల సికింద్రాబాదు - మహబూబ్‌నగర్‌ల మధ్య ఉండే మీటర్‌గేజ్ మార్గాన్ని బ్రాడ్‌గేజ్‌గా మార్చారు.

ఈ జిల్లాలో ప్రాథమిక పాఠశాలలు **1954**, ఉన్నత పాఠశాలలు **379**, జూనియర్ కళాశాలలు **19** వీటికి అనుబంధంగా ఉన్నత పాఠశాలలు **12**, డిగ్రీ కళాశాలలు **7**, పాలిటెక్నిక్‌లు **2**, పారిశ్రామిక శిక్షణాకేంద్రం ఒకటి ఉన్నాయి.

మహబూబ్‌నగర్ జిల్లాలో చాలా దేవాలయాలున్నాయి. వీటిలో పాటు 14 మసీదులు, 8 దర్గాలు ప్రసిద్ధాలు. మహబూబ్‌నగర్ పట్టణానికి 8 కి.మీ. దూరంలో ఉన్న పిల్లల మర్రి చెట్టు ఆసక్తికరమైన దర్శనీయస్థలం. ఈ చెట్టుకింద ఒక ముస్లిం సన్యాసి గుడి ఉంది. దూరం నుండి చూసేందుకు ఈ చెట్టు దట్టమైన చెట్లతో, ఊడలతో నిండి ఉన్న చిన్న కొండలాగా ఉంటుంది. దగ్గరకు వెళ్ళి చూస్తే వెయ్యి మందికి నీడ కల్పించే గొడుగులాగుంటుంది. 1.21 హెక్టార్ల (మూడెకరాలు) విస్తీర్ణంలో ఉన్న ఈ వృక్షం అతి పురాతనమైంది. ఆలంపూర్ ఈ జిల్లాలో ప్రధానమైన యాత్రాస్థలం. ఇదే పేరు కలిగిన తాలూకాకుకేంద్రం అయిన అలంపూర్ సికింద్రాబాదు - ద్రోణాచలం రైలుమార్గాన ఆలంపూర్ రోడ్ రైలు స్టేషన్‌కు 10 కి.మీ. దూరంలో ఉంది. తుంగభద్ర నదీ తీరాన ఉన్న ఈ ప్రాంతం పురాతన శిథలాలతో నిండి ఉంది. దీన్ని ఇదివరకు హలంపురం, హమలాపురం, ఆలంపురంగా వ్యవహరించేవారు. క్రీ.శ. 1100లో పశ్చిమ చాళుక్య రాజైన 6వ త్రిభువనమల్ల విక్రమాదిత్యుని కాలంలో చెక్కించిన శాసనంలో ఈ ప్రాంతం హలం పురంగా వ్యవహరించినట్లుగా ఉంది. దీనిని శ్రీశైలం దేవస్థానానికి పశ్చిమ ముఖ ద్వారం అనీ, దక్షిణ కాశీగా వ్యవహరిస్తారు. ఆలంపురం దగ్గర తుంగభద్ర దక్షిణం నుంచి ఉత్తరానికి ప్రవహిస్తోంది. ఇక్కడ ఉన్న బ్రహేశ్వర పాపనాథ దేవాలయ సముదాయాలు ఈ ప్రాంతానికి ప్రాధాన్యతను సంతరించి పెట్టాయి. తుంగభద్రా నదికి ఒడ్డున ఆలంపూర్ గ్రామానికి రెండు వైపులా దేవాలయ సముదాయాలున్నాయి. వీటిలో మొదటి సముదాయంలో బాలబ్రహ్మదేవాలయం ఉంది. దీన్ని చుట్టూ అనేక చిన్న చిన్న గుళ్ళున్నాయి. ఈ ఆలయ శిఖరాలు గుండ్రంగా ఉండి రకరకాల చిత్రాలతో అందంగా ఉంటాయి. దేవాలయాల్లో ప్రధానదైవం ఈశ్వరుడైనా నవబ్రహ్మల్లో బ్రహ్మకే ప్రాముఖ్యత ఎక్కువ. ఇక్కడ ప్రతిష్ట పొందిన బాల బ్రహ్మేశ్వరుడి విగ్రహం జ్యోతిర్లింగంగా ప్రసిద్ధం. ఈ క్షేత్రం శైవులకే కాకుండ వైష్ణవులకూ ప్రాముఖ్యాన్ని సూచిస్తోంది. నృసింహ స్వామిగుడి, సూర్య దేవాలయం, వేంకటేశ్వరుడు, కామాక్షి, వీరభద్ర దేవాలయాలు ఉన్నాయి. కోట దేవాలయంపై అనేక బౌద్ధ, జైన మత సంబంధ చిత్రాలు చెక్కబడిఉన్నాయి. ఈ దిశగా తుంగభద్రపై మరో వంతెన నిర్మాణమై చూపరులకు ఆకర్షణ గొలుపుతున్నాయి.

శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణ దశలో ఉండగా కృష్ణ ఒడ్డున ఉన్న చాలా దేవాలయాలు నీళ్ళపాలవుతాయనుకొన్నప్పుడు వాటిలో ఎంపిక చేసిన 32 దేవాలయాలను మరొక చోటుకు మార్చాలని నిర్ణయించారు. వాటిలో అతిపెద్దదైన మదనగోపాల స్వామి వారి దేవాలయంతో కలిపి 19 దేవాలయాలను కొత్తపోల్ గ్రామంలో 72 ఎకరాల ప్రదేశంలో తిరిగి నిర్మించారు.

# 2. విషయ సేకరణ

మహబూబ్‌నగర్ జిల్లాలో విషయసేకరణ 13 కేంద్రాలలో జరిగింది. ప్రతి కేంద్రంలోనూ నలుగురు వ్యవహర్తలకు తగ్గ కుండా ముందుగా సిద్ధం చేసుకున్న ప్రశ్నావళి ఆధారంగా నామ, క్రియా విభాగం వివరాలను సాధ్యమైనంత వివరంగానే సేకరించడం జరిగింది. వీటితోపాటు బాంధవ్య బోధకపదాలు సంఖ్యా పదాలు వాటిలో కనిపించే వైవిధ్యాలుసేకరించడం జరిగింది. ప్రతి ప్రశ్నావళిలోనూ వ్యవహర్తల వ్యక్తిగత సమాచారం (పేరు, వృత్తి, వయస్సు, చదువు మొదలయినవి) సామాజిక భాషా దృక్పథంలో పొందు పర్చడం జరిగింది.

విషయసేకరణ కోసం పర్యటించిన కేంద్రాలు 13. అవి : షాద్‌నగర్, జడ్చర్ల, గద్వాల, వనపర్తి ఆలంపురం, కొల్లాపూర్, ఆత్మకూర్, అచ్చంపేట, నాగర్‌కర్నూల్, కల్వకుర్తి, మహబూబ్‌నగర్, నారాయణపేట, కొడంగల్.

ప్రతి కేంద్రంలోనూ ఎన్నుకున్న వ్యవహర్తలు సహజంగా సమాజంలోని వేర్వేరు వర్గాలకు చెందినవారు. ఉదాహరణకి (1) రచయిత / టీచర్ / లెక్చరర్ (2) డాక్టర్ / ఇంజనీర్ / లాయర్ ఉద్యోగస్థులు (3) కాలేజీ / స్కూలు విద్యార్థులు (4) చదువు లేని రైతులు, కూలీలు, వృత్తి పనివారు మొ॥. ఈ వ్యవహర్తల్లో ప్రతి కేంద్రంలోనూ ఒక స్త్రీ వ్యవహర్త ఉండేట్లుగా చూడడం జరిగింది. వ్యవహర్తలు ప్రశ్నావళికి సంబంధించిన వివరాలే కాకుండా తమకు నచ్చిన లేదా తాము మాట్లాడ గలిగే అంశంపై (లేదా అనేక అంశాల మీద) యధాలాపంగా, సహజంగా ఉండేట్టుగా మాట్లాడించి వ్యవహార ఖండికలను రికార్డు చేయడం జరిగింది. ఇవి సంభాషణలుగా, కథలుగా, అనుభవాలుగా, అభిప్రాయాలుగా వెలువడంతో దైనందిన వ్యవహార రూపానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. ప్రశ్నావళిలో వెలువరించే సమాచారం కన్నా భిన్నంగా ఉంటాయి. భాషావిశ్లేషణకు తోడ్పడే అంశాలు అధికంగా వెలువడే అవకాశాలు ఉంటాయి. అదీ గాక ఒరవడిలో సమాచారం వల్ల మాండలిక పద జాలం చాలావరకు లభిస్తూంటుంది. భాషా లక్షణాలు అనేకం ప్రతిబింబిస్తుంటాయి. అట్లాగే ప్రతి కేంద్రంలోనూ ఎన్నికచేయబడిన వ్యవహర్తల్లో వీలయినంతవరకు వివిధ కులాలకు చెందిన వారిని తీసుకోవడం జరిగింది.

సేకరించిన వారిలో అగ్ర కులాల వారు (20), వెనకబడిన తరగతుల వారు (25), హరిజనులు (8) ఉన్నారు. అగ్ర కులాల వారిలో రెడ్లు (కాపు రెడ్లతో కలిపి) (6), వైశ్య (7) బ్రాహ్మణ (3), మున్నారుకాపు (1), కాపు (3) కర్ణం (1) కులాల వారున్నారు. వెనక బడిన తరగతులలో తెలగ / తెలుగు (3), గౌడ (2), వడ్ల (2), యాదవ (4), లింగాయత్ (1) ముత్తరాసి (1), ముదిరాజ్ (4), మేదరి (1), దర్జీ (1), గొర్రెకాపు (1), కుర్మ (1), తమ్మళ్ళు (1) రజక (1), ఓడ బలిజ (1) కులాల వారున్నారు. మొత్తం వ్యవహర్తల్లో (53) స్త్రీలు (19) పురుషులు (13). విద్య ఉన్నవారు 40 మందయితే నిరక్షరాస్యులు (13). విద్య ఉన్న వారిలో ఇంటర్ కన్నా తక్కువ చదివిన వారు (1), ఇంటర్ చదువుతున్నవారు, అయిటి అయి చదివిన వారు (7), డిగ్రీ చదివిన / చదువుతున్నవారు (13) స్నాతకోత్తరస్థాయి చదువు ఉన్నవారు (7), వృత్తి విద్య చదివిన వారు (12) న్నారు. వయోపరిమితి దృష్ట్యా పరిశీలిస్తే 20 ఏళ్ళు అంతకు తక్కువ వయస్సున్నారు. 10 మంది, 21-30 మధ్య వారు 7 మంది, 31-40 మధ్య వారు 15 మంది, 41-50 మధ్య వారు 9 మంది 51 - 60 మధ్యవారు 7 మంది, 61 పై బడ్డవారు 5 మంది ఉన్నారు. వీరి వృత్తులు వేర్వేరు రకాలు. ఉపాధ్యాయులు (7), గుమాస్తాలు (2), విద్యార్థులు (13), లెక్చరర్లు (6), లాయర్లు (6), రైతులు (3), వైద్యులు (4), రాజకీయవేత్త (1), కూలీలు (10), రజకులు (1), వ్యవహర్తల గురించిన వివరాలు పట్టికలో సూచించడం జరిగింది.

## వ్యవహర్తల వివరాలు

| కేంద్రం | కులం | విద్య | వృత్తి | లింగం | వయస్సు |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. షాద్‌నగర్ | వడ్ల | బి.ఎస్.సి., టి.టి.సి. | టీచర్ | స్త్రీ | 20 |
| | తెలుగు | బి.ఎస్.సి. | బ్యాంకు గుమాస్తా | పు | 32 |
| | కర్ణం | ఇంటర్-II | విద్యార్థి | పు | 28 |
| | యాదవ | లేదు | పనిమనిషి | స్త్రీ | 48 |
| 2. జడ్చర్ల | తెలుగు | ఇంటర్ | విద్యార్థి | పు | 18 |
| | వైశ్య | ఎమ్.ఎ. | లెక్చరర్ | పు | 55 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| | ఓడబలిజ | బి.కాం. ఎల్.ఎల్.బి. | లాయర్ | పు | 37 |
| | హరిజన | లేదు | కూలీ | పు | 40 |
| 3. గద్వాల | హరిజన | లేదు | కూలీ | పు | 35 |
| | కాపు | ఎమ్.బి.బి.ఎస్ | డ్వాక్టర్ | పు | 38 |
| | వైశ్య | ఎమ్.ఎస్.సి. | లెక్చరర్ | పు | 40 |
| | కాపు | బి.ఎస్.సి. | విద్యార్థిని | స్త్రీ | 19 |
| 4. వనపర్తి | ముదిరాజు | ఎమ్.బి.బి.ఎస్. | వైద్యుడు రాజకీయవేత్త | పు | 51 |
| | వైశ్య | ఎమ్.ఎ. బి.ఇడి | లెక్చరర్ | పు | 52 |
| | యాదవ | బి.ఎస్.సి. III | విద్యార్థిని | స్త్రీ | 18 |
| | యాదవ | లేదు | వ్యవసాయ | స్త్రీ | 40 |
| 5. ఆలంపురం | యాదవ | లేదు | వ్యవసాయ | పు | 35 |
| | రెడ్డి | ఎమ్.ఎస్.సి. బి.ఇడి. | లెక్చరర్ | పు | 37 |
| | వైశ్య | ఇంటర్ -II | విద్యార్థిని | స్త్రీ | 17 |
| | రెడ్డి | ఎమ్.బి.బి.ఎస్ | డ్వాక్టర్ | పు | 43 |
| 6. కొల్లాపూర్ | ముదిరాజ్ | ఎమ్.ఎస్.సి. | లెక్చరర్ | పు | 36 |
| | ముదిరాజ్ | బి.ఎ. I | విద్యార్థిని | స్త్రీ | 22 |
| | హరిజన | లేదు | కూలీ | పు | 65 |
| | మేదరి | 5వ తరగతి | మేదరి | పు | 47 |
| 7. ఆత్మకూర్ | గౌడ | జి.సి.ఐ.ఎమ్. | వైద్యం | పు | 54 |
| | వడ్ల | బి.ఎ.బి.ఇ.డి | టీచర్ | పు | 48 |
| | తెలగ | బి.ఎ. | విద్యార్థి | పు | 21 |
| | హరిజన | లేదు | కూలీ | స్త్రీ | 70 |
| 8. అచ్చంపేట | గౌడ | డిప్లొమా (ఫైన్‌ఆర్ట్) | టీచర్ | పు | 42 |
| | రెడ్డి | బి.ఎ.ఎల్.ఎల్.బి. | లాయర్ | పు | 29 |
| | కాపు | ఇంటర్ -I | విద్యార్థిని | స్త్రీ | 18 |
| | మేరే | లేదు | వ్యవసాయం. | పు | 39 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 9. నాగర్‌కర్నూల్ | బ్రాహ్మణ | బి.ఎల్. | లాయర్ | పు | 75 |
| | మున్నూర్ | బి.ఎస్.సి. | టీచర్ | పు | 44 |
| | కాపు | బి.ఇ.డి. | | | |
| | ముత్తరాసు | ఇంటర్ II | విద్యార్థి | స్త్రీ | 18 |
| | హరిజన | బి.కాం., | విద్యార్థి | పు | 23 |
| | | ఐ.టి.ఐ | | | |
| | హరిజన | లేదు | కూలీ | పు | 65 |
| 10. కల్వకుర్తి | బ్రాహ్మణ | ఎల్.ఎల్.బి. | లాయర్ | పు | 58 |
| | వైశ్య | ఎం.కాం., | లెక్చరర్ | పు | 35 |
| | రెడ్డి | ఎం.బి.బి.ఎస్. | డాక్టర్ | పు | 34 |
| | గౌడ్రకాపు | లేదు | కూలీ | స్త్రీ | 50 |
| 11. మహబూబ్ | రెడ్డి(కాపు) | బి.ఎ. ఎల్.ఎల్.బి. | లాయర్ | పు | 67 |
| నగర్ | బ్రాహ్మణ | ఎమ్.ఎస్.సి. | టీచర్ | పు | 33 |
| | | బి.ఇ.డి. | | | |
| | వైశ్య | బి.ఎస్.సి – I | విద్యార్థి | పు | 19 |
| | హరిజన | లేదు | పని మనిషి | స్త్రీ | 60 |
| 12. నారాయణ | తమ్మళ్ళి | బి.యస్.బి.ఇడి | టీచర్ | పు | 24 |
| పేట | వైశ్య | బి.కాం., | బ్యాంకు | పు | 28 |
| | హరిజన | ఇంటర్ –I | విద్యార్థిని | స్త్రీ | 16 |
| | కురమ | లేదు | వాచ్‌మెన్ | పు | 40 |
| 13. కొడంగల్ | రెడ్డి | బి.ఎ. ఎల్.ఎల్.బి., | లాయర్ | పు | 54 |
| | లింగాయత్ | బి.ఎ. | టీచర్ | పు | 46 |
| | ముదిరాజ్ | ఇంటర్ – II | విద్యార్థిని | స్త్రీ | 17 |
| | రజక | లేదు | చాకలి | పు | 45 |

వివిధ వర్గాల నుంచి వ్యవహర్తలను ఎంపికచేసుకోవడం వల్ల భాషలో ప్రతిబింబించే ప్రాంతీయ వైవిధ్యం సామాజిక పరమైన విశ్లేషణ చేయడం సాధ్యపడుతుంది. నిరక్షరాస్యులైన వారి వ్యవహార భేదాన్ని, విద్య ఉన్నవారితో విభేదకంగా విద్య వైవిధ్యకంగా గుర్తించి ఇతర అంశాలతో పాటు ప్రత్యేకంగా పరిశీలించడం జరిగింది.

# 3. మహబూబ్‌నగర్ జిల్లా వ్యావహారిక భాష[1]

మహబూబ్‌నగర్ జిల్లా రాష్ట్రంలో పశ్చిమ దిశగా ఉంది. ఈ జిల్లాకు ఉత్తరాన హైదరాబాదు, నల్లగొండ జిల్లాలు, తూర్పున నల్లగొండ, ప్రకాశం జిల్లా, దక్షిణాన (కృష్ణా, తుంగభద్రా నదులకు అవతల)కర్నూలు జిల్లా, పశ్చిమంగా కర్ణాటక రాష్ట్రం (రాయచూర్ గుల్బర్గా జిల్లాలు) ఉన్నాయి. ఈ జిల్లాను వ్యవహార పరంగా పరిశీలిస్తే ఉత్తర మాండలికానికి చెందిందని వివరించాల్సి వస్తుంది. ఆలంపూర్, గద్వాల తాలూకాలు కర్ణాటక రాష్ట్రంలోని రాయచూర్ జిల్లా నుంచి మహబూబ్‌నగర్ జిల్లాలో వచ్చి చేరడం వల్ల కొడంగల్ తాలూకా కర్ణాటక రాష్ట్రంలోని గుల్బర్గా జిల్లాలోంచి వచ్చిచేరడం, మక్తల్ తాలూకా కర్ణాటక రాష్ట్రాన్ని ఆనుకొని ఉండడంవల్ల ఈ ప్రాంతాలలో కన్నడ భాషా ప్రభావం అధికంగా బాహ్యంగానూ, అంతర్లీనంగాను గోచరిస్తూంటుంది. ఈ జిల్లా దక్షిణ సరిహద్దు ప్రాంతం నైరుతి నుంచి దక్షిణం దాకా తుంగభద్రా నది మిగిలిన ప్రాంతంలో కృష్ణానది, తూర్పు సరిహద్దు ప్రాంతాన కృష్ణకు ఉపనది అయిన డిండీనది ప్రవహిస్తూ నదీ వలయం ఏర్పాటు చేస్తోంది. ప్రాచీనకాలంలో రవాణా సౌకర్యాలు కొరవడటం, అక్షరాస్యత తక్కువగా ఉన్నా రాష్ట్రావతరణ తరవాత రవాణా వసతులు మెరుగయి, విద్యాసౌకర్యాలు పెరిగాయి. **1951** లో **6.80%** గా ఉన్న అక్షరాస్యత **1991** నాటికి **29.58%** కి పెరిగింది. ప్రమాణ భాషగా చలామణీ అవుతున్న కోస్తా జిల్లా భాషా ప్రభావం తగు మాత్రంలో కనిపిస్తూ ఉంటుంది. వీటన్నింటి సమ్మేళనమే మహబూబ్‌నగర్ జిల్లా మాండలిక భాషగా గుర్తించవచ్చు.

ఈ జిల్లాలో **12** తాలూకాలు ఉన్నాయి. అవి : మహబూబ్‌నగర్, షాద్‌నగర్, కల్వకుర్తి, నాగర్‌కర్నూల్, అచ్చంపేట, కొల్లాపూర్, గద్వాల్, ఆలంపూర్, వనపర్తి, మక్తల్,కొడంగల్, ఆత్మకూర్ ఈ తాలూకాలలో కనిపించే ఇతర జిల్లా మాండలికాల ప్రభావాన్ని కింది విధంగా సూచించవచ్చు.

---

1. ఈ వ్యాస రచన చేస్తున్నప్పుడు విషయ విశ్లేషణలో జిల్లా కేంద్రాలలో సేకరించిన వ్యవహార ఖండికలు, ప్రశ్నావళులతో పాటు **మహబూబ్‌నగర్ జిల్లా సామాజిక భాషా పరిశీలన** (అప్పం పాండయ్య, ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత వ్యాసం, (అముద్రితం) 1988, హైదరాబాదు), **తెలుగు మీద కన్నడ భాషా ప్రభావం** (డా. అదవాని హనుమంతప్ప, కార్తికేయ పబ్లికేషన్స్, అనంతపురం, 1989) లను

| <u>కేంద్రం పేరు</u> | <u>కనిపించే వ్యవహార ప్రభావం</u> |
|---|---|
| షాద్‌నగర్ | రంగా రెడ్డి జిల్లా |
| కల్వకుర్తి | రంగా రెడ్డి, నల్లగొండ |
| అచ్చంపేట | నల్లగొండ, గుంటూరు |
| కొల్లాపూర్ | కర్నూలు |
| గద్వాల్ | కర్ణాటక, కర్నూలు |
| ఆలంపురం | కర్నూలు |
| మక్తల్ | కర్ణాటక |
| కొడంగల్ | కర్ణాటక, రంగారెడ్డి |
| ఆత్మకూర్ | కర్ణాటక |

మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారాన్ని వివరించడానికి వీలుగా ఈ అధ్యాయాన్ని ఆరు విభాగాలుగా విభజించడం జరిగింది.

1. మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారం – కొన్ని సామాన్య లక్షణాలు.
2. మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారం – అన్య భాషాప్రభావం
3. మహబూబ్‌నగర్ జిల్లా విద్యావంతుల వ్యవహార విశేషాలు.
4. మహబూబ్‌నగర్ జిల్లా నిరక్షరాస్యుల వ్యవహార విశేషాలు.
5. పదజాలం – కొన్ని విశేషాలు.
6. మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారం – ఆధునిక ప్రమాణ భాష సామ్యాలు, వైవిధ్యాలూ.

గమనిక:- విషయ వివరణ నిమిత్తం ఈ గ్రంథం చివర ఇచ్చిన వ్యవహార ఖండికలనే కాకుండా విషయ సేకరణ కోసం సేకరించిన ప్రశ్నావళి, పట్టికలు ఇతర వ్యవహార ఖండికలను ఆధారం చేసుకోవడం జరిగింది.

---

పరిశీలించడం జరిగింది. మొదటి గ్రంథంలో సుదీర్ఘ వివరణలు, మనిశిత విశ్లేషణలున్నప్పటికీ వివరణలు అధిక భాగం గుణాంక విశ్లేషణ ఆధారంగా కొనసాగింది. ఆ విధంగా ప్రస్తుత వ్యాసం పై సిద్ధాంత వ్యాసంతో విభేదిస్తూ భాషాంశాల, సామాజిక అంశాల విశ్లేషణ ఆధారంగా సాగుతోంది. ప్రధానంగా విద్యను వైవిధ్యకంగా గ్రహించడం జరిగింది. రెండో గ్రంథంలో అనంతపురం ప్రాంతీయ మాండలికంలో ఉన్న కన్నడ ప్రభావాన్ని వివరించి, విశ్లేషించారు.

## I మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారం కొన్ని సామాన్య లక్షణాలు

మహబూబ్‌నగర్ జిల్లాలో కనిపించే ప్రాంతీయత పరిధి ఉండే లక్షణాలతో పాటు, తెలుగు భాషలో సామాన్యంగా గోచరించే కొన్ని లక్షణాలను ఈ విభాగంలో పేర్కొనడం జరిగింది. ఇతర విభాగాలలో వర్గ సంబంధి విశేషాలను సూచించడం జరిగింది.

1. పద ప్రారంభంలో వ్యంజనంతోయకారం ఎకారంతో పర్యాయ ప్రవృత్తి చెందడం మహబూబ్‌నగర్ జిల్లాలో అంతట గమనించవచ్చు.

ఉదా - లేగ / ల్యేగ

మేత /మ్యేత మొ||

2. సామ్యార్థంలో కింది ప్రత్యయాలు ఈ జిల్లాలో కనిపించాయి.

-తీర్గ : దాని తీర్గ

-టట్టు : తినేటట్టు, పోయేటట్టు

-లెక్క : దాన్లెక్క, రంగులెక్క

-మాద్రి : దీని మాద్రి

3. -దంక, - కెల్లి, - కెంచి అనే ప్రత్యయాలు కాల స్థలవాచి ప్రత్యయాలుగాను, - అంత స్పష్టార్థంలో జిల్లా అంతటా కన్పిస్తాయి.

-దంక : తెల్లందంక, మక్తల్ దంక

-కెల్లి : పొద్దటికెల్లి, తాలూకాకెల్లి

-కెంచి : దానికెంచి

-అంత : మొత్తమంత, పొద్దంత

4. -'గిట్ల- గిన' అనే ప్రత్యయాలు - 'కానీ' అర్థంలో వ్యవహారంలో ఉన్నాయి.

నాదిగిట్ల / నాదిగిన

టీ గిట్ల /టీగిన

5. భావార్థకాల ప్రయోగంలో ప్రమాణ భాషలో వ్యవహారించే ప్రత్యయం -అడం/ -అటం స్థానే -ఉడం / -ఉడంగా కనిపిస్తుంది. ఇది కాకుండా -అందికి,

- అందుకు అనే ప్రత్యయాలు కూడా ఈ అర్థంలో ఉపయోగంలో ఉన్నాయి.

| | |
|---|---|
| - ఉడం | చదువుడం |
| | రావుడం |
| | కలువుడం |
| - అందికి | తినేటందికి |
| | చూసేటందికి |
| - అందుకు | దుంకెతందుకు |
| | లేపెటందుకు |
| -ఉటం | కలుసుటం |

భావార్థకంలో పై ప్రత్యయ రూపాలేకాకుండా ప్రాచీన రూపాలైన -డు, -అకం చేరిన రూపాలు విస్తృతంగా ఉండి వ్యవహార ప్రాంతీయతను సంతరించుకుంటున్నాయి.

| | | |
|---|---|---|
| -డు | చదువుడు | |
| | ఒర్లుడు | |
| | తినుడు | |
| | పండుడు | మొ॥ |
| - అకం | రాస్కం | |
| | తిన్కం | |

భావార్థకాల రూపాలలో 'కి' చేరినప్పుడు సమీకృత రూపాలలో కొంత వైవిధ్యం గోచరిస్తుంది.

| | |
|---|---|
| తినడానికి | తిన్నీకి / అన్నీకె |
| చదవడానికి | చద్వనీకి / చదవనీకె |
| వినడానికి | విన్నీకి / విన్నీకె |

6. క్త్వార్థక శత్రర్థక వ్యతిరేక ధాతురూపాలకు 'వచ్చు' క్రియ అవ్యతిరేకరూపం చేరి వర్తమాన వ్యతిరేక క్రియారూపాలు ఏర్పడటం ఈ జిల్లా ప్రాంతీయ లక్షణం.

| **అవ్యతిరేకం** | **వ్యతిరేకం** |
|---|---|
| వింటున్నడు | వినకొచ్చిండు |
| తెస్తున్నడు | తేకొచ్చిండు |
| పోతున్నది | పోకొచ్చిండు |
| వస్తున్నరు | రాకొచ్చిండ్రు |

పైన సూచించిన ఉదాహరణలలోని వ్యతిరేక రూపాలలో వరసగా క్త్వార్థక వ్యతిరేక ధాతురూపాలయిన 'వినక, తేక, పోక, రాక' లకు 'వచ్చు' క్రియ వర్తమానార్థక రూపం లింగ, వచన, పురుష ప్రత్యయాలు చేరగా ఏర్పడుతున్నాయి. ఈ ప్రక్రియ జరిగేప్పుడు వచ్చు క్రియలోని వకారానికి లోపం జరిగి అకారం వర్తులీకృతం అయి ఒకారంగా మారడం గమనించవచ్చు.

7. మహబూబ్‌నగర్ మాండలికంలో ఉపయోగించే కాల సూచక పదాలు కొన్ని ఈ విధంగా ఉన్నాయి.

| | |
|---|---|
| ఉదయం | పొద్దునే / పొద్దుగాల |
| తెల్లవారుఝామున | నస్కుళ్ళ, మబ్బున |
| మధ్యాహ్నం | అబంటేల్ల |
| సాయంకాలం | పొద్మీంకిల (పగటేల) |
| రాత్రికి | మాపట్కి |

8. ప్రశ్నార్థకాలను వ్యక్తీకరించడంలో తానాన్ని ఉపయోగించడం, ఇతర తెలంగాణా ప్రాంతంలో ఉన్నట్టుగా ఈ జిల్లాలో అధికంగా ఉన్నది.

| ప్ర. రూ | మ. రూ |
|---|---|
| విన్నదా? | విన్నాదే? |
| చదివారా? | చదివినారె? |
| చెప్పావా? | చెప్పినావు? |

ఈ ప్రశ్నార్థక తాన రూపాల్లో క్రియారూపంలో ఇనా రావడం గమనించదగిన అంశం.

నల్లగొండజిల్లా ప్రభావంవల్ల ప్రశ్నార్థక రూపాల్లో కొన్ని తాలూకా కేంద్రాల వ్యవహారంలో వైవిధ్యం కనిపిస్తుంటుంది.

9. సాధారణంగా తెలుగు భాషా వ్యవహారంలో అంతటా కనిపించే పదాది తాలవ్య, కంఠ్యాచ్చుల ముందు య, వలు శ్రుతులుగా రావడం ఈ జిల్లాలోనూ కనిపిస్తుంది.

ఇయ్యాల / యియ్యాల
ఏడ / యేడ
ఊరట / వూరట
ఒర్లు / వొర్లు

10. ప్రార్థనార్థక రూపాల ప్రయోగంలో ప్రమాణ రూపంలో లాగా అణ్మధ్యాలుగా కాకుండా ఉణ్మధ్యాలుగానే ఉండిపోవడం ఈ జిల్లాలో సర్వసాధారణం.

| | | |
|---|---|---|
| పిల్చు | పిలవండి | పిల్వుండ్రి/ పిల్వుని |
| కలియు | కలవండి | కల్వుండ్రి / కల్వుని |
| దున్ను | దున్నండి | దున్నుండ్రి / దున్నుని |

11. జిల్లా అంతటా నిరక్షరాస్యుల్లో పిల్చు ధాతువు భూతకాలరూపంలో చకారం సకారంగా మారుతోంది.

పిల్సిండు
పిల్సినవ్ మొ॥

'కలియు' ధాతువు భూతకాలరూపాల్లో సకారం చకారంగా మారుతోంది.

కల్చిండు
కల్చినవ్ మొ॥

12. లేచు క్రియ భూతకాలంలో సకారం విన్పిస్తోంది.

లేసిండు
లేసిండ్రు
లేసిరా మొ॥

13. విధి, ఉద్యుక్తార్థంలో 'అలి' తో పాటు 'బడు' కూడా కన్పించడం విశేషం.

తినబడ్తది
చేయబడ్తది. మొ॥

**14.** తుమర్థరూపాల మీద - అంగనే ప్రత్యయం చేర్చి చర్య సంపూర్ణతను సూచిస్తారు.

తినంగనే

కొట్టంగనే

సదవంగనే

తిప్పంగనే మొ॥

**15.** పిలువు, కలియు క్రియల ప్రయోగంలో కొంతమేరకు ప్రయోగంలో వైవిధ్యం కనిపిస్తూంటుంది. షాద్‌నగర్, గద్వాల కేంద్రాల వ్యవహారంలో వ్యతిరేక, ప్రార్థనాది రూపాల్లో వకార రహిత రూపాలు కనిపించాయి. మిగిలిన కేంద్రాల వ్యవహారంలో వకార సహిత రూపాలు కనిపిస్తుంటాయి.

| షాద్‌నగర్ గద్వాల కేంద్రాలు | ఇతర కేంద్రాలు |
|---|---|
| పిలడు | పిల్వడు |
| కలడు | కల్వడు |
| కలుండ్రి | కల్వుండ్రి |
| పిలుండ్రి | పిల్వుండ్రి |

**16.** ఇచ్చు, లేచు క్రియల వ్యతిరేక రూపాల ప్రయోగంలో కొంత వైవిధ్యం కనిపిస్తోంది.

వ్యతిరేక రూపాల్లో 'ఇయ్యలే' అన్నది అన్ని కేంద్రాలలో ఉన్నప్పటికీ, దీనికి పర్యాయ రూపంగా షాద్‌నగర్, జడ్చర్ల, వనపర్తి కేంద్రాలలో 'ఇచ్చిలే' వంటివి వ్యవహారంలో ఉన్నాయి.

అట్లాగే 'లేచు' క్రియ వ్యతిరేకరూపాల్లో 'లెయ్యను / లెవ్వను', వంటిరూపాలుగా లెయ్యలేను లేస్తలేను, లేచి లేను వంటివి షాద్‌నగర్, వనపర్తి, గద్వాల కేంద్రాలలో వ్యవహారంలో కనిపించాయి.

18. 'అయితే' అన్న అర్థంలో '-గిన' ప్రత్యయాన్ని ప్రయోగించడం ఈ జిల్లాలో ప్రాచుర్యంగా గోచరిస్తుంది.

చూస్తేగిన

పోతేగిన మొ||

19. భూతకాల రూపానికి – అంటే చేర్చి ప్రయోగించడం వల్ల చేదర్థాన్ని సాధిస్తారు. ఇటువంటి అర్థసాధన లోగడ ఆదిలాబాదు జిల్లా పరిశీలనల్లో వెల్లడి అయింది.

చదివిందంటే

పోయిందంటే మొ||

20. తద్ధర్మార్థక మహది తరవ్యతిరేక రూపాల్లో పురుష ప్రత్యయం ఈ జిల్లాలో వైవిధ్యంతో కూడి కనిపిస్తుంది.

పిలదు – పిల్వదు / పిల్వది.

తెలియఁదు – తెల్వదు / తెల్వది

బహువచనంలో ఈ రూపాల్లో పురుష ప్రత్యయరూపం 'వు' కు బదులుగా 'యి' వస్తుంది.

కలవవు – కల్వయి / కలవయి

చేయవు – చెయ్యయి / చెయయి

21. తెలియు క్రియ వ్యతిరేక పర్యాయ రూపాలు ఈ జిల్లా అంతటా ఈ విధంగా కనిపిస్తుంటాయి.

తెలియదు – గుంటూరు జిల్లాను అనుకొని ఉన్న అచ్చంపేట తాలూకా కేంద్రంలో

తెల్వదు / తెలవదు – ఇతర కేంద్రాలు

తెలియు క్రియార్థాన్ని సూచించేందుకు 'ఎరుగు' క్రియ ప్రాచుర్యంలో ఉంది. దీనికి వ్యతిరేక రూపం 'ఎర్క లేదు' అనేది వ్యవహారంలో గోచరిస్తుంది.

22. అభ్యర్థనార్థంలో 'కూర్చొను' క్రియ ప్రయోగించేప్పుడు విద్యావంతుల్లో 'కూచో' గాను నిరక్షరాస్యుల్లో 'కూకొ / గూకో' గాను ఉంది.

23. ఈ జిల్లాలో నిశ్చయార్థక ప్రత్యయంగా – 'ఆలె' వాడకంలో ఉంది. నాగర్‌కర్నూలు కేంద్రంలో – 'ఆలె' తో పాటుగా – 'ఆలి' వినిపించింది. అట్లాగే కల్వకుర్తి కేంద్ర వ్యవహారంలో అదనంగా – 'ఆల' కూడా వినిపించింది.

ఉండాలి - ఉండాలె

కలవాలి - కల్వాలె

లేవాలి - లెయ్యాలె / లెవ్వాలె మొ॥

24. వాక్యపూరకాలుగా అక్షరాస్యుల్లో – అన్నమాట చేర్చి ప్రయోగించడం జరిగింది.

పోతవ్ అన్నమాట

చదువతవ్ అన్నమాట

ఒక్కోసారి ఈ పూరకాలుగా వాక్యభాగాలు కూడా ఆవృత్తమవుతుంటాయి.

చెప్పొచ్చేదేంటంటే

నిరక్షరాస్యుల్లో జిల్లా అంతటా ప్రాంతీయంగా – 'అన్నట్టు' అనేది వాక్యపూరకంగా కనిపిస్తుంది.

... వస్తున్నడన్నట్లు

... సద్వుతడన్నట్లు

... పొద్దడన్నట్లు

25. గద్వాల, ఆలంపూర్, కొల్లాపూర్ తాలూకా కేంద్రాల వ్యవహారం మీద కర్నూలు జిల్లా వ్యవహార ప్రభావం కనిపిస్తూంటుంది. ఆ ప్రభావ లక్షణాలను ప్రధానమైనవి కొన్నింటిని దిగువ చర్చించడం జరిగింది [1].

1. వ్యతిరేక క్త్వార్థక రూపానికి –గా ప్రత్యయం చేరడంవల్ల అవ్యయాలు ఏర్పడటం.

---

1. తెలుగు మాండలికాలు : కర్నూలు జిల్లా (బులిటెన్) ఆధారంగా ఈ విషయాలను చర్చించడం జరిగింది.

2 ఈ ప్రత్యయాన్ని / లక్షణాన్ని తెలంగాణా ప్రాంతీయ లక్షణంగా భద్రిరాజు కృష్ణమూర్తి గుర్తిస్తున్నారు. (ఎగ్రామర్ ఆఫ్ మాడర్న్ తెలుగు, 1985 పే 347, పాదసూచిక) .....

పెన్సిల్ చెక్కుండగా

బతక్కుండగా మొ||

2. మూర్ధన్య టకార స్థానంలో దంత్య వర్ణాన్ని - తకారాన్ని ఉపయోగించడం.

(తద్ధర్మ) భూత కాలేతర క్రియాజన్య విశేషణాల - ఏటి [2] ప్రత్యయ ప్రయోగంలో మూర్ధన్యం బదులు దంత్యం వస్తుంది.

వచ్చేటప్పుడు - వచ్చేతప్పుడు

పోయేటాలికి - పోయేతలికి మొ||

3. 'తోల్కోని వచ్చు' రూపం పశు పక్ష్యాదులకే ప్రమాణ భాషలో పరిమితమై ఉండగా ఉత్తర మండలంలో మానవ పరంగానూ, ఇక్కడ సంఘటన / ప్రయోజన పరంగానూ ఉపయోగించడం జరుగుతోంది.

పెండ్లికి తోల్కోస్తం

పెండ్లామ్‌ని తోల్కపోడు

బిడ్డని తోల్కపోయింది. మొ||

4. సహచారి సంబంధకారకంలో ఇతర ప్రత్యయాల తోపాటుగా 'తోన' ఉపయోగించడం.

బెల్లంతోన

కర్నూల్ తోన మొ||

---

''తెలంగాణా మాండలింకంలో 'ఏ' ప్రత్యయం 'ఏటి' గా ఉంటుందనీ, హల్లుల ముందు (ఉదా - వచ్చేటివాడు) అచ్చుల ముందూ (వచ్చేటప్పుడు మొదలగు) వస్తుందనీ, ఏటి ప్రత్యయం మధ్యయుగ శాసన భాషలో భూతేతర క్రియా జన్య విశేషణాలకు ఉపయోగించే వారనీ, ఆధునిక ప్రమాణ భాషలో అచ్చుల ముందు మాత్రం నిలిచి ఉందనీ,'' పేర్కొన్నారు.

అయితే మాండలిక పరిశీలనల్లో ఈప్రత్యయం రాయలసీమ ప్రాంతంలోనూ విస్తృతంగా ఉపయోగంలో ఉందని గమనించడం జరిగింది. ఆకారాది పదాలు లేదా అకారయుక్త పదాల ముందే ఈ ప్రత్యయం ఉపయోగంలో ఉంది తప్ప మిగిలిన వాటి ముందు - ఇకార, ఎకారాలముందు

5. ఉపర్యర్థంలో ప్రాచీన ప్రత్యయమైన – మింద ఉపయోగించడం

దాని మింద

మామిందకి మొ||

6. 'లెక్క' ను తులనార్థకంలో ప్రయోగించడం .

దాని లెక్క

బర్రె లెక్కుండె మొ||

7. 'పాడై పోవు' అన్న అర్థంలో 'గబ్బులేసి పోవు' అన్న పద బంధ ప్రయోగం ఈ జిల్లాలోనూ ఉంది.

ఇప్పుడు లేస్తే గిన్నగబ్బు లేసి పోతది. మొ||

8. గిన్క (< కనుక / గనుక) అనే అవ్యయాన్ని ప్రయోగించడం.

చేస్తమంటే గిన్క

వేస్కుంటే గిన్క మొ||

9. 'దొబ్బు' అనే క్రియ ప్రమాణార్థంలో 'దొంగతనం / కొట్టేయు' అర్థంలో కాక 'తోయు' అన్న అర్థంలో 'నూకు' క్రియకు పర్యాయంగా ప్రయోగించడం.

కొండ మీద్కెల్లి పడదొబ్బిండ్రు మొ||

26. అచ్చంపేట కేంద్ర వ్యవహార ప్రాంతం గుంటూరు జిల్లాను ఆనుకొని ఉండటం వల్ల ఈ ప్రాంతం పై మధ్యాంధ్ర మండల ప్రభావం ఉంది. ఇక్కడ కనిపించే ప్రధాన లక్షణాలను కొన్నింటిని దిగువ చర్చించడం జరిగింది [3].

1) ఈ కేంద్ర వ్యవహారంలో తాలవ్యీకరణ చెందిన రూపాలు కనిపిస్తుంటాయి.

---

కనిపించడంలేదు. *వచ్చేటప్పుడు,* వచ్చేటప్పుడు వంటివి సాధ్యం కావడం లేదు. ఈ అంశం గురించి మరింత నిశితంగా పరిశోధించాల్సి ఉంది.

3) తెలుగు మాండలికాలు : గుంటూరు జిల్లా (బులిటెన్) ఆధారంగా ఈ విషయాలను చర్చించడం జరిగింది.

తాలవ్యయకారం ముందుండే హల్లు తాలవ్యీకరణ చెందుతుంది. ఇతర కేంద్రాలలో హల్సమీకరణం కనిపిస్తూంటుంది.

| | | అచ్చంపేట | ఇతర కేంద్రాలు |
|---|---|---|---|
| సత్యం | - | సచ్చెం | సత్తెం |
| ముత్యం | - | ముచ్చెం | ముత్తెం |
| పద్యం | - | పజ్జం | పద్దెం |

2) బహువచన పదరూపాల్లో ఇతర కేంద్రాల వ్యవహారానికీ ఈ వ్యవహారానికీ ఈ వ్యవహారానికి కొంత వైవిధ్యం గోచరిస్తుంది.

| | | |
|---|---|---|
| ముల్లు | ముళ్ళు | ముండ్లు / మున్లు |
| ఇల్లు | ఇళ్ళు | ఇండ్లు |
| తమ్ముడు | తమ్ముళ్ళు | తమ్ముండ్లు |
| చెల్లెలు | చెల్లెళ్ళు | చెల్లెండ్లు |
| బండి | బళ్ళు | బండ్లు |
| పండు | పళ్ళు | పండ్లు |

3) సంఖ్యా పదాల ప్రయోగంలో ఇదే విధంగా పర్యాయ రూపాలు కనిపిస్తుంటాయి.

| | | |
|---|---|---|
| 100 | వంద | నూరు |
| 200 | రెండొందలు | ఇన్నూరు / రెండునూర్లు |
| 300 | మూడొందలు | మున్నూరు / మూడునూర్లు |
| 400 | నాలుగొందలు | నన్నూరు / నాలుగునూర్లు |

4) ఇదే విధమైన తాలవ్యీకరణ రంగారెడ్డి జిల్లాలోను కనిపిస్తుంది. ఆ వ్యవహార ప్రభావం ఉండే మహబూబ్‌నగర్ జిల్లాలోని తాలూకా కేంద్రంలోనూ కనిపిస్తూంటుంది. (26.6)

4) క్రియా పద ప్రయోగాలలో వైవిధ్యాలు ఈ విధంగా గోచరిస్తాంటాయి.

| | | |
|---|---|---|
| కృదంతాలు – | ఉండటం | ఉండకం/ఉండుడు |
| | పిలవడం | పిల్సకం /పిల్సుడు. |
| నిశ్చయార్థకం | రావాలి | రావాలె / రావాల |
| | కలవాలి | కలవాలె/కల్వాల |
| | కావాలి | కావాలె/కావాల |
| వర్తమానార్థకం | వస్తూ | వస్తా / వచ్చుకుంట |
| | చూస్తూ | చూస్తా/చూసుకుంట |

5) వ్యతిరేకార్థాల ఉపయోగంలో పర్యాయరూపత కనిపిస్తాంటుంది.

గుంటూరు జిల్లా ప్రభావం ఉన్న వ్యవహారంలో నిషేధార్థంలో వాకు /బాకు ప్రత్యయాలు గోచరిస్తే (ఉదా – చెయ్యి వాకు / చెయ్యి బాకు) ఈ ప్రభావం లేని ప్రాంత వ్యవహారంలో వొద్దు క్రియతో నిషేధం (ఉదా – చెయ్యొద్దు, వినొద్దు మొ.) కనిపిస్తుంటుంది.

6) ప్రశ్నార్థక సర్వనామాలలో వైవిధ్యాలు ఈ విధంగా ఉంటాయి.

| | | | |
|---|---|---|---|
| ఏడ/యాడ | - | యేడ / యాడ | |
| ఏటికి | - | ఏమిటికి | |
| ఎప్పుడు | - | ఎన్నడు | |
| ఎట్ల | - | ఎట్ల | |
| ఏంది | - | ఏమిటిది | |
| ఎవరు/ఓరు | - | ఎవలు/ఓలు | మొ|| |

7) పద జాలంలో కనిపించేవైవిధ్యం ప్రాంతీయతకు భంగం కలిగించని విధానంలో కొనసాగుతుంటుంది.

| | | |
|---|---|---|
| అద్దె | - | కిరాయి |
| మాగాణి | - | తరి |

| | | |
|---|---|---|
| చివరికి | - | కొనాకు |
| బాగా | - | చానా / చాలా |
| కొట్టు | - | దుక్నం / అంగడి |
| మేష్టారు | - | సార్ / పంతులు |
| తాళం చెవి | - | కీలి / తాలం చెయి |
| డబ్బు | - | దుడ్డు |
| రోజు | - | దినం / దివసం |
| సోమరి | - | సోంబేరి |
| ఉల్లిపాయ | - | ఉల్లిగడ్డ |
| మనుష్యులు/మడుషులు | - | మనుసులు |

| | | |
|---|---|---|
| కొలత పదాలు | అర్ధ/అర్ధ | అద్ద / ఆదా |
| | ముప్పావు | ముక్కాలు / తీన్‌పావు |
| | సెంట్లు | గజాలు / కుంటలు |

27. కల్వకుర్తి, అచ్చంపేట తాలూకా కేంద్రాలు వ్యవహారం మీద నల్లగొండ జిల్లా ప్రభావం కనిపిస్తూంటుంది. ప్రధాన లక్షణాలను కొన్నింటిని చర్చించడం జరుగుతోంది.[4]

1. ర/ల మార్పిడి ;

ఒకరు / ఒగలు

కక్కుర్తి / కక్కుల్తి

ఉప్పరి / ఉప్పలి

యెసరు / యెసలు

---

5. నల్లగొండ జిల్లా మాండలిక పదకోశం (రచయిత – డాక్టర్. ఆర్. శ్రీహరి, పతంజలి పబ్లికేషన్స్, హైదరాబాదు. 1986) ఆధారంగా ఈ విషయాలను చర్చించడం జరిగింది.

2. ద్వితీయ విభక్తిలోపం : కొన్ని బహువచనాంత పదాల్లో ద్వితీయా విభక్తి ప్రత్యయ లోపం కనిపిస్తుంది.

బర్ల (ను) మేపుకొనొచ్చిండు.

మిమ్ల (ను) రమ్మన్నరు.

మ్యేకల (ను) తోల్కొస్తండ్రు.

3. ప్రాచీన కావ్య భాషలో కాల - అధ్వావాచకాలకు పంచమ్యర్థంలో 'కోలెన్' ప్రత్యయం కనిపిస్తుంది. వ్యవహారంలో పరిమిత ప్రయోగాలే కనిపించినా ప్రాచీనతను నిలుపుకునే లక్షణాన్ని ఈసందర్భంలో గమనించాలి.

పదేండ్ల గోలె....

పందిసాల గోలె...

4. క్త్వార్థకంపై వచ్చే భూతార్థక రూపాలలోను గాగమం వస్తుంటుంది.

వచ్చినుండె

పోయినుంటి

క్రియాపద బంధం మొత్తం సమీప భూతకాలార్థాన్ని సూచిస్తుంటుంది.

5. ప్రేరణార్థక ప్రత్యయంగా - ఇంచు / -ఇయి వ్యవహారంలో చెలామణిలో ఉంది. నల్లగొండ జిల్లా ప్రభావం వల్ల -'ఇచ్చు' కూడా కనిపిస్తుంది.

చేయించు / చేపియి చేపిచ్చు

కోయించు / కోపియి కోపిచ్చు

6. వ్యతిరేక క్త్వార్థక రూపంపై 'పోవు' ధాతువు, వ్యతిరేక తద్ధర్మం పై 'అగు' భూతార్థక క్రియను అనుబంధంగా చేర్చి వ్యతిరేక భూతార్థక రూపాలుగా ప్రయోగించడం ఈ ప్రాంతంలో కనిపిస్తుంది.

7. శత్రర్థక రూపాల ద్విరుక్తిలో అవధారణార్థంలో ఉకారం స్థానే అకారం వస్తుంది.

చదువుత చదువుత

రాస్త రాస్త

వింట వింట.

8. అప్యర్థకాలలో స్వార్థంలో గూడ, కానీ అనేవి చేరుతుంటాయి.

వచ్చిన గానీ

పోయిన కూడా / గూడ మొ॥

9. సంభ్యంత రూపాలను భావార్థకాలుగా జంటగా ప్రయోగించడం ఈ ప్రాంతంలో కనిపిస్తుంది.

రాయను చద్వను అంతే అనికి ఇంకొకపనిలేదు

(రాయడం, చదవడం)

సంపాదించను ఖర్చుపెట్టను అంతే వానిపని

(సంపాదించడం, ఖర్చు పెట్టడం)

10. వ్యతిరేక తద్ధర్మానికి 'అను' చేర్చి ప్రశ్నార్థకంగా ఉపయోగించడం ఈ ప్రాంత విశేషం.

వాడురాడను (- రాడా?)

వాడుపోడను (-పోడా ?)

28. కల్వకుర్తి, షాద్‌నగర్, కొడంగల్, మహబూబ్‌నగర్ తాలూకా కేంద్రాల మీద రంగారెడ్డి జిల్లా ప్రభావం అధికం. ఈ ప్రభావ లక్షణాలలో ప్రధానమైనవి దిగువ చర్చించడం జరిగింది.[6]

1. ప్రార్థనాద్యర్థకంలో ఈ కేంద్రాలలో ఇతర ప్రత్యయాలతో పాటు -'ప్రి' కూడా ప్రయోగించడం.

| | | |
|---|---|---|
| నడువు | - | నడువుప్రి |
| చెప్పు | - | చెప్పుప్రి |
| సదువు | - | సదువుప్రి |

---

6. తెలుగు మాండలికాలు : రంగారెడ్డి (బులిటెన్) ఆధారంగా ఈ విషయాలను చర్చించడం జరిగింది.

2. పేను, చేను, బహువచన రూపాలలో ఇతర కేంద్రాల వ్యవహారానికి, ఈ వ్యవహారానికి కొంత వైవిధ్యం గోచరిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| పేను | పేండ్లు | పేన్లు | పేలు |
| చేను | చేండ్లు | చేన్లు | చేలు |

3. 'కానీ' కి బదులుగా ఈ కేంద్రాలలో 'గిట్ట' కనిపిస్తే ఇతర కేంద్రాలలో 'గిన' కనిపిస్తూంటుంది.

| | |
|---|---|
| ... మూతిగిట్ట | ... మూతిగిన |
| ... డబ్బుల్గిట్ట | ... డబ్బుల్గిన |

4. మూడక్షరాల క్రియపదాల వ్యతిరేకంలో ఈ కేంద్రాల వ్యవహారంలో ఉణ్మధ్యాలు, అణ్మధ్యాలుగా మారుతుంటాయి. మిగిలిన కేంద్రాలలో ఉణ్మధ్యాలుగానే ఉంటూంటాయి.

| | | |
|---|---|---|
| తలుచు | తలవక | తలువక |
| కలియు | కల్సక / కల్చక | కలువక |

5. అవి, ఇవి, ఏవి సర్వనామాల ఔపవిభక్తిక రూపాలు ఈ కేంద్రాల వ్యవహారంలో వర్ణ వ్యత్యయరూపాలు కాకుండా యథాతథంగా ఔపవిభక్తిక ప్రత్యయ రూపాలు చేరి ప్రయోగం పొందుతాయి.

| | | |
|---|---|---|
| అవి | అవిటిని | వాటిని |
| ఇవి | ఇవిటిని | వీటిని |
| ఏవి | ఎవ్విటిని | వేటిని |

6. తాలవ్యీకృత రూపాలు ఉదా – పజ్జాలు, మజ్జాన్నం, గజ్జం వరుసగా పద్యాలు, మధ్యాహ్నం, గద్యం) రంగా రెడ్డి జిల్లా వ్యవహార ప్రభావం ఉన్న తాలూకా కేంద్రాల వ్యవహారంలో కనిపిస్తున్నాయి. ఇదేరకమైన తాలవ్యీకరణ మధ్యాంధ్ర వ్యవహార ప్రభావం ఉన్న (గుంటూరు జిల్లా) ఉన్న కేంద్ర వ్యవహారంలోనూ కనిపించింది. (26.1)

29. గద్వాల కేంద్ర వ్యవహారంలో 'స్త' సమీకరణం చెంది 'స్స' గా క్రియారూపాల్లో అధికంగా కనిపించింది. దక్షిణ మండల (రాయలసీమ జిల్లాల) వ్యవహార ప్రభావం వల్ల ఈ సమీకరణం విస్తరించి ఉండవచ్చు.[8]

| | | |
|---|---|---|
| పోయొస్తివే | > | పోయొస్సివే |
| మస్తుంటయ్ | > | మస్సుంటయ్ |
| చేస్తడు | > | చేస్సడు. |

30. గద్వాల, వనపర్తి కేంద్రాల వ్యవహారంలో కలియు, పిలుచు, క్రియల వ్యతిరేక రూపాల వాడకంలో రాయలసీమ వ్యవహార ప్రభావం వల్ల వకారానికి బదులుగా చకార, సకారాలు ఆ వృత్తమవుతుంటాయి.

| | | |
|---|---|---|
| కలియు | కల్వడు / కలవడు | కల్సడు |
| పిలుపు | పిల్వరు / పిలవరు | పిల్చరు/పిల్సరు/ |
| | | పిలచరు/పిలసరు |

అంతేకాకుండా భూతకాలవ్యతిరేకంలో సాధారణంగా ఏర్పడే రూపాలతో పాటు క్త్వార్థక రూపం మీద ఉండు వ్యతిరేక రూపాలతో ఏర్పడుతుంటాయి.

పిల్వలేదు / పిలలేదు

కల్వలేదు / కలలేదు

పిల్సలేదు

కల్సిలేదు మొ॥

31. ఆలంపురం కేంద్ర వ్యవహారంలో సామాన్యంగా ఏర్పడే శత్రర్థక రూపాలతోపాటు -'గానే' చేర్చి అదే అర్థాన్ని సాధించిన రూపాలు కనిపించాయి.

| | | | |
|---|---|---|---|
| ఇస్తూ- | ఇస్తా | - | ఇస్తుండగానే |
| లేస్తూ- | లేస్తా | - | లేస్తుండగానే |

---

8. రాయల సీమ వ్యవహారంలో ఈ లక్షణం ఉందని (కర్నూల్, కడప జిల్లాల బులిటెన్లు) లోగడ పరిశీలనలు తెలియజేస్తున్నాయి.

**32.** ఈ జిల్లా వ్యవహారంలో అరుదుగా –'అంటే' ప్రయోగించి చేదర్థకం సాధించిన ప్రయోగాలు కనిపించాయి.

చేస్తే – చేస్తుండెనంటె

ఇస్తే – ఇస్తుండెనంటె

**33.** కొడంగల్ కేంద్ర వ్యవహారంలో ప్రార్థనార్థక రూపాల్లో –'న్రి, –డ్రి లతో పాటు సమీకృత రూపమైన –్రి ప్రత్యయం కనిపిస్తుంది. ఉదా – చెయ్యు్ౖరి, పిల్వు్ౖరి ఇయ్యు్ౖరి మొదలయినవి.

**34.** వ్యవహారంలో ప్రాంతీయతను ప్రతిబింబించే పద బంధ భావనలలో కొన్ని:

మూతిమీద చెప్పు

మొగం మీద కొట్టు

నెత్తిమీద రూపాయి పెట్టు

కుల్లాగాచెప్పు

కత కొత్తదవు మొ॥

**35.** ఈ జిల్లా వ్యవహారానికే పరిమితమైన బహువ్రీహ్యర్థక పద బంధాలు కొన్ని ఆసక్తికరమైనవి గోచరించాయి[9] ఉదాహరణకు

| | |
|---|---|
| నడిగడ్డ | (– గద్వాల) |
| మొల్కసీమ | (– ఆలంపురం) |
| పాలమూరు | (– మహబూబ్‌నగర్) |
| కారంచట్నీ | ( – ఊరగాయ) |
| పలారం బండ్లు | (– సంక్రాం తికి గుడి దగ్గరికి పోయిరావడానికి అలంకరించిన బండ్లు) |

9. 'పాలమూరు జిల్లా పలుకుబడులు' అన్న వ్యాసంలో కపిలవాయి లింగ మూర్తి తెలుగు, (డిసెంబర్'95) పే. 37–43 మరికొన్నింటిని వివరించారు. అందులో ప్రధానమైనవి:
అంచెబుట్టి / అంచెగాడిది – విసుగూ విరామం లేకుండా అటూ ఇటూ తిరిగేవాడు.
ఇటుకల రాయని గుర్రం – ఎవరికీ దొరకని వాడు.
చిన్నమున్నూరు – పెదమున్నూరు – ఎక్కువ సందడిలేదా వస్తు దాయం ఉన్న స్థలం

36. నిరక్షరాస్యుల వ్యవహారంలో కృతకసాధురూపాలు,[10] లోకనిరుక్తులు [11] సర్వ సాధారణంగా కనిపిస్తుంటాయి. ఈ జిల్లా వ్యవహారంలో కనిపించిన వాటిలో ప్రధానమైనవి కొన్ని :

ఎ) హకారం చేర్చడం :

హండా (< అండా)

హారతి (< ఆరతి)

బి) సంయుక్తాక్షరాల మార్పిడి :

సార్తులు (< సార్లు)

స్తానం (< స్నానం)

లోకనిరుక్తులు : గస్తీ ఆఫీసరు (< గజిటెడ్ ఆఫీసర్)

పురికోన (< పురికొస)

దండదీపం (< గండదీపం)

37. రాజకీయ, సామాజిక కారణాల దృష్ట్యా వ్యవహారంలో ఆంగ్ల పద సమ్మేళనం భాషలో తప్పని సరి లక్షణం అయింది. ఈ జిల్లా వ్యవహారం ఇందుకు అపవాదం ఏమీకాదు. విద్యావంతుల్లో యథాతథంగానూ, నిరక్షరాస్యుల్లో కొద్ది మార్పుల తోనూ, ఇంగ్లీషు పదాలు ఉపయోగంలో ఉంటాయి. ఈ జిల్లా వ్యవహారంలో కనిపించిన వాటి ఆధారంగా స్థూలంగా కొన్ని మార్పులను ఇక్కడ ఉదాహరించడం జరుగుతోంది.

---

జిల్లేడు దూది – గమ్యం లేకుండా తిరిగేవాడు
దమ్మన్నదాడి – 'దమ్మన్న దాడి పీని దాడి పాడుగానూ' అని వ్యవహారం
నత్తెల్లయ్య తుపాకి – మాటనమ్మకంలేని వాడు
పెద్దగోపన్న పెట్ట – రహస్యమైతాకరాని దానిని సూచించడం
ముసలి చిలుక – ఎంత నీతులు చెప్పినా పాటించని వ్యక్తి
మేన పెద్దయ్య చుట్టం – ఆజ్ఞ మీర కుండా వచ్చే వ్యక్తి.

10. భాషలో సహజమైన సాధురూపాల స్థానే కొత్త మార్పులతో సామాజికంగా గౌరవ ప్రదమని భావించిన వాటిని సమాజ రూపాలుగా ప్రవేశపెట్టినవే కృతకసాధురూపాలు.

11. వ్యుత్పత్తి స్పష్టంగా నిరూపించలేని పదానికి వ్యవహర్తలు ఒక అర్థాన్ని ఊహించడం, తదనుగుణంగా ఆపదంలోని ఒకటి రెండు వర్ణాలను లేదా పదాలను మార్చడం లోక నిరుక్తి లేదా జన నిరుక్తి అంటారు.

1. పదాదిన సంయుక్తాల తొలగింపు : పదం ప్రారంభంలో ఉండే సంయుక్తాక్షరాలను స్వర భక్తి ద్వారా తొలగించి వేయడం.

| | | |
|---|---|---|
| School | > | ఇస్కూలు |
| Slate | > | సిలేటు |
| Glass | > | గిలాసు మొ॥ |

2. అచ్చుల మార్పిడి :పదంలో ఉన్న అచ్చు స్థానంలో మరో అచ్చు ప్రవేశపెట్టడం.

| | | |
|---|---|---|
| Ticket | > | టికట్టు |
| Voter | > | వాటర్ |

3) అచ్చులను చేర్చడం :

| | | |
|---|---|---|
| Touring | > | టూరింగు |
| Ticket | > | టిక్కెట్టు |
| Road | > | రోడ్డు |

4) హిందుస్తానీ పదాలను చేర్చి పదబంధాలుగా ప్రయోగించడం :

రేజర్ పత్తి

రసీదు టిక్కెట్టు

మోటర్ గాడీ మొ॥

5) సంయుక్తాలు కల్పించడం : పద మధ్యంలో అచ్చును తొలగించడం ద్వారా సంయుక్తాలు ఏర్పడు తుంటాయి.

| | | |
|---|---|---|
| Cinema | > | సైన్మ |
| Officer | > | అప్సర్ |
| Hotel | > | వోట్లు / ఓట్రు మొ॥ |

6) పదాలను / పదబంధాలను బహువ్రీహ్యార్థంలో ప్రయోగించడం

సర్వీసు (- ప్రయివేటు బస్ అన్న అర్థంలో)

మీన మోటర్ (విమానం అన్న అర్థంలో )

గాలిమోటర్ ( " )

7. విషయ ప్రాధాన్యం హెచ్చించేందుకు ఒకే అర్థం వచ్చే పదాలను పునరా వృత్తి చేయడం.

మోటర్ బస్

పేపర్ కాయితం మొ॥

8. తెలుగు క్రియలను ఆంగ్ల నామాలు చేర్చి ప్రయోగించడం

లూజ్ - అవు

పేక్ - చేయు

గుల్కోస్ - పెట్టు (< గ్లూకోజ్)

జాయిన్ - చేయు

ఇంట్రెస్టు - లేకపోవు

హార్డ్ - ఉండు

కాపీ - జర్గు మొ॥

9. తెలుగు బహువచన రూపాలను విభక్తి ప్రత్యయాలను ఆంగ్ల నామాలకు చేర్చి ప్రయోగించడం·

స్కూల్ - లో

కేస్ - ల

ప్రిన్సిపల్ - దగ్గరికి

డాక్టర్ - కొరకు

సినెమా - కు

త్రీడేస్ - ముందు

బాల్ - లు మొ॥

38. ఒక విభక్తి ప్రత్యయానికి మారుగా మరో విభక్తి ప్రత్యయం ఉపయోగించడం:

<u>మాకే</u> అనలైజ్ చేస్కుంటం (=మేమే)

<u>నాదే</u> గెల్సొచ్చింది (= నాకు)

<u>మందిమి</u> పోయినం (= మేము)

39. ఒకే ఉద్వేగ భావాన్ని సూచించే సందర్భంలో ఈ జిల్లా వ్యవహారంలో ఒకటి కన్నా ఎక్కువ పదాలు వాడుకలో కనిపించాయి.

భయం - బుగులు, దిగులు, బయం, దడుప్పు
పిచ్చి - తిక్క, పిస, చిరాకు
దాహం - దూప, మంచినీళ్ళు
వేడి - కాక, గర్మి, ఉడుకు

40. బంధుత్వబోధక పదాల్లో ఒకే బంధుత్వాన్ని సూచించేందుకు పర్యాయరూపాలనేకం ఉన్నాయి. ప్రధానమైనవి కొన్ని:

నాన్న : నాయ్న, అప్ప, అయ్య, బాపు
అమ్మ : ఆయమ్మ, పెద్ది, పెద్దమ్మ
పిన్ని : చిన్నమ్మ, చిన్ని
బామ్మ : జేజి, అవ్వ, నాయ్నమ్మ, నానమ్మ
పెదనాన్న : పెద్దయ్య, పెదబాబు, పెద్దప్ప
చిన్నాన్న : చిన్నాయ్న, కక్కయ్య, కాక, చిన్నప్ప

## II మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారం – అన్య భాషా ప్రభావం

మహబూబ్‌నగర్ జిల్లాకు ప్రాంతీయంగా కర్ణాటక రాష్ట్రం సరిహద్దుగా ఉండటం వల్ల కన్నడ భాషా ప్రభావం అంతర్లీనంగానూ, బాహ్యంగానూ కనిపిస్తూంటుంది. ముస్లిముల పరిపాలనలో ఈ జిల్లా కొనసాగడంవల్ల చారిత్రకంగా హిందుస్తానీ, – ఉర్దూ భాషా ప్రభావం అధికంగానే కనిపిస్తూంటుంది. కన్నడ, ఉర్దూ భాషా ప్రభావాలు ఏరకమైన లక్షణాలు కనబరుస్తాయో ఈ అధ్యాయంలోని వేర్వేరు విభాగాలలో విశ్లేషించి చర్చించడం జరిగింది.

### 3.2.1 కన్నడ భాషా ప్రభావం [1]

ఇంతకు ముందుగానే పేర్కొన్నట్టుగా ప్రాంతీయంగా ఈ జిల్లాలోని గద్వాల, కొడంగల్, ఆత్మకూరు, మక్తల్ తాలూకాలకు కర్ణాటక రాష్ట్రం సరిహద్దుగా ఉంది. ఈ దృష్ట్యా జిల్లాను రెండు ప్రాంతాలుగా విభజించవచ్చు.[2]

1. కన్నడ భాషా సాన్నిహిత్యప్రాంతం - గద్వాల, కొడంగల్, అత్మకూరు, మక్తల్ తాలూకా ప్రాంతాలు.

2. కన్నడ భాషా సాన్నిహిత్యంలేని ప్రాంతాలు - మిగిలిన తాలూకా ప్రాంతాలు.

కన్నడ భాషా ప్రభావం ఈ జిల్లాకు ప్రాంతీయ లక్షణం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఉన్న ద్విభాషా భాషిత ప్రాంతాల తీరుతెన్నులను నిశితంగా విశ్లేషించినప్పుడు ఈ అంశాన్ని మరింత వివరంగా పరిశోధించాల్సి ఉంటుంది. ప్రస్తుతం ఈ జిల్లాలోనికన్నడ భాషా సాన్నిహిత్య ప్రాంతాలలో గోచరించే స్థూల లక్షణాలను, ప్రభావాన్ని మాత్రమే ప్రస్తావించడం జరుగుతోంది.

---

. ఈ జిల్లా వ్యవహారం ఆధారంగా గోచరించే ప్రభావాన్ని స్థూల పరిశీలన మాత్రమే చేయడం జరిగింది. సూక్ష్మాంశ విశ్లేషణకుగాను ఆంధ్రప్రదేశ్‌లోని ద్విభాషా భాషిత, బహుభాషా భాషిత ప్రాంతాలను వేర్వేరుగా ప్రత్యేక విధానాల్లో పరిశీలించి విశ్లేషించాల్సి ఉంటుంది.
ప్రస్తుత విశ్లేషణకు కిందివి ఆధార గ్రంథాలుగా ఉపకరించాయి.

1. **సెమినార్ పేపర్స్ ఇన్ కామన్ కోర్ వొకాబ్యులరీ ఇన్ ఇండియన్ లాంగ్వేజెస్,** (ఎడి.) ఎం. రామప్ప, (అసోసియేట్ ఎడిటర్ డా. ఎన్. శివరామమూర్తి, **1984,** ఇంటర్నేషనల్ తెలుగు ఇనిస్ట్యూట్, తెలుగు భవనం, హైదరాబాద్ - **500 007.**
2. **తెలుగు మీద కన్నడ భాషా ప్రభావం,** డా. అదవాని హనుమంతప్ప, **1989** కార్తికేయ పబ్లికేషన్స్ అనంతపురం.

2. ఇటీవలి పరిశోధనలలో పాండయ్య (1988) మహబూబ్‌నగర్ జిల్లాను మూడు వ్యవహార ప్రాంతాలుగా విభజించారు. అవి : ఉత్తరం - తూర్పు ప్రాంతం - మహబూబ్‌నగర్, జడ్చర్ల, షాద్‌నగర్, కల్వకుర్తి, అచ్చంపేట, దక్షిణ మధ్య ప్రాంతం - కొల్లాపూర్, నాగర్‌కర్నూల్, వనపర్తి, ఆత్మకూర్, ద్విబాషావ్యవహార ప్రాంతం - కొడంగల్, మక్తల్, గద్వాల్, ఆలంపురం. లోగడ వృత్తి పదాల వ్యవహార విభేద రేఖల ఆధారంగా భద్రిరాజు కృష్ణమూర్తి (మాండలిక వృత్తి పదకోశం - వ్యవసాయం . ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు - 1962) మహబూబ్‌నగర్ జిల్లాను ఉత్తర (కొడంగల్, మహబూబ్‌నగర్, షాద్‌నగర్, జడ్చర్ల, కల్వకుర్తి), మధ్య (మక్తల్, ఆత్మకూర్, వనపర్తి, నాగర్‌కర్నూల్, అచ్చంపేట) దక్షిణ (కొల్లాపూర్, ఆలంపురం, గద్వాల) గా విభజించారు.

ద్విభాషా వ్యవహారానికి కారణాలు ఏమైనప్పటికీ [3] ఈ జిల్లాలోని కన్నడ సాన్నిహిత్య ప్రాంతాలలో మాత్రం ప్రభావం ఇంచుమించు అందర్లోనూ కనిపిస్తుంది. అయితే ఇది నిరక్షరాస్యుల్లో బాహ్యంగానూ విద్యావంతుల్లో అంతర్లీనంగానూ గోచరిస్తుంది. సామాన్య వ్యవహారంలో ప్రాథమిక పదజాలం, బంధువాచకాల్లో కనిపించే యథాతథ పద గ్రహణాన్ని బాహ్య ప్రభావంగానూ, వ్యాకరణ, అర్థ, వాక్య రీతుల్లో కనిపించే ప్రభావాన్ని అంతర్లీన ప్రభావంగా పేర్కొనవచ్చు.

### 3.2.1 (ఎ) యథాతథ పద సంగ్రహణం :

ఈ జిల్లాలోని కన్నడ సాన్నిహిత్య ప్రాంతాల దైనందిన వ్యవహారంలో అనేకమైన అసంఖ్యాక పదాలు యథాతథంగా గోచరిస్తాయి. మచ్చుకి కొన్ని :

i) సాధారణ పదాలు

| | | | |
|---|---|---|---|
| కరగాసాలు | 'రంపాలు' | పొరక | 'చీపురు' |
| కేర్లు | 'వీథులు' | బేకు | 'కావాలి' |
| అప్పచ్చి | 'పిండివంట' | బేగి | 'త్వరగా' |
| ఆయకం | 'తాకట్టు' | జగ్గి | 'బిగ్గరగా' |
| ఉచ్చ | 'మూత్రం' | నస్కుళ్ళ | 'పొద్దున్నే' |
| ఉప్పిట్టి | 'ఉప్మా' | సుళ్ళు | 'అబద్ధం' |
| కట్టాయం | 'తప్పనిసరి' | హత్ర | 'దగ్గరగా' |
| కిలుం | 'చిలుము' | హాగే | 'అట్లాగే' |
| గొత్తు | 'తెలుసు' | లాసి | 'బిగ్గరగా' |
| చౌళేకాయ | 'గోకరకాయ' | సుద్ది | 'కబురు, వార్త' |

---

3. ద్విభాషా వ్యవహార ప్రాంతాల్లో వ్యవహర్తల్లో ద్విభాషికతకు భాషల సంసర్గమే మూలకారణము, రెండు సమాజాల సమ్మేళనంలో సంస్కృతి ప్రసారణం ప్రవర్తితమవుతుందని, భాషా సంసర్గం ఈ సంస్కృతిక సంబంధాలలో ఒకటని తూమాటి దొణప్ప (తెలుగు లోని వైకృత పదాలు ; పే. 296. తెలుగు భాషా చరిత్ర; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్ - 1974) అభిప్రాయం. ద్విభాషికతకు పి.సి. నరసింహారెడ్డి (సోషియో లింగ్విస్టిక్స్ ఏస్పెక్ట్స్ ఆఫ్ తెలుగు - తమిళ్ బైలింగ్వలిజమ్ విత్ స్పెషల్ రిఫరెన్స్ టువిత్ బైలింగ్వల్ తెలుగు స్పోకెన్ ఇన్ నగరి. శ్రీ వేంకటేశ్వర విద్యాలయానికి సమర్పించిన పి.హెచ్.డి. సిద్ధాంత వ్యాసం 1982) భాషా పరంగా, సామాజికపరంగా ఆరు ప్రమాణాలు పేర్కొన్నారు. అవి : వ్యవహర్త సౌలభ్యం, వ్యవహర్త వ్యక్తీకరణ, సహ వ్యవస్థ, ద్వైధీయ భావం, వ్యవహర్త ప్రతిభ, స్థాయి లేదా వక్తృత్వ స్థాయి ప్రయోజనం.

| | | | |
|---|---|---|---|
| ఇగ్గు | 'లాగు' | సాతె | 'స్కూలు' |
| ఎల్ల | 'అందరు' | లగ్గి | 'బిగ్గరగా' |
| కరంగె | 'సరయిందే' | ఉద్దర | 'అప్పు' |
| పెంము | 'పెనం' | | |

ii) బాంధవ్య బోధక పదాలు

| | |
|---|---|
| అప్పా! | 'సంబోధన, నాన్న' |
| యార్రు | 'ఎవరు' |
| నాను | 'నేను' |
| అణ్ణ | 'అన్నయ్య' |
| చిత్తప్ప | 'చిన్నాన్న' |
| బీగుడు | 'వియ్యంకుడు' |
| బీగుచి / బీగుదాలు | 'వియ్యపురాలు' |

iii) పదబంధాలు

| | | |
|---|---|---|
| నిమ్మజ్జితలె | 'నీ తలకాయ' | మొ \|\| |

---

జె. వేంకటేశ్వర శాస్త్రి ఇటీవలి విశ్లేషణలో (ఎ స్టడీ ఆఫ్ తెలుగు రీజ్నల్ ఎండ్ సోషల్ డైళ్ళ్ ఎ ప్రసోడిక్ ఎనాలిసిస్, సెంట్రల్ ఇనిస్ట్యూట్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజెస్, మానస గంగోత్రి, మైసూర్ 6, 1994) ద్వి శైలీ స్థితి (డైగ్లోసియా) కి కారణాలను ప్రమేయం, గౌరవం, సాహిత్య వారసత్వం, భాషార్జనం, ప్రమాణీకరణ, స్థిరీకరణ, వ్యాకరణం, పదజాలంగా పేర్కొన్నారు. ద్విశైలీస్థితితో పాటు ద్విభాషా స్థితి ఉందని గుర్తిస్తూ" "They also practice bilingualism with diglossia but for a different reason. In communicating with coastal speakers they use that dialect, and in all other cases they adhere to their own Telangana dialect" (పే 269) భావించారు. సరిగ్గా ఈ ద్విమాండలికతను లోగడ జరిపిన పరిశోధనల్లో (ఆదిలాబాదు జిల్లా బులిటెన్ (పే.24) ఖమ్మం జిల్లా బులిటెన్ (పే.37) రచయిత గుర్తించడం జరిగింది.

## 3.2.1 (బి) అర్థంలో మార్పు :

కన్నడ భాషా ప్రభావం వల్ల ఈ ప్రాంత వ్యవహారంలో ఉన్న తెలుగు పదజాలానికి ఉండే అర్థాలను ప్రమాణ భాషా వ్యవహారంతో పోల్చినప్పుడు మార్పు కనిపిస్తుంది. ఇది ఎంత మేరకు ఉందో, చారిత్రకంగా ఎప్పటి నుంచి జరిగి ఉంటుందన్న అంశాలను గురించి మరింత పరిశోధన చేయవలసి ఉంటుంది. ఉదాహరణ ప్రాయంగా ఈ జిల్లా వ్యవహారంలో కనిపించే మార్పులు మచ్చుకి కొన్ని :

| | |
|---|---|
| కాగితం | 'ఉత్తరం' |
| విషయం | 'మాట' |
| ఇసం | 'చెడుపు' |
| పొద్దు | 'ఆలస్యం' |
| తొందర | 'కష్టం' |
| శాల | 'పాఠశాల' |

## 3.2.1(సి) ప్రాచీన రూపాలు :

ఈ జిల్లా వ్యవహారంలో ప్రాక్తెనుగు దశకు చెందిన ప్రాచీన రూపాలు - ప్రధానంగా తాలవ్యీకరణ చెందని రూపాలు, పదాది వకారం నిలిచిన రూపాలు గోచరిస్తాయి.

.) తాలవ్యీకరణ చెందని రూపాలు [4] : ఉదా : కిలుము / (=చిలుము) కెవి (=చెవి) వంటి రూపాలు అరుదుగా వ్యవహారంలో కనిపిస్తాయి.

. మూలద్రావిడంలో ఇ, ఈ, ఎ, ఏ ల ముందు ఉండే పదాదిక కారం తెలుగులో చకారంగా మారుతుంది. దీన్ని తాలవ్యీకరణం అంటారు. ఈ మార్పు ప్రాక్తెనుగు దశలో ( క్రీ.శ. 5,6 శతాబ్దాలకు ముందే జరిగింది. ఈ సందర్భంలో పి.ఎస్. సుబ్రహ్మణ్యం అభిప్రాయం గమనించా''. .....తెలుగులో కిట్టు, కినియు, కెడయు,-కెంపు,కెలయు మొ. కొన్ని పదాల్లో తాలవ్యాచ్చు ముందున్న క కారంచకారంగా మారలేదు. కాబట్టి ఇటువంటి పదాలు తెలుగులో తాలవ్యీకరణం జరిగి ఆగి పోయిన తరువాత కన్నడం

ii) పదాది హకారం నిలిచిన రూపాలు [5] : ఉదా : హంగు
హాళ్ళి (=పున్న) హణ / పణ (=నొసలు), హంస
(పుడుకు ~ బుడుకు ~) హుడుకు (=వెదుకు) వంటివి కొన్ని మాటలు
వ్యవహారంలో కనిపించాయి.

## 3.2.1 (డి) ధ్వని మార్పులు :

| | ప్ర. రూ. | మ.జి.రూ. | కన్నడం |
|---|---|---|---|
| అచ్చులు : ఇ > ఉ | ఇసుక | ఉసుక | ఉసుగి |
| అ > ఉ | రూప | రూపు | రూప |
| ఆ > అ | బత్తా | బత్త | బత్తా |
| ఆ > ఓ | మబ్బు | మోడం | బేసరికె / యాసరికె |
| హల్లులు : | | | |
| 1 చకారలోపం | ఇగురు | చిగురు | |
| చ > 0 | | | |
| 2 శ్వాసీకరణ : ద > త | | దాటు | తాటు |
| | | దిబ్బ | తిప్ప |
| | | వీధి | కేరి |
| 3 మూర్ధన్యీకరణ : | | | |
| న > ణ | అన్న | అణ్ణ | అణ్ణ |
| | ఏణి | ఏణి | ఏని |

---

నుంచి ఎరువు తెచ్చుకున్నవి అయి ఉండాలి'' (''తెలుగు: మిగిలిన ద్రావిడ భాషలు''. **తెలుగు భాషా చరిత్ర** భద్రిరాజు కృష్ణమూర్తి (సం) ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్ - 1974)

5. తాలవ్యీకరణం వంటిదే పదాది హ కార రూపాల విషయం కూడా దేశ్యపదాల్లో హకారం లేక పోవడం అనేది కూడా ప్రాక్తెనుగు దశలక్షణమే.
''హత్తు, హెచ్చు వీటిలో కన్నడంలో లాగా *పకారం (*మూలద్రావిడ వర్ణానికి గుర్తు) హకారంగా మారింది కాబట్టి ఇవి కన్నడం నించి ఎరువు తెచ్చుకున్నవి అయి ఉండాలి. తెలుగు దేశ్యపదాలల్లో హకారం వీటిల్లో తప్ప ఇంకెక్కడా లేదు''.
(పి.ఎస్. సుబ్రమణ్యం - పై వ్యాసంలోనే పే.35). ప్రస్తుత ఉదాహరణలు ఈ అంశాన్నే బలపరుస్తున్నాయి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| | మన్ను | | మణ్ణు | | మణ్ణు |
| | వెన్న | | వెణ్ణ | | వెణ్ణ/ బెణ్ణ |
| | పని | | పణి | | పణి |
| శ > ష | శంకర్ | - | షంకర్ | - | షంకర్ |
| | శాస్త్రి | - | షాస్త్రి | - | షాస్త్రి |
| ల> ళ | గాలి | - | గాళి | - | గాళి |
| | చలి | - | చళి | - | చళి |
| | అల్లుడు | - | అళ్ళుడు | - | అళియ |
| | ముల్లు | - | ముళ్ళు | - | ముళ్ళు |

**3.2.1 (ఇ) విప్రకర్ష :** సంయుక్తాక్షరాల మధ్య అచ్చు చేరడంవల్ల సంయుక్తత తొలగి పోతుంది.

| | | |
|---|---|---|
| లగ్న | > | లగ్గనం |
| ధైర్య | > | దయిర్నం |
| రాత్రి | > | రేతిరి |

**3.2.1 (ఎఫ్) మధ్యాక్షరలోపం :** పదమధ్యంలో అక్షర లోపం వల్ల సంయుక్తా ఏర్పడుతుంటాయి.

| | | |
|---|---|---|
| ఇద్దరు | > | ఇద్రు |
| ఒక్కరు | > | ఒక్రు |
| కత్తెర | > | కత్రె |
| దగ్గర | > | దగ్ర |

**3.2.1 (జి) ఇతర హల్పమీ కరణాలు :**

| | | | |
|---|---|---|---|
| త > ద | బతుకు | > | బదుకు |
| ద > య | ఆదివారం | > | అయితారం (< అయితార) |
| | | | అయిత్వారం |

| | | | |
|---|---|---|---|
| ద > త | ఒప్పిదం | > | ఒప్పితం |
| | తప్పిదం | > | తప్పితం |
| బ > ప | అబద్ధం | > | అపద్ధం |
| త > చ | తిత్తి | > | చిత్తి |
| ద > జ | దినుసు | > | జినుసు |
| ప > మ | పెయి | > | మెయి |
| క > హ | తాకత్తు | > | తాహత్తు |
| ట > త | తూటు | > | తూతు |
| ల > న | చాలా | > | చానా |

### 3.2.1 హెచ్) వ్యాకరణ పరమైన మార్పులు :

1. కన్నడ పదాలకు లింగవచన ప్రత్యయాలు కలిపి ప్రయోగించడం :

అప్ప : అప్పయ్య

బీగ : బీగుడు / బీగుది / బీగురాలు

గండ : గండడు మొ||

2. ఎ) కృదంతాలను కొద్ది మార్పుతో ఉపయోగించడం :

(ఇకె ) ఇకి = నమ్మికి, పోలికి, చేరికి మొ.

(ఇత ) ఇతం = తప్పితం, ఒప్పితం మొ.

(ఓదు/వుదు>) ఏది/ ఏటిది — చేసేట్టి (< మాడోదు)

పుట్టేది (< ముట్టోదు)

వచ్చేది (< బరోదు)

బి) తద్ధితాలను మార్పు చేసి ప్రయోగించడం :

(ఇకె >) ఇకి : ఒద్దికి

మన్నికి

(తన >) తన : దొడ్డతన

సన్నతన

శానె తన

(కార> ) కార/కారి : ఊటకార 'తిండిపోతు'
మోసకార / మోసకారి
- ఆలు : బీగురాలు
- పోత : తిండి పోత
దున్న పోత
- ది : సుళ్ళుది 'అబద్దాల కోరు'
తుడుగుది 'తుంటరిది'
(తె >) - తి : యోగితి

3) సర్వనామాలు : నాను, నీను, నీవు, యీ యప్పవంటివి యథాతథంగా వ్యవహారంలో కనిపించాయి.

4) సంఖ్యావాచకాలు : ఒబ్బను (ఒకడు), మూరు (మూడు) నాకు (నాలుగు), సవ్ర (వెయ్యి) వంటివి వ్యవహారంలో ఉన్నాయి.

5) పదబంధాలు : కన్నడ తెలుగు పదాలు కలిసి ఏర్పడిన పద బంధాలు అరుదుగా వ్యవహారంలో కనిపించాయి.

బాళేపండు 'అరటి పండు'
పుండి చెట్టు 'గొంగూర చెట్టు'
ఉసిగి నేల / ఉసిగినేలె 'ఇసుకనేల'

6) క్వార్థకం మీద వ్యతిరేకం : ఈ జిల్లా వ్యవహారంలో కనిపించే భూతకాల వ్యతిరేక రూపాల గురించి వేరొక చోట చర్చించడం జరిగింది. (iii 2.2.4.2.)

సాధారణంగా ప్రమాణ భాష ప్రభావం వల్ల భూతకాల వ్యతిరేకం వాక్య నిర్మాణంతో వ్యక్త మవుతూ ంటుంది. ఈ నిర్మాణంలో ధాతుప్రాతిపదికకు తువవర్థకం (-అ-) చేరి ఆపై 'ఉండు' క్రియ వ్యతిరేకార్థాన్ని సూచిస్తుంటుంది. (ఉదా: పాడలేదు, చదవలేదు మొ).

కన్నడ భాషా ప్రభావం వల్ల భూతకాల వ్యతిరేకరూపాలు ఈ జిల్లాలో క్వార్థకం మీద లేదు క్రియ పురుష ప్రత్యయాలు చేరి ఏర్పడుతున్నాయి. ఉదాహరణకు.

పోయిలేను (< హోగి ఇల్ల)
తిని లేను (< తినిల్ల)
ఉండిలేను (< ఇల్లిల్ల) మొ॥

ఈ ప్రభావం రంగారెడ్డి జిల్లాకు కూడా విస్తరించినట్టు కనిపిస్తోంది. [6]

### 3.2.1 (ఐ) వాక్యంపై ప్రభావం :

కన్నడ భాషా ప్రభావం వల్ల సాన్నిహిత్య ప్రాంతాల్లో ఉపయోగించే వాక్యాలు స్థూల విశ్లేషణకు యథాతథాను వాదాలుగా తోస్తాయి. ఉదాహరణకు కొన్ని :

| | | |
|---|---|---|
| నేనే పెద్దోడిని | - | నానే దొడ్డవను |
| మనింటికి పోత | - | నమ్మనెగె హోగ్తిని |
| ఖత్తు/జాబు ముట్టింది | - | జాబు ముట్టిదు |
| వచ్చి వచ్చి ఈ పొద్దే | - | బందుబందు ఈ వోత్తే |
| రావచ్చా మనం | | బహుదా నావు |
| వానొచ్చినాన్నుంచినేను | - | వర్ష బంతు అదిరిందానాను |
| రాలే | - | బర్లిల్ల |
| మేం పోవాల | - | నావు హోగుబేకు |
| అప్పుడు రా | - | ఆ వాగె బా |

### 3.2.2 ఉర్దూ – హిందూస్థానీ ప్రభావం :

చారిత్రకంగా తెలంగాణా ప్రాంతం మహ్మదీయుల పరిపాలనలో ఎక్కువ కాలం కొనసాగడం వల్ల ఉర్దూ – హిందుస్థానీ ప్రభావం అధికం. ఇందుకు మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారం అపవాదం ఏమీ కాదు. ఈ జిల్లా వ్యవహారంలో ఇతర తెలంగాణా ప్రాంతంలో కనిపించే ఆదాన లక్షణాలే ప్రతిబింబిస్తుంటాయి. వాటినే స్థూలంగా ఈ

---

6. రంగా రెడ్డి జిల్లా వ్యవహారాన్ని విశ్లేషిస్తూ వ్యతిరేక క్రియల వివరణలో ఉషా పన్నాల (తెలుగు మాండలికాలు : రంగారెడ్డి జిల్లా బులిటెన్ 1997) ఈ ప్రయోగాలను ఉర్దూ ప్రభావంవల్ల వచ్చిందని బావించారు. ఈ సందర్భంగా "... ఇక్కడ వ్యతిరేక క్రియల ప్రయోగంలో ఉర్దూ బాషా ప్రభావం బాగా ఉన్నట్టు తెలుస్తోంది... కానీ ఇక్కడ ఇచ్చి లేను, పిల్చిలేను వంటి భూత కాలిక వ్యతిరేక క్రియారూపాలు ఈ ప్రాంతంలో వినిపించే ప్రత్యేకరూపాలు అని చెప్పవచ్చు... ఉర్దూ భాషా ప్రభావంవల్ల ఏర్పడి ఉంటుందని భావించవచ్చు. ఎందువల్లనంటే దీనికి తుల్యమైన వ్యాకరణ రూపాలు ఆ భాషలో వినిపిస్తాయి. ఉదాహరణకు ఈ కింద పేర్కొన్న ప్రయోగాలు పరిశీలించండి:
దియా – నహీ
ఆయా – నహీ

జిల్లా వ్యవహారం ఆధారంగా విశ్లేషించడం జరిగింది.[7]

ఎ) యథాతథంగా ఆదాన పదాలను గ్రహించడం :

ఈ జిల్లా వ్యవహారంలో అసంఖ్యాక పదాలు యథాతథంగా కనిపించాయి. మచ్చుకి కొన్ని మాత్రమే ఉదాహరించడం జరిగింది.

| | |
|---|---|
| మల్గీ | 'దుకాణం' |
| కాంటా | 'పిన్నీసు' |
| మాస్రా | 'మచ్చు' |
| అండా | 'పెద్దపాత్ర లేదా కోడిగుడ్డు |
| సిక్కా | నాణెం |
| కచేరీ | 'ఆఫీసు' |
| లిఫ్హాఫా | 'కవర్' |
| సౌలత్ | 'సౌకర్యం' |
| అడితీ | 'కట్టెలు అమ్మే కొట్టు' |
| బీమారి | 'జబ్బు' |
| కట్కా | 'స్విచ్' |
| పత్లోన్ / పట్లోన్ | 'ప్యాంటు |
| ఎత్మినాన్ | 'తీరిక' |

---

వీటిలో మొదటి భాషాంశం భూతక్రియ. రెండోది – నహీ అనేది వ్యతిరేక క్రియ''
(రంగారెడ్డి జిల్లా బులిటెన్ 3.3.2.4)

7. విశ్లేషణకు, అధికసమాచార సేకరణకు దిగువ సూచించిన గ్రంథాలు తోడ్పడ్డాయి.

1. **తెలుగు పై ఉర్దూ – పారశీకముల ప్రభావం,** డాక్టర్, కె. గోపాలకృష్ణ రావు, హైదరాబాదు, 1968.
2. ''తెలుగులో అన్య దేశ్యాలు,'', **తెలుగు భాషా చరిత్ర లో** డా. వి. స్వరాజ్యలక్ష్మి.
3. **దక్కనీ ఉర్దూ :** డాక్టర్ ఎస్. ఖాదర్‌మొహిద్దీన్, అణ్ణామలై యూనివర్సిటీ, అణ్ణామలైనగర్, 1980.

(బి) ధ్వనిమార్పులు :

ఆదానపదాలు మూలభాష నుంచి వచ్చినప్పుడు స్వభాషలోని వర్ణ నిర్మాణానికి అనువుగా మారడం సహజం. ఈ జిల్లా వ్యవహారంలో పదాలలో కనిపించిన అటువంటి మార్పులు.

i) ఉర్దూలో ఉన్న జ (Z) తెలుగులో జగా మారడం

విద్యావంతులలో Zకు సమానమైన ఉచ్చారణ వినిపించినా నిరక్షరాస్యుల్లో జ గా మారిపోతుంది.

| | | | |
|---|---|---|---|
| జ఼ > జ | జ఼ిల్లా | > | జిల్లా |
| | జ఼మీందార్ | > | జమీందారు |
| | జ఼ాగీర్దార్ | > | జాగీర్దారు |

ii) జిహ్వామూలీయ స్పర్శం క (q) తెలుగులో ఖ/క లు గా మారడం

| | | | |
|---|---|---|---|
| క఼ > ఖ/క | క఼ుష్బూ | > | ఖుష్బూ / కుష్బూ |
| | క఼రార్ | > | ఖరార్/ కరారు |
| | క఼బ్జా | > | కబ్జా |

iii) సప్త పథీయోష్మం ఖ఼ (X) ఖ/క లుగా మారడం :

| | | | |
|---|---|---|---|
| ఖ఼ > ఖ఼/క | ఖ఼రీదు | > | ఖరీదు /కరీదు |
| | ఆఖ఼ర్ | > | ఆఖరు /ఆకరు |
| | ఖ఼ాళీ | > | ఖాళీ /కాళీ |

iv) దంత్యోష్ఠ్య శ్వాసోష్మం ఫ఼ (f) పకారంగా మారడం :

విద్యావంతులు ఆంగ్ల భాషా ప్రభావం వల్ల ఉర్దూ/ హిందుస్తానీ మాటల్లోని ఫ఼ను యథాతథంగా పలుకుతారు. నిరక్షరాస్యుల్లో మాత్రం పకారంగా మారిపోతుంది. (లేఖనంలో ఫ/పలు కనిపిస్తుంటాయి).

| | | | |
|---|---|---|---|
| ఫ > ఫ/ప | లిఫ఼ాఫ఼ా | > | లిపాప |
| | ఫ఼ిర్యాద్ | > | ఫిర్యాదు /పిర్యాదు |
| | ఫ఼కీర్ | > | ఫకీరు / పకీరు |

---

4\. **ఇన్‌ఫ్లుయన్స్ ఆఫ్ ఉర్దూ ఆన్ తెలుగు (ఎస్టడీ ఆఫ్ బైలింగ్వలి జమ్),** డాక్టర్. వి. స్వరాజ్యలక్ష్మి, హైదరాబాదు, 1984.

v) హలంతాలు అజంతాలు కావడం :

ఆదాన భాషలో హలంతాలుగా ఉంటే స్వభాషలో జన్య లక్షణాన్ని అనుసరించి అజంతాలుగా మారిపోతాయి.

ఖ़రాబ్ > ఖరాబు / కరాబు

బేజ़ార్ > బేజారు

కందిల్ > కందిలు

సౌలత్ > సౌలత్తు

ఈనాం > ఇనాము

నల్ > నల్లా

vi) పదాది దీర్ఘాలు హ్రస్వం కావడం :

మూల భాషలోని పదాదిన ఉండే దీర్ఘాలు వ్యవహారంలో హ్రస్వాలుగా మారిపోతాయి.

చాబుక్ > చబుకు

బాజ़ార్ > బజారు

vii) స్వర సమీకరణ : ప్రత్యయాలు చేరుతున్నప్పుడు (బహువచనం మొ॥) వర్ణ సమీకరణం కనిపిస్తుంది.

ఖ़బర్ - లు > కబుర్లు

కచ్చేరి - కు > కచ్చేరికి

బికారీ - కు > బికారికి

viii) వర్ణ వ్యత్యయం : మూల భాషలోని పదాలు కొన్ని వర్ణవ్యత్యయం చెందిన సందర్భాలున్నాయి.

అమానత్ > అనామత్

సఖ్తి > ఖస్తి

ix) స్వర భక్తి : పద మధ్యంలో అచ్చు చేరడం వల్ల సంయుక్తాలు అసంయుక్తాలుగా మారిపోతుంటాయి.

భ़ద్లీ > బదిలీ

మక్తా > మకతా

చమ్డా > చమడా

బద్నాం > బదనాం

x) వర్ణచ్యుతి : సంయుక్తాలు అసంయుక్తాలుగా మార్చే మరో ప్రక్రియ పద మధ్యంలో ఉన్న వర్ణం రాలిపోవడం.

మజ్దూరీ > మజూరీ

మస్జిద్ > మసీదు

xi) నాదీకరణ : శ్వాసాక్షరాలు కొని సందర్భాల్లో నాదాక్షరాలుగా మారుతుండటం.

డబాయించు > దబాయించు

డాబా > దాబా

నఖద్ > నగదు

xii) మూర్ధన్యీకరణ : ఆదానంలో దంత్యానునాసికం (న) తెలుగులో మూర్ధన్యంగా మారడం.

దూకాన్ > దుకాణం

దీవాన్ > దివాణం

xiii) న, ల మార్పిడి :

నుక్సాన్ > లుక్సాన్

నంగా > లంగా

సి) వ్యాకరణ పరమైన ప్రభావం

ఎ) ఆదానపదాలకు తెలుగు బహువచన ప్రత్యయం చేర్చి ఉపయోగించడం.

కత్రా - లు

ఖర్చు - లు

ఖైదీ - లు

షరత్ - లు మొ॥

బి) ఆదాన పదాలకు తెలుగు విభక్తి ప్రత్యయాలు చేర్చడం :

ఖూనీ - తోటి

దుకాన్ - ల

అడితీల - ల్ల

బజార్ల - కు మొ॥

సి) ప్రేరణార్థక ప్రత్యయప్రయోగం :

ఆదాన పదాలకు - ఇంచు ప్రేరణార్థక ప్రత్యయం చేరడం

సుదరాయించు

దబాయించు

కటాయించు మొ॥

డి) ఆదాన నామాలకు (సహాయ) క్రియలను చేర్చడం :

బంద్ - చేయు

వసూల్ - చేయు

షురూ - అవు

బద్లీ - అవు

జారీ - చేయు మొ॥

ఇ) -నామా, -ఖానా, -దారు, - బందీ ఉత్పాదక పరాను బంధ (ప్రత్యయ) రూపాలు, బే -, బద్ వంటి పూర్వాను బంధ (ప్రత్యయ) రూపాలు యథాతథంగా ఆదానరూపాలకు, తెలుగు పదాలకు చేరుతుంటాయి. (వ్యవహారంలో అధిక భాగం ఆదానరూపాలు గోచరించాయి.

| | | |
|---|---|---|
| హక్ - దారు | బే - గారీ | ఇక్రార్ - నామా |
| మోజిం - దారు | బద్ - నియత్ | తాలూకు - బందీ |
| ఖరీద్ - దారు | దవా - ఖానా | జమా - బందీ |

వతన్ దారు మొ॥ తోప్ - ఖానా పంచ్ - నామా మొ

ఎఫ్) -సాబ్ వంటి నామాలను, సంబోధనార్థకాలుగా, గౌరవార్థకాలుగా ఉపయోగించడం.

దాదా సాబ్

నవాబ్ సాబ్

వకీల్ సాబ్

అకీం సాబ్ మొ॥

జి) పదబంధాల ప్రయోగం : ఈ పద బందాలు అధిక భాగం ఆదాన మిశ్రమాలు (లోన్ బ్లెండ్స్) లేదా ఆదానువాదాలుగా ఉంటుంటాయి. వ్యవహారంలో గోచరించిన వాటిలో మచ్చుకి కొన్ని :

| | | | |
|---|---|---|---|
| అనువాదాలు : | అంగార్ డబ్బీ | - | పుల్లల్లబ్బీ / అగ్గిపెట్టె |
| | | | కల్‌యాపర్సొ - నిన్నకాక మొన్న |
| | | | బారీష్ కా మోసమ్ - వానకాలం |
| మిశ్రమాలు : | ఎండాకాలం | - | ధూప్ కాలా |
| | సర్దికాలం | - | సర్దీ కాలా |
| | కాయిషున్నోడు | - | ఖాయిష్ వాలా |

డి) వ్యాకం పై ప్రభావం :

తెలంగాణా ప్రాంతమంతటా ఉర్దూ / హిందుస్తానీ ప్రభావం వల్ల వ్యవహారంలోని వాక్య నిర్మాణంలో మార్పులు కనిపిస్తాయి. మహబూబ్‌నగర్ జిల్లాలోనూ ఇవే కనిపిస్తాయి. (ఉర్దూ భాషపై (ప్రధానంగా దక్కనీ ఉర్దూమీద) ద్రావిడ భాషా ప్రభావం ఎంత మేరకు ఉందో సవివరంగా పరిశోధించాల్సిన అంశంగా తోస్తోంది.)

ఎ) గమ్యార్థంలో చతుర్థీ విభక్తి లోపం :

నేను బయట పోయిన (ప్రమాణ భాషలో బయటకు అని ఉంటుంది.)

మై బాహర్ గయా

బి) వాక్యాలు యథాతథాను వాదాలుగా ఆవృత్తికావడం :

1) ఎ) క్రియారహితం : అతను మా చిన్నాయ్న
ఉనో కాకా

బి) క్రియా సహితం : ముఝె యాద్‌నై
నాకు యాదిలేదు
ఉసే మదద్‌కర్
ఆనికి సాయంచెయ్యి
బడే కిరికిరి కర్తా
పెద్దకిరికిరి చేస్తాడు

సి) i) ఏ వార్థక ప్రత్యయ
లోపం : సద్ది బాగే నడుస్తోంది
పడాయి అచ్చా చల్తాహై
(ప్ర.భా.లో **బాగానే సాగుతోంది**
అని ఉంటుంది).

ii) సంశ్లిష్ట వాక్యాలు :

అనుకృతి : ఆయన రేపొస్తనని చెప్పిండు
(కోటెటివ్) ఉనోకల్ ఆతూకాకో బోలా

ప్రత్యక్షానుకృతి : సార్ కూడచ్చిండంట
(రిపోర్టెడ్) సార్‌బీ ఆయాకతే

హేత్వర్థకం : నువ్వొస్తనంటే నేను కూడొస్త
తూ ఆతూ కతూమైబీ ఆతూ

యత్తదర్థకాలు : హిందీ వంటి ఆర్యన్ భాషల ప్రబావంవల్ల జో .. వో లతోనే కాకుండా ఉర్దూ ప్రభావం వల్ల కోన్.. ప్రశ్నార్థక సర్వ నామాలతో ప్రారంభమయ్యే వాక్యాలకు అనుకృతులు వ్యవహారంలో కనిపిస్తాయి.

ఎవరు ముందొచ్చింగ్రో అల్లు కూసున్నారు.

ఉ. కోన్‌జల్దీ ఆయే ఉనో బైట్‌గయే

హి జోజల్దీ ఆయే వో బైట్ గయే

ఇ) అర్థసంకేతాలు :

ఆదాన భాషలో ఉన్న అర్థంలో యథాతథంగా కాకుండా అవాంతర భేదాలతో ఆలంకారికంగా సంకేతార్థాన్ని సూచించడం జరుగుతోంది:

(చమ్మచ్) చెమ్చా - ముఖస్తుతితో సంకేతార్థం ఆశ్రయించే వ్యక్తి

ఖట్మల్ - పోలీసు

తుగ్లక్ - విపరీతమైన నిర్ణయాలు తీసుకునే వ్యక్తి

నవాబ్ - సంపన్నుడు

కందిల్ - కళ్ళజోడు ధరించిన వ్యక్తి మొ॥

## III మహబూబ్‌నగర్ జిల్లా విద్యావంతుల వ్యవహార విశేషాలు

మహబూబ్‌నగర్ జిల్లా విద్యావంతుల వ్యవహారాన్ని స్థూలంగా గమనిస్తే ద్విమాండలిక స్థితి తక్కువగా ఉందని వివరించాల్సి వస్తుంది. యథాలాప సందర్భాల్లో లేదా ఔపచారిక సందర్భాల్లో ప్రాంతీయ మాండలికాన్ని మాట్లాడుతుంటారు. రూపాత్మకమైన సందర్భాల్లో ప్రమాణభాషను అనుకరించే శైలి కనబడుతుంది. దాంట్లోనూ మాండలిక భాషా లక్షణాలు అస్పష్టంగా గోచరిస్తూనే ఉంటాయి. ఎప్పటికప్పుడు ప్రమాణ భాషను అనుకరిద్దామన్న తపన వ్యవహర్తల్లో గోచరిస్తుంది. అందువల్ల ద్విమాండలిక స్థితి ఉంటుంది. ప్రమాణ భాషను అనుకరించడం ఆధునికీకరణ గాభావించి మిగిలిన లక్షణాలను వివరించినట్లయితే కింది విశేషాలు స్పష్టమవుతాయి.

## 1. వర్ణ విభాగం

**1.1 ఫ వర్ణం :** మహ్మదీయుల పాలన వల్ల ఉర్దూ ద్వారా, అటు తర్వాత ఇంగ్లీషు భాష ద్వారా తెలుగు భాషలో ప్రవేశించిన ఫ వర్ణం వ్యవహారంలో అధికంగానే ఉంది. విద్యావంతులు ఈ వర్ణాన్ని స్పష్టంగా ఉచ్చరిస్తునే ఉంటారు. ఉచ్చారణను బట్టి ఒక్కో సందర్భంలో వ్యవహర్తల విద్యా స్థాయిని ఖచ్చితంగా చెప్పవచ్చు.

ప్̥రీ హ్యాండ్ (Free hand)

ప̥ీట్లు (Feets)

టారిప్̥

ప̥స్టియర్ (First Year)

మునాప̥ా

ప̥ినిష్ (Finish)

ఇవే కాకుండా అనువాదం కాని ఆదానపదాలు యథాతథంగా (కాఫీ, టిఫిన్ వంటివి) వ్యవహారంలో కనిపిస్తుంటాయి. ఇవన్నీ దేశ్య పదాలుగా మారి పోతున్నాయి. కాబట్టి ప̥ వర్ణానికి వర్ణమాలలో స్థానం కల్పించాల్సిన అవసరం ఉంది.

## 1.2 ఏ వర్ణం :

ప̥ వర్ణం తర్వాత ఈ జిల్లా విద్యావంతుల వ్యవహారంలో తక్కువగా కనిపించేది ఏ వర్ణమే. దీనికి వర్ణమాలలో అంత సమన్వయంలేదు. ప్రమాణ భాషలో ఉండే (భూతకాల) క్రియా రూపాలను పలకవలసివస్తే, కొన్ని పదరూపాల్లో అజగ్రీకరణవల్ల ఈవర్ణం వినిపిస్తుంది. కాబట్టి ఈ వర్ణం వర్ణమాలలో చేరుతుందా? లేదా? అనే అంశం చర్చనీయాంశమే అవుతోంది.

విన్నారు

ఉన్నాడు

ప్రాసు మొ॥

విద్యావంతుల వ్యవహారంలో మిగిలిన చోట్ల ఈ వర్ణ ప్రభావం కొన్ని రూపాల్లో కనిపిస్తుంటుంది.

తేరు

తే పోతే మొ॥

పైన ఉదాహరించిన భూత కాలిక రూపాలతో పాటు, మాండలికంలో హ్రస్వరూపాలు విస్తృతంగా ఉపయోగంలో ఉన్నాయి. హ్రస్వరూపాలు మాండలిక సామాన్య లక్షణం. ఈ వర్ణంతో కూడిన రూపాలు విద్యావంతుల వ్యవహార ప్రత్యేకత.

## 1.3 మహా ప్రాణత్వం :

విద్యావంతుల వ్యవహారంలో మహాప్రాణాలు అర్థభేద కత్వం లేకుండా, ఒక్కో సందర్భంలో తక్కువగా కనిపిస్తుంటాయి. ఎదుటి వాళ్ళు గమనిస్తున్నారని భావించినప్పుడు, విడిగా మహాప్రాణాలుగల పదాలను పలకవలసి వచ్చినప్పుడు విద్యావంతులు ఈ లక్షణం పాటిస్తారు.

ప్రధానం / ప్రదానం

లాభం / లాబం

పాఠశాల /పాటశాల

వీధి / వీది

అభిమానం/ అబిమానం

## 1.4 ఊష్మ వినిమయం [1] :

శ, షలను శగానో లేదా షగా పలకడం ఎక్కువగా కనిపిస్తుంది. శకారానికి ఈ జిల్లాలో ద్రోణీత ఉచ్చారణ ఉంది. విద్యావంతుల్లో సైతం శ, షల మధ్య తేడా స్పష్టంగా ఉండదు.

షాపు / శాపు

దిష్టి / దిశ్టి

తమాషా / తమాశా

కాశీ / కాషీ

---

1. ప్రాంతీయ, సామాజిక మాండలికాల మీద అధ్యంశిక వర్ణ దృక్పథంతో పరిశోధన చేసిన జె.వెంకటేశ్వర శాస్త్రి (1994) సిద్ధాంత గ్రంథంలో (ఎస్టడీ ఆఫ్ తెలుగు రీజ్నల్ అండ సోషల్ డయలెక్ట్స్), ఎప్రసోడిక్ ఎనాలిసిస్; సెంట్రల్ ఇనిస్ట్యూట్ ఆఫ ఇండియన్ లాంగ్వేజెస్, మానస గంగోత్రి ప్రకటించిన అభిప్రాయాలు ఈ సందర్భంలో ప్రస్తావిచడం అవసరం: ''సంప్రదాయ తెలుగులో దంత్య, తాలవ్య, మూర్ధన్య ఊష్మాలుంటే, వీటిల్లో దంత్య మూర్ధన్యాలు మాత్రమే ప్రాంతీయ మాండలికాల్లో విభేదక ప్రమేయం నిర్వహిస్తాయి. తాలవ్యానికి ప్రాంతీయంగా / సామాజికంగా ప్రమేయం ఉందా? అనేది వివాస్పదమైన అంశం. తాలవ్యోష్మం వివృతాచ్చుల ముందు ఉచ్చరిస్తే మిగిలిన సందర్భాల్లో దంత్యాన్నే ఉపయోగిస్తుంటారు.

## 1.5 అవ్యయాలు:

విద్యావంతుల వ్యవహారంలో ప్రామాణిక రూపాలతో పాటు గ కార రహిత రూపాలు వినిపిస్తాయి. నిరక్షరాస్యుల వ్యవహారంలో గ కార సహిత రూపాలు వినిపిస్తాయి.

అక్కడ / ఆడ

ఇక్కడ / ఈడ

అటువంటి / అసుంటి

ఇటువంటి / ఇసుంటి

ఎక్కడ / ఏడ / యేడ

ఎటువంటి / ఎసుంటి

## 1.6 చకారం :

విద్యావంతుల వ్యవహారంలో చకారం క్వాచిత్కంగా నిలిచినా అధిక భాగం సకారంగా మారిన రూపాలే వినిపిస్తాయి.

సూడు

కూసో / కూకో

సీర

సాట

సెర్వు

---

లేఖనంలో మూడింటికీ సంజ్ఞలున్నాయి. విద్యావంతులలో ఈ విధంగా సమ్మేళనం చెందుతాయి:

తెలంగాణా మాండలికం

స ష – శ → త్స

స → స

ఇతర మాండలికాలు

స – శ → స

ష → ష

## 1.7 వకారం

ఈ జిల్లా విద్యావంతుల వ్యవహారంలో పదాది వకారం నిలవడం తక్కువ. చాలా మటకు వకార రహితరూపాలే వ్యవహారంలో వినిపిస్తాయి.

ఇకారం / వికారం

ఇసుర్రాయి / విసుర్రాయి

ఈదులు / వీధులు

## 1.8 మూర్ధన్యాలు :

దంత్య మూలీయాలకు, మూర్ధన్యాలకు మధ్య భేదం విద్యావంతులైన అగ్రవర్గాల వ్యవహర్తల్లో స్పష్టంగా ఇతర వర్గాల్లో అస్పష్టంగా గోచరిస్తుంది.

## 1.9 వర్ణ విభేదాలు :

దిగువ పేర్కొన్న పర్యాయరూపాలు విద్యావంతుల వ్యవహారంలో ఎక్కువగా కనిపిస్తున్నాయి.

| | | |
|---|---|---|
| అ/ఎ | : | గట్టు/గెట్టు, గనెం/గెనెం |
| అ/ఇ | : | కొంద్ర /కొంద్రి, గొంగడి / గొంగ్డి |
| అ/ఉ | : | అందరు / అందురు |
| ఉ/ఇ | : | జేబు/జోబి |
| ఉ/అ | : | అగ్గువ / అగ్గవ, తక్కువ/తక్కవ/తక్వ . |
| ఓ/ఆ | : | ధోవతి / దావతి |
| ఒ/ఉ | : | బొరక / బురగ |

---

సమ్మేళనం ప్రాంతీయ మాండలిక సంబంధి లక్షణం. శ/షలు షగా తెలంగాణాలో కలిసి పోతే, ఇతర మాండలికాల్లో స/శలు సగా కలిసి పోతాయి. మరో మాటలో చెప్పాలంటే విద్యావంతుల వ్యవహారంలో దంత్య, మూర్ధన్యాలే భేదక ఊష్మాలుగా ఉంటాయి. నిరక్షరాస్యుల వ్యవహారంలో ప్రాంతీయంగా అంతటా ఒకే ఊష్మం వినిపిస్తుంది. అంటే దంత్య, తాలవ్య, మూర్ధన్యాలు కలిసి పోయి దంత్య ఊష్మంగానే ఉంటాయి.
విద్యావంతుల వ్యవహారంలో మూడురకాల ఊష్మాలు ఉంటాయని ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి అభిప్రాయం.''

| | | |
|---|---|---|
| జ/గ | : | సింజిని /సింగిని, సింగిడి |
| క/త | : | కట్మకథ/ తట్మకథ |
| న/ర | : | ఎత్మినాన్ /ఎత్మినార్ |
| వ/గ | : | ముప్వలు / మూగలు |
| క/స | : | పుకటు /పుసటు |

## 2. పదాంశ విభాగం

### 2.1 నామవిభాగం

**2.1.1 బహువచనం :** – సాధారణ బహువచన ప్రత్యయం 'లు' చేరినప్పుడు కొన్ని పదాల స్వరూపంలో మార్పేమీ ఉండదు.

| | | |
|---|---|---|
| పంచె | – | పంచెలు |
| గింజ | – | గింజలు |
| పారక | – | పారకలు |

కొన్ని పదాల చివర బహువచన ప్రత్యయం చేరి నందువల్ల కొన్ని మార్పులు రావచ్చు.

| | | |
|---|---|---|
| తాడు | – | తాళ్ళు / తాల్లు |
| లేడి | – | లేళ్ళు / లేల్లు |

డ కారం పదాంతాన ఉంటే అది బహువచన ప్రత్యయం ముందు ళకారంగా మారి బహువచన ప్రత్యయాన్ని 'ళ' గా మార్చి మొత్తం శబ్ద రూపాన్ని 'ళ్ళు' గా మారుస్తుంది. (ప్రాంతీయంగా మూర్ధన్య /దంత్య పార్శ్వికాల మధ్య పర్యాయ రూపత మూలంగా మూర్ధన్య పార్శ్వికం దంత్యంగా మారి పోతూంటుంది.)

అట్లాగే బహువచన ప్రత్యయం ముందు పదాంత ల కారం 'డ్ల' గా మారుతోంది.

| | | |
|---|---|---|
| ఇల్లు | – | ఇండ్లు |
| చెల్లెలు | – | చెల్లెండ్లు |
| కోడలు | – | కోడండ్లు |

బహువచన ప్రత్యయం చేరే ముందు రేఫాంత పదాలు కొన్ని మార్పులకు లోనవుతాయి.

పేరు - పేర్లు

ఊరు - ఊళ్ళు / ఊర్లు

గోరు - గోళ్ళు / గోర్లు

నోరు - నోళ్ళు / నోర్లు

ఈ రూపాల్లో బహువచన ప్రత్యయం ముందు పదాంతంలో ఉకారం లోపించి మొత్తం పదరూపం మూర్ధన్యీకృతం కావడం జరిగింది. నిరక్షరాస్యుల వ్యవహారంలో పై రూపాలు – రేఫం తరవాత బహువచన ప్రత్యయం చేరినవి వర్ణవ్యత్యయం జరిగి వినిపిస్తాయి.

వెదుల్రు (< వెదుర్లు)

గొల్రు (< గొర్లు)

బల్రు (< బర్లు)

ఇంగ్లీషు బాషలో ఉపయోగంలో ఉండే బహువచన ప్రత్యయం – ఎస్ (S) ను తెలుగు పద రూపాలకు చేర్చి వ్యవహారంలో ప్రయోగించడం అధికంగానే కనిపిస్తోంది.

యియర్స్ (Years)

క్లాసెస్ (Classes)

బుక్స్ (Books)

టైప్స్ (Types)

తెలుగు బహువచన ప్రత్యయాన్ని అన్యదేశ్యాలకు జత చేయడాన్ని గమనించవచ్చు.

ప్లేట్లు

గాడీలు

చుట్టీలు

గైడ్లు

బకాయ్‌లు

**2.1.2 విభక్తి ప్రత్యయాలు :** కింది ప్రత్యయాలు ఈ ప్రాంత వ్యవహారంలో కనిపిస్తుంటాయి.

ను/ని : అబ్బాయిలను, దాన్ని

కు/కి : వాళ్లకి, ఖర్చులకు, అప్పులుకు

తో/తోని/తోటి : తప్పెటల తోటి, వానితోని, ఆమెతో

నుండి/నుంచి/నుంటి : నీ నుంటి, చెన్నకేశవ స్వామి నుంచి

కెల్లి/సంది/కోలె : అండ్లకెల్లి, రేపట్సంది, నిన్నట్కోలె

ల/లో/లోపల/లోపట రేపట్లోపల, చద్వులో, దీన్లోపట, దాన్ల

యొక్క : అతడి యొక్క, రాశియొక్క

**2.1.3 నామప్రత్యయాలు :** ఈ జిల్లాలో కనిపించే మరి కొన్ని నామ ప్రత్యయాలు ఈ విధంగా ఉన్నాయి.

స్థలార్థకంలో : మీద, పైన, మీన, తాన, తాట, కాడ, వొద్ద మొ॥

కాలార్థకంలో : మునుపు, నుంటి, నుంచి, పొటు, దంక, దాక, మొ॥

**2.1.4 సంఖ్యాపదాలు :** విద్యావంతుల వ్యవహారంలో నిలిచి పోయిన ప్రాంతీయతా లక్షణాలు సంఖ్యా పదాల్లో ప్రతిబింబిస్తుంటాయి. ప్రధానంగా 13,14, 90 లను సూచించడానికి వాడే రూపాల్లో ప్రత్యేకతలు ఉన్నాయి. క్రమేపీ ఆలక్షణాలు తగ్గిపోతున్నాయని వ్యవహారం పౌనఃపున్యం గమనిస్తే తెలుస్తుంది.

పద్మూడు '13'
పద్నాలుగు '14'
టొంబై '90'

ఇవే కాకుండా 15, 17, 18 లను సూచించే రూపాలు విలక్షణంగా ఉంటాయి.

పద్దైదు '15'
పదేడు '17'
పజ్జెన్మిది '18'

అట్లాగే 100ను సూచించడానికి వంద, నూరు అనే పదాలున్నాయి. అయితే నూరు పద ప్రయోగం అధికం. మనుష్యులను సూచించేప్పుడు నూరుమంది ఎక్కువగాను నూరుగురు తక్కువగాను, వందమంది మరీ తక్కువగాను ప్రయోగించడం గమనించడం జరిగింది. అట్లాగే ఈ జిల్లా సంఖ్యా పదాల ప్రయోగం ఈ విధంగా ఉంటుంది.

ఇన్నూరు /రెండు వందలు

మున్నూరు /మూడు వందలు

నన్నూరు /నాలుగు / నాల్గు వందలు

అయిదు వందలు /అయిదు నూర్లు

వెయ్యి

పదివెయ్‌లు / వేలు

పురుష వాచక శబ్దాలలో 'ఒకటి' శబ్దం నుంచి నిష్పన్నమైనవి వివిధ రూపాలతో వినిపిస్తున్నాయి.

ఒకాయ్న /ఒకాయున

ఒకతను

ఒకడు

అట్లాగే స్త్రీ వాచక శబ్దాల్లో 'ఒకటి' నుంచి నిష్పన్నమైన రూపాలు వివిధమైనవి ఉన్నాయి.

ఒకతె

ఒకతి

ఒకామె

ఒకర్తె

ఒకర

ఒకావిడ

మనుషుల్ని లెక్కించేప్పుడు.

ఒక్కరు
ఇద్దరు
ముగ్గురు
నల్గురు /నలుగురు
అయిదుగురు
ఆరుగురు
ఏడుగురు
ఎనమిదిమిది మంది
తొమ్మిది మంది / తొమ్మండుగురు.
పది మంది

ఇలా సాగుతుంది.

మూడు నుంచి ఏడు వరకు -గురు, ఎనిమిది నుంచి - మంది ల ప్రయోగం విరళంగా ఉంది. పది ఆపైన సంఖ్యలకు - మంది ప్రయోగం కనిపిస్తుంది.

## 2.2 క్రియా విభాగం

**2.2.1 సక్మక, ప్రేరణార్థకాలు :-** పు, - ఇంచు / -పించు/ -పీయి వంటి ప్రత్యయాలు అకర్మక క్రియలకు చేరినపుడు సకర్మకాలవుతాయి. ఇవే సకర్మకాలకు చేరినప్పుడు ప్రేరణార్థకాలుగా మారిపోతాయి.

| | | |
|---|---|---|
| చంపు | - | చంపించు |
| విను | - | వినిపించు |
| మలుపు | - | మలిపించు/మల్పీయి |
| ఉంచు | - | ఉంచిపించు |

ఇవి కాక కింది రూపాలు ప్రేరణార్థకాల్లో కనిపిస్తున్నాయి.

| | | |
|---|---|---|
| తిను | - | తినబెట్టు |
| | | తినజేయు |
| తెలియు | - | తెలియజెప్పు |
| | | తెలియజేయు |

అట్లాగే కొన్ని పద బంధాలు ప్రేరణార్థాన్ని సూచిస్తున్నాయి.

విను - వినేట్లు చేయు

వాడు - వాడేట్లు చేయు

కలియు - కలిసేట్లు చేయు

## 2.2.2 సమాపక క్రియలు :

**2.2.2.1 ప్రార్థనాద్యర్థకం :** తుమర్థక క్రియారూపమే ఏకవచనంలో ప్రార్థనాద్యర్థకంగా వినియోగ పడుతుంది. పిల్చు, కలియు, ఇచ్చు, లేచు వంటి క్రియా రూపాల్లో కొంత వైవిధ్యం కనిపిస్తుంది.

కలియు - కలువు

ఇచ్చు - ఇయ్యి/ఇయ్/ఇయ్యు

లేచు - లే

పిలుచు - పిలు (వ్)

బహువచనంలో ప్రమాణ రూపమైన -అండి తో పాటు -ఉండి ప్రాచుర్యంగా )నిపిస్తూంటుంది. ఈ ప్రత్యయాలతో పాటు -ండ్రి, -న్రి రూపాలు కనిపిస్తున్నాయి.

లేవండి

ఉండుండి

రండ్రి

దున్న్రి మొ॥

గద్వాల, ఆత్మకూరు, వనపర్తి కేంద్రాలలో వచ్చు క్రియా బహువచన రూపాలలో సమీకరణ అధికంగా వినిపించింది.

ఉదా - రాఁడ్రి మొ॥

**2.2.2.2 విధ్యర్థకం :** ప్రమాణ రూపమైన '-అలి' తో పాటు ప్రాంతీయంగా -'ఆలె' ప్రత్యయం వినియోగంలో ఉంది. క్వాచిత్కంగా -'ఆల' ప్రత్యయం కనిపిస్తుంది.

వినాలె

పాడాలె

చదవాలె

మోయాల మొ॥

**2.2.2.3 తద్ధర్మార్థకం :** ప్రమాణ భాషా రూపాలతో పాటు వైవిధ్యంకలిగిన తద్ధర్మార్థక రూపాలు మహబూబ్‌నగర్ జిల్లాలో కనిపిస్తాయి.

| | |
|---|---|
| -తున్- / -టున్ | విడిపోతుంది. |
| | వింటుంది |
| -త / -ట | వేస్తది |
| | అంటది. |
| -తా / టా | కడతారు |
| | అంటారు |
| | కలుస్తారు. |

హ్రస్వ ప్రత్యయం (-త/-ట) చేరిన రూపాల్లో మహద్రూపాలకు మహదితరమైన రూపాలకూ మధ్య తేడా కనిపించదు.

**2.2.2.4 భూతకాలం :** -ఇన్ ప్రత్యయాన్ని మహద్రూపాలకు మహదితర రూపాలకు ఉపయోగించడం ప్రాంతీయ లక్షణం.

పిల్చిండు

కల్సింది

పెట్టిచ్చింది మొ॥

హ్రస్వ అకారం భూతకాలిక ప్రత్యయంగా నకారాంత ధాతువులకు ఉపయోగించడం ఈ జిల్లాలో కనిపిస్తుంది.

విన్నడు

అన్నది

తీసుకొన్నరు

భూతకాలిక ప్రత్యయాలతో పాటు 'ఉండు' క్రియను అనుసంధానించి భూతార్థం ప్రయోగించటం తెలంగాణా ప్రాంతంలో సర్వసాధారణం. ఇదేలక్షణం ఈ జిల్లాలోనూ కనిపిస్తుంది.

మూసిఉండె

చెప్పి ఉంటిమి

పాడుండె మొ॥

ఉత్తమ పురుష ఏక వచనంలో ప్రత్యయ విరహిత రూపాలు ఇతర తెలంగాణా ప్రాంతంలో కనిపించినట్టుగానే ఈ జిల్లా వ్యవహారంలో ఉన్నాయి.

కల్సిన

దున్నిన

పిల్చిన మొ॥

ఇదికాక ఉండు క్రియ భూతార్థంలో సాధారణ హ్రస్వప్రత్యయాలతో -ఇ, -ఎ చేరిన రూపాలు ఉపయోగంలో ఉన్నాయి.

| | |
|---|---|
| నేను | ఉంటి (ని) |
| మేం | ఉంటిమి |
| నువ్వు | ఉంటివి |
| మీరు | ఉంటిరి |
| వాడు } | ఉండె |
| ఆమె } | ఉండె |
| అది అవి | |
| వాళ్ళు | ఉండిరి |

ఈ సందర్భంలో ఉత్తమ, మధ్యమ ఏకవచనంలో -ని, -వి ఉంటే బహువచనంలో -మి, -రి ఉంటాయి. ఉండు క్రియను ఇంకొక క్రియతో కలిపి ప్రయోగించి నపుడు భూత కాలంతో పాటు సుదూర భూతం వ్యక్తమవుతుంది. ఈ అంశం లోగడ పరిశీలనల్లోనూ గమనించిందే.

**2.2.2.5** **ఉభయ సంప్రార్థన :** ఈ అర్థంలో -తాం ప్రత్యయం వ్యవహారంలో ఉంది. ఈ ప్రత్యయానికి హ్రస్వ రూపాంతరం కూడా ఉంది.

కలుస్తాం

చేతం

చూతం మొ॥

న కారాంత ధాతువుల్లో ఇది -దాం/ -దం గా మారుతుంది.

అందం

విందాం మొ॥

**2.2.3 అసమాపక క్రియలు :**

**2.2.3.1 శత్రర్థకం :** ధాతువుకు -తా/-టా ప్రత్యయం చేర్చి శత్రర్థకాన్ని సాధిస్తారు.

ఉంటా

కలుస్తా

ఇస్తా మొ॥

రూపాంతరంగా ప్రమాణ రూపమైన -తూ/టూ ప్రత్యయ ప్రయోగం వ్యవహారంలో కనిపిస్తుంది.

పిలుస్తూ

లేస్తూ

జరుగుతూ మొ॥

క్రియారూపానికి - కుంట / -కుంటా /-కుంటూ చేర్చి శత్రర్థకం సాధించడం ఈ జిల్లాలో ప్రాచుర్యంగానే ఉంది.

దున్నకుంట

కల్సుకుంట

తెల్సుకుంటా

లేచు కుంటూ

పిల్చుకుంట మొ॥

2.2.3.2 **క్త్వార్థకం :** ధాతువుకు -ఇ ప్రత్యయం చేర్చి క్త్వార్థకాన్ని వ్యక్తం చేస్తారు.

ఉండి

పిల్చి

కలిసి

పోయి మొ॥

2.2.3.3 **తుమర్థకం :** ధాతువుకు అ ప్రత్యయం చేరడం ద్వారా ఈ అర్థం ఏర్పడుతుంది.

పిలిపించు – పిలిపించ

చేయించు – చేయించ

చదివించు – చదివించ

**2.2.3.4 వర్తమానార్థకం :** -తు /-టు ప్రత్యయాన్ని ధాతువుకు చేర్చి ఉండు క్రియ నిష్పన్న రూపాలతో ప్రయోగించడం ద్వారా వర్తమానార్థం వివరిస్తారు.

ఇగ్గుతున్నది

తాకుతున్నారు

దేవులాడుతున్నాయి

సుదరాయిస్తోంది.

ఉండు క్రియను పర్యాయ రూపంలో ప్రయోగించడం షాద్‌నగర్, వనపర్తి, కల్వకుర్తి, కొడంగల్, నారాయణ పేట కేంద్రాలలో గమనించడం జరిగింది.

పిలుస్తుండ

దుస్తుండ

ఇస్తాండా

లేస్తాండా

పిలుస్తాండదు మొ॥

**2.2.3.5 చేదర్థకం :** ధాతువుకు -(ఇ) తే / (ఇ) టే చేర్చడం ద్వారా ఏర్పడిన రూపాలు వ్యవహారంలో అధికం.

పాడయితే

వింటే

అంటే

చదివితే మొ॥

పిల్చు, కలియు ధాతువులు బహుళంగా ఉణ్మధ్యాలుగా ప్రయోగిస్తుంటారు.

పిలుస్తే

కలుస్తే మొ॥

షాద్‌నగర్, కల్వకుర్తి కేంద్రాల వ్యవహారంలో చేదర్థకాన్ని క్రియారూపాన్ని -'నంటె' చేర్చడంద్వారా సాధిస్తున్నారు.

పిలిస్తే నంటె

దున్తె నంటె

ఇస్తె నంటె మొ॥

**2.2.3.6 భావార్థకం :** దాతువుకు – అకం చేరటం వల్ల ఏర్పడిన భావార్థకాలు ప్రాచుర్యంలో ఉన్నాయి.

ఇచ్చ్యం

లేస్క్యం

రాస్క్యం మొ॥

అరుదుగా ప్రాచీన ప్రత్యయమైన –ట కూడా విని పిస్తుంది.

వదిలిపోవుట

చెప్పుట మొ॥

అటం/ –అడం చేర్చిన రూపాలు కూడా వ్యవహారంలో ఉన్నాయి.

చదువు చెప్పడం

రాక పోవడం

నేర్పడం

తిన బెట్టడం

వేసుకోవటం మొ||

భావార్థకాలకు చతుర్థీ, సప్తమీ ప్రత్యయాలు చేరిన రూపాలు వ్యవహారంలో కనిపిస్తాయి.

తిట్టుకోవడానికి

చెప్పడానికి

వేయడంలో

విన్కంలో మొ||

**2.2.3.7 సామర్థ్యార్థకం :** తుమర్థకానికి -గల /- గల్గు, -జాలు ప్రయోగించి సామర్థ్యార్థకాన్ని సాధిస్తారు.

కల్వగలడు

ఇయ్యగల్గుతడు

లెయ్యగలడు

ఉండజాల్తడు మొ||

**..2.3.8 క్త్వదర్థకం :** ధాతువుకు -ఇన చేరడంవల్ల ఈరూపాలు ఏర్పడతాయి.

చదివిన

పెట్టిన

పిల్చిన మొ||

అప్పుడు, అటువంటి, -తరవాత వంటివి క్త్వదర్థక రూపం తరువాత చేరిన ప్రయోగాలు కూడా కనిపిస్తాయి.

ఉండినప్పుడు

దున్నేవరకు

కోసేటు వంటి

చేసిన తరవాత మొ॥

**2.2.3.9 తద్ధర్మ విశేషణం :** -ఏ, -ఏటి / -ఏట్ది ప్రత్యయాలు కాలస్థల వాచి నామాల ముందు చేరడం ద్వారా ఈ రూపాలు ఏర్పడతాయి.

దున్నే వరకు

కల్సేదాకా

ఇచ్చే అప్పుడు

ఈ ప్రత్యయం చేరినప్పుడు ట కారం ఆదేశంగా రావడం కొన్ని సందర్భాల్లో గమనించడం జరిగింది.

లేచేటటువంటి

కలిగేటప్పుడు

చెప్పేటటువంటి

వనపర్తి, కొల్లాపూర్, అచ్చంపేట, మహబూబ్‌నగర్, నారాయణపేట కేంద్రాలలో ఎక్కువగా -ఏట్దితో ఉండే రూపాలు కనిపించాయి.

పిల్సేట్ది

కల్సేట్ది

లేసేట్ది మొ॥

**2.2.3.10 అప్యర్థకం :** ధాతువుకు -ఇన/ -ఇనా చేర్చడం ద్వారా ఈ అర్థం వస్తోంది.

లేచినా

ఇచ్చినా

కల్సినా మొ॥

విద్యావంతుల వ్యవహారంలోనూ హ్రస్వరూపాలు రూపాంతరంగా అధికంగా కనిపించాయి.

పిల్చిన

దున్నిన మొ॥

నారాయణపేట, కొడంగల్ కేంద్రాలలో చేదర్థకం మీద 'ఏమి' తో కలిసిన రూపాలు అవ్యర్థకాన్ని సూచిస్తున్నాయి.

పిలిస్తే ఏమి

దున్తే ఏమి

ఇస్తే ఏమి మొ॥

**2.2.3.11 సంభవనీయార్థం :** దాతువుకు -వొచ్చు / -వచ్చు అనే క్రియను చేర్చి చెప్పడం ద్వారా ఈ అర్థాన్ని సాధిస్తారు.

కల్వొచ్చు

ఇయ్యొచ్చు

కొట్టనొచ్చు

తిట్ట వచ్చు. మొ॥

**2.2.4 వ్యతిరేకం :** వ్యతి రేకార్థక క్రియలు కలిపి ప్రయోగించడం ద్వారాను, ప్రత్యయాలు చేర్చడంతోనూ వ్యతిరేకాన్ని సూచిస్తుంటారు.

సమాపక, అసమాపక వ్యతిరేక రూపాలను మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారంలో కింది విధంగా గుర్తించడం జరిగింది.

1. వ్యతిరేక ప్రత్యయాలు చేర్చడం.
2. వ్యతిరేక క్రియలు ప్రయోగించడం

**2.2.4.1 వ్యతిరేక ప్రత్యయాలు చేర్చడం :**

ఎ) తద్ధర్మార్థక వ్యతిరేక రూపాలు - అ ప్రత్యయాన్ని ధాతువుకు చేర్చడం ద్వారా ఏర్పడుతున్నాయి.

ఉండదు / ఉండది

కల్వదు

పిల్వరు

దున్నను మొ॥

బి) (i) ధాతువుకు – అక ప్రత్యయం చేరి పురుష ప్రత్యయాలు చేరడం వల్ల వ్యతిరేక ప్రార్థనార్థకాలు ఏర్పడతాయి.

చదవకు

చూడకు

కల్వకండి

దున్నకు మొ॥

(ii) –అక ప్రత్యయం చేరడం వల్ల ధాతువు వ్యతిరేక క్త్వార్థక రూపాన్ని సంతరించుకుంటుంది.

ఇయ్యక

లెయ్యక

విచారించక మొ॥

(iii) –అక ప్రత్యయంతో పాటు 'ఉడు' తుమర్థక పర్యాయ రూపాలు కలిపి ధాతువుతో ప్రయోగించడం వల్ల శత్రర్థక వ్యతిరేక నిర్మాణాలు ఏర్పడుతున్నాయి.

ఇయ్యకుండ

ఉండకుండ

పిల్వకుండా

విచారించకుండా మొ॥

ఇవికాక కింద సూచించినవి శత్రర్థక వ్యతిరేక అర్థాన్ని సూచిస్తున్నాయి.

ఈ కుండగానే

లెయ్యకుండగానే

పిలఁకుగా

దున్నకున్న

ఇయ్యకున్న మొ॥

శత్రర్థక వ్యతిరేక నిర్మాణాలే కాకుండా అక ప్రత్యయం మీద ఉండు క్రియతో విశేషణ రూపంలో (ఎక్కువగా రీత్యర్థకాలుగా) వ్యవహారంలో ఉన్నాయి.

ఉండకుండేట్టి

పిలకుండేట్టి

చదవకుండేట్టి మొ॥

(iv) ధాతువుకు - అక ప్రత్యయంతో పాటు పోవు, ఉండు క్రియల భావార్థక రూపాలు అదనంగా చేరడం వల్ల భావార్థ వ్యతిరేకాలు ఏర్పడుతున్నాయి.

చదవక పోవడం

కలవక పోవడం

ఉండకుండ్కం

దున్నకుండ్కం

లెయ్యక ఉండ్కం

పిల్సక పోకం

ఇయ్యక పోకం.

(v) ధాతువుకు - అక ప్రత్యయంతో పాటు పోవు, ఉండు ధాతువుల అప్యర్థకాలు చేర్చడం వల్ల వ్యతిరేక అప్యర్థకాలు ఏర్పడుతున్నాయి.

పిల్వకున్నా

కల్వకున్నా

ఇయ్యకపోయినా

లెయ్యక పోయినా మొ॥

ఈ కింది రూపాలు కూడా వ్యతిరేక అప్యర్థకాన్ని సూచిస్తున్నాయి.

పిల్వకుంటే ఏమి

ఇయ్యకుంటే ఏమి

లెయ్యకుంటే ఏమి మొ॥

(vi) -అక ప్రత్యయం మీద పోవు ధాతువు సంభవనీయ రూపాలు చేరితే వ్యతిరేక సంభవనీయరూపాలు ఏర్పడుతాయి.

ఉండక పోవచ్చు

కల్వక పోవచ్చు.

ఇయ్యక పోవచ్చు

లెయ్యక పోవచ్చు మొ॥

(vii) ధాతువుకు -అక ప్రత్యయం చేరి పోవు, ఉండు క్రియల చేదర్థక రూపాలు చేరితే వ్యతిరేక చేదర్థకాలు ఏర్పడతాయి

కల్వక పోతే

పిల్వక పోతే

ఉండకుంటే

దున్నకుంటే మొ॥

షాద్‌నగర్, కల్వకుర్తి కేంద్రాలలో కింద సూచించిన వ్యతిరేక చేదర్థక రూపాలు ( -అంటె చేరగా ఏర్పడినవి) కనిపించాయి.

ఇయ్యకుంటే నంటె

లెవ్వకుంటే నంటె

తెల్వకుంటెనంటే మొ॥

(సి) వ్యతిరేక క్రియా విశేషణం ధాతువుకు - అని చేర్చడం ద్వారా ఏర్పడుతోంది.

చదవని

రాయని

. .

చేయని

ఏవని మొ॥

### 2.4.2 వ్యతిరేక క్రియల ప్రయోగం :

భూతకాలిక వ్యతిరేకం : ఈ జిల్లా అంతటా వ్యవహారంలో అధికంగా క్త్వార్థకం మీద లే / లేదు క్రియను ప్రయోగించిన రూపాలు కనిపిస్తాయి. తుమర్థం మీద లేదు క్రియను ప్రయోగించిన సందర్భాలు చాలా అరుదు.

(క్త్వార్థకం మీద) ఉండిలేను

కల్సిలేవు

దున్ని లేరు

లేచి లేరు

పిల్చి లేవు మొ॥

(తుమర్థకం మీద) పిల్వ లేదు

ఇయ్యలేదు

కల్సలేదు మొ॥

ప్రార్థనార్థక / వ్యతిరేకం : దున్నొద్దు

అనొద్దు

చేయొద్దు

పోవొద్దు మొ॥

వ్యతిరేక వర్తమానం:

(శత్రర్థక రూపాల మీద)

దున్తలేదు

ఇస్తలేదు

చేస్తలేదు

కడుగుతలేదు

(భావార్థక రూపాలమీద)

-అకం

ఉండ్కంలేదు

పిల్సకం లేదు

వినడం లేదు మొ||

-అటం / అడం

కల్వడంలేదు

పిల్వడం లేదు

ఉండడంలేదు

విచారించడంలేదు మొ||

-ఏట్టి / ఏది

ఉండేట్టిలేదు

చేసేట్టి లేదు

వినేది లేదు

పిల్చేది లేదు మొ||

వ్యతిరేక సామర్థ్యం :

పాడలేడు

నడవ లేడు

తాగ లేడు మొ||

ఇవే కాకుండా తుమర్థక రూపాలమీద 'జాలు' వ్యతిరేక రూపాలు చేరిన ప్రయోగాలు వ్యతిరేక సామర్థ్యంలో కనిపిస్తున్నాయి.

ఉండజాలడు

తినజాలరు

వినజాలరు మొ||

నిశ్చయార్థక వ్యతిరేకం : ప్రార్థనార్థక వ్యతిరేక రూపాలే నిశ్చయార్థక వ్యతిరేకాన్ని బోధిస్తాయి - ఇవే కాకుండా - కూడదు / గూడ్దు తో ప్రయోగించిన సందర్భాలు ఉన్నాయి.

పిల్వగూడ్దు

దున్నకూడదు

ఇయ్యగూడ్దు

విచారించగూడ్దు మొ॥

కల్వకుర్తి, మహబూబ్‌నగర్, నారాయణ పేట, కొడంగల్ కేంద్రాలలో నిశ్చయార్థక వ్యతిరేకాలు 'అవసరం లేదు' తో కనిపించాయి.

విన నవసరంలేదు

పిల్వనవసరం లేదు

లెవ్వనవసరం లేదు మొ॥

నారాయణ పేట కేంద్రంలో పై రూపాలతో పాటు నిశ్చయార్థక వ్యతిరేకంలో – రాదు' కనిపించింది.

ఉండరాదు

పిల్వరాదు

చేయరాదు మొ॥

కొడంగల్ కేంద్రంలో పై రూపాలతో పాటు కన్నడ ప్రభావం మూలంగా 'బేకులేదు' తో నిశ్చయార్థక వ్యతిరేకాలు కనిపించాయి

పిల్సకం బేకులేదు

దున్నకం బేకు లేదు

లేస్కం బేకు లేదు.

అనుమత్యర్థక వ్యతిరేకం : తుమర్థక రూపాలకు ఇచ్ఛాక్రియ వ్యతిరేక రూపం చేరడం మూలంగా అనుమత్యర్థక వ్యతిరేకాలు ఏర్పడుతున్నాయి.

కల్పనియ్యరు

చేయనివ్వడు

దున్ననియ్యడు

కలుసు కోనియ్యడు మొ॥

ప్రేరణార్థవ్యతిరేకం : ప్రేరణార్థక క్రియా రూపానికి 'లేదు' చేరడం వల్ల ఈ రూపాలు ఏర్పడుతున్నాయి.

కల్పిచ్చులేదు

ఇప్పిచ్చులేదు

దున్నిపియ్యలేదు

లేపియ్యలేదు మొ॥

## IV మహబూబ్‌నగర్ జిల్లా నిరక్షరాస్యుల వ్యవహార విశేషాలు

మహబూబ్‌నగర్ జిల్లా నిరక్షరాస్యుల వ్యవహారం అటు ప్రమాణ భాషకూ , ఇటు విద్యావంతుల వ్యవహారానికీ పోలుతూ వైవిధ్యంతో కూడి ఉంటుంది. వైవిధ్యలక్షణాలన ఈ కింద సూచించిన అంశాలతో వివరించవచ్చు :

### 1. వర్ణ విభాగం :

**1.1 వర్ణనాదత్వం :** నిరక్షరాస్యుల వ్యవహారంలో పదాదిన, అప్పుడప్పుడూ పద మధ్యంలో ఉండే శ్వాస వర్ణాలు నాద వర్ణాలుగా మారి పోతుంటాయి. విద్యా వంతుల్లో ఈ లక్షణం కనిపించినా అల్పమే.

| | |
|---|---|
| తాకు | దాకు |
| పాడు | బాడు |
| కూర్చో | గూకో |
| ఇక | ఇగ |
| మొకం | మొగం |
| తిట్టుడు | దిట్టుడు |

**1.2 మూర్ధన్యలోపం :** మూర్ధన్యాక్షరాలు దంత్య మూలీయాలుగా మారిపోతుంటాయి.

| | |
|---|---|
| నీళ్ళు | లీల్లు |
| కళ్ళు | కల్లు |
| అణా | అనా |
| ప్రాణం | పానం |

**1.3 ఊష్మాల మార్పు :** శ, ష లు వ్యవహారంలో స గా మారిపోతుంటాయి.

| | |
|---|---|
| శేరు | సేరు |
| షర్బత్ | సర్బత్ |
| క్రీష్తే | క్రీస్తే |

**1.4** అవ్యయరూపాలకు గ కారం అదనంగా చేరుతుంది

| | |
|---|---|
| ఇక్కడ | గీడ |
| అక్కడ | గాడ |
| అటువంటి | గసుంటి |
| ఇటువంటి | గిసుంటు |
| ఇటు | గిటు |
| అటు | గటు |

ఈ ప్రక్రియ సర్వనామాల్లోనూ విస్తరించి ఉంది.

| | |
|---|---|
| ఆమె | గామె |
| ఈమె | గీమె |
| వాడు | గాడు |
| వీడు | గీడు |

**1.5 మహాప్రాణత్వ లోపం :** నిరక్షరాస్యుల వ్యవహారంలో మహాప్రాణాలకు బదులుగా అల్పప్రాణాలే వినిపిస్తుంటాయి. మరీ గమనించి పలికినప్పుడు మహా ప్రాణత్వం కనిపిస్తుంది. మహాప్రాణత్వం లేని శబ్దాలకు కల్పించడంవల్ల కృతక సాధురూపాలు వ్యవహారంలో చోటు చేసుకుంటాయి.

ధ్యాస ద్యాస

ఖరా కరా

సుఖం సుకం

ఖాళీ కాళీ

**1.6 హకార లోపం:** వ్యవహారంలో హకారంతో కూడిన రూపాలు చాలా తక్కువగా ఉంటాయి. అవి హ కార రహితంగా మారిపోతాయి. ఈ సూత్రం హ కార సహిత ఉర్దూ పదాలకూ అను వర్తిస్తుంది.

హెచ్చరిక ఎచ్చరిక

హోలీ ఓలీ

హాని ఆని

పహరా పారా

హూషారు ఉషారు

**1.7 చకారం సకారంగా మారడం :** పదాదిన ఉండే చకారం సకారంగా మారడం నిరక్షరాస్యుల్లో అధికంగా కన్పిస్తుంటుంది. విద్యావంతుల వ్యవహారంలో ఇది ప్రాంతీయ లక్షణంగా ఉంటుంది. దీనికి వ్యతిరేకంగా జరిగినప్పుడు సకారాది పదాలు చకారాదిగా మారడం కృతక సాధురూపాలు ఏర్పడతాయి.

చేవ సేవ

చదువు సద్వు

చెరువు సెరువు

చిలక సిల్క

చీమ సీమ

**1.8 పదాదివకార లోపం :** నిరక్షరాస్యుల వ్యవహారంలో పదాదిన వకార లోపం అధికం. వకారం తరవాత అ|గ్రాచ్చులున్నట్లయితే అదనంగా యకారం వచ్చి చేరుతుంది.

| | |
|---|---|
| వచ్చిలేదు | అచ్చిలేదు |
| వీధులు | ఈదులు / యీదులు |
| విసుర్రాయి | యిసుర్రాయి |
| వాన | ఆన |
| వాడు | ఆడు |

**1.9** హిందూస్థానీ, ఇంగ్లీషు భాషా ప్రభావం వల్ల ప్రమాణభాషల్లో ప్రవేశించిన ఫ వర్ణం నిరక్షరాస్యుల్లో పగా మారిపోతోంది.

| | |
|---|---|
| ఫోటోలు | పోటోలు |
| ఫజీతు | పజీతు |

**1.10** ప్రశ్నార్థక సర్వనామాలకు ముందు యకారం చేరడం నిరక్షరాస్యుల వ్యవహార లక్షణం.

| | |
|---|---|
| ఎప్పుడు | యెప్పుడు |
| ఎక్కడ | యేడ |
| ఎట్ల | యెట్ల |

**1.11** తాలవ్య, కంఠ్యాచ్చులు పదాదిన ఉంటే య, వ లు శ్రుతులుగా వస్తాయి.

| | |
|---|---|
| ఇగురు | యిగురు |
| ఎందుకు | యెందుకు |
| ఉపవాసం | వుపాసం |
| ఇయ్యకుండ | యియ్యకుండ |
| ఒడ్డు | వొడ్డు |

**1.12 లోపదీర్ఘత :** పదమధ్యంలో వర్ణ లోపం జరిగి పూర్వ స్వరం దీర్ఘం చెందిన రూపాలు నిరక్షరాస్యుల వ్యవహారంలో అధికం.

| | |
|---|---|
| ఉపవాసం | ఉపాసం |
| గడియలు | గడీలు |
| తగువులాలు | తగూలు |

**1.13 వర్ణవ్యత్యయం :** జిల్లా అంతటా ప్రధానంగా నిరక్షరాస్యుల వ్యవహారంలో కనిపించే మరో లక్షణం వర్ణ వ్యత్యయం. బహువచనాలకే కాకుండా మిగిలిన రూపాలకూ ఈ లక్షణం విస్తరించి ఉంది.

| | |
|---|---|
| గొర్రెలు | గొర్లు |
| బర్రెలు | బర్లు |
| పగులు | పలుగు |
| గుబులు | బుగులు |
| తగిలిచ్చు | తల్గిచ్చు |

**1.14 వర్ణ అనాదత్వం :** పదాదిన, అప్పుడప్పుడు పద మధ్యంలో నాదాలు శ్వాసాలుగా మారడం నిరక్షరాస్యుల వ్యవహారంలో ప్రాచుర్యంగా కనిపించే లక్షణం.

| | |
|---|---|
| మీసాలు | మిచ్చులు |
| గింజలు | గిచ్చలు |
| సేద్యకాడు | సేతకాడు |
| పొగరు | పొకురు |

**1.15 సకారం చకారంగా మారడం :** పదాదిన సకారం చకారం మారడం నిరక్షరాస్యుల్లో గమనించడం జరిగింది. దీన్ని కృతక సాధురూప లక్షణంగా గుర్తించవచ్చు.

| | |
|---|---|
| సబ్బు | చబ్బు |
| సుద్ద | చుద్ద |

| సుతారి | చుతారి |
|---|---|
| సుడి | చుడి |

1.16 రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలలో కనిపించినట్లుగానే మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారంలో భేదక తటస్థీకరణ చెందిన రూపాలు కనిపిస్తున్నాయి. అర్థ భేదక వర్ణం ఏ స్థానంలో నైనా తటస్థీకరణ పొందితే రెండు వర్ణ సంకేతాలు ఆవృత్తమవుతుంటాయి. అప్పుడు పర్యాయ రూపాలు వ్యాప్తిలో ఉంటాయి. ప్రస్తుత సందర్భంలో గమనించినవి కొన్ని :

ఎ) పదాది వకారం మీది అకారం ఒకారంతో పర్యాయప్రవృత్తి పొందటం.

| వ / వొ | వడ్లు / వొడ్లు |
|---|---|
| | వద్ద / వొద్ద |

బి) చకారంతో ఉండే ఎ, ఏలు అ, ఆల తో మార్పు చెంది పర్యాయప్రవృత్తి పొందటం.

| చె/చ | చెడ్డ/చడ్డ |
|---|---|
| | చెక్కుడు / చక్కుడు |
| చే/చా | చేప / చాప |
| | చేతలు / చాతలు |

సి) i) ఒ, ఓ / వొ, వో / వ, వా

ఒకరు / వొకరు / వకరు

ఓడు / వోడు / వాడు

ii) ఎ, ఏ / యె, యే/య, యా

ఎక్కడ / యెక్కడ / యక్కడ

ఏపు / యేపు / యాపు

1.17 **కృతకసాధురూపాలు :** అటు ప్రమాణ భాషనూ, ఇటు విద్యావంతులను అనుకరించే ఉద్దేశంతో నిరక్షరాస్యుల వ్యవహారంలో అతినాగరిక రూపాలు ఏర్పడుతుంటాయి.

మూర్ధన్యం చేర్చడం :

| | |
|---|---|
| మనుష్యులు | మడుసులు |
| చాలీసా | చాళీసా |
| చవులేకాయ | షవుళేకాయ |
| రేగిపండ్లు | రేణిపళ్ళు |

హ కారం చేర్చడం

| | |
|---|---|
| అండా | హండా |

సంయుక్తాలుగా మార్చడం

| | |
|---|---|
| తాంబాళం | స్తాంబాలం |

**1.18 సంయుక్తాల మార్పు :** వ్యవహారంలో సంయుక్తాక్షరాలు సమీకరణం చెందడం కానీ, అసంయుక్తాలుగా మారడం కానీ, సర్వసాధారణం

ఎ) సంయుక్తాక్షరాల్లో ఉన్న హల్లు తొలగిపోవడం వల్ల అసంయుక్తాలు ఏర్పడుతుంటాయి.

| | |
|---|---|
| పిల్వురి | పిలురి |
| స్నానం | తానం |
| ప్రియం | పిరం |
| డ్రైవర్ | డైవరు |

బి) సంయుక్తాక్షరాల మధ్య మరో వర్ణం చేరి స్వరభక్తి జరిగి అసంయుక్తాలుగా మారి పోతుంటాయి.

| | |
|---|---|
| ఎత్మినాన్ | ఎతిమినాన్ |
| స్కూలు | ఇస్కూలు |
| రాత్రి | రాతిరి |
| అల్కగా | అలుకగ |

సి) సంయుక్తాక్షరాలు సమీకరణం చెందడం వల్ల సంయుక్తత తగ్గిపోయి ద్విత్వాలుగా మారి పోతుంటాయి.

| | | |
|---|---|---|
| పోయొస్తి | పోయొస్సి | స్త > స్స |
| మస్తు | మస్సు | |
| లక్ష | లచ్చ | క్ష > చ్ఛ |
| లగ్నం | లగ్గం | గ్న > గ్గ |
| కష్టం | కట్ట్ | ష్ట > ట్ట |

**1.19 స్వరలోపం :** పద మధ్య స్వర లోపం వల్ల నిరక్షరాస్యుల వ్యవహారంలో సంయుక్తాక్షరాలు ఏర్పడటం సహజం.

| | |
|---|---|
| బుగులు | బుగ్లు |
| వసుకుళ్ళ | వస్క్ళ్ళ |
| మాపటికి | మాపట్కి |
| ఆలుగడ్డ | ఆల్గడ్డ |
| మీదికి | మీాద్కి |
| పడశాల | పడ్సాల |

**1.20** నిరక్షరాస్యుల వ్యవహారంలో కలిసి పోయి వ్యవహరించే ఆంగ్ల పదాలు మూలరూపాన్ని మార్చుకొని కలిసి పోతుంటాయి. అటువంటి సందర్భంలో జరిగే మార్పులు కొన్ని

| | | | |
|---|---|---|---|
| సంయుక్తాల తొలగింపు : | స్కూల్ | - | ఇస్కూలు |
| | డ్రైవర్ | - | డైవరు |
| | గ్లాస్ | - | గిలాసు |
| అచ్చులలో మార్పు : | టికెట్ | - | టిక్కెట్టు |
| | మోటర్ | - | మోట్రు |
| | సినెమా | - | సైన్మ |

| | | |
|---|---|---|
| బేంక్ | - | బైంక్ |
| సర్ | - | సైర్ |

**1.21** నిరక్షరాస్య వ్యవహారంలో గోచరించే స్వర, వ్యంజనాల మార్పుల్లో కొన్ని

అచ్చులు :

| మార్పు | | |
|---|---|---|
| అ > ఒ | పప్పు | - పొప్పు |
| | బగోను | - బొగోను |
| | పొగరు | - పొగురు |
| ఆ > ఓ | వాగు | - ఓగు |
| ఎ > ఒ | రెండేండ్లు | - రొండేండ్లు |
| ఏ > ఓ | జేబు | - జోబు |
| ఇ > ఉ | ఉసిళ్లు | - ఉసుళ్ళు |
| ఏ > ఈ | కేక | - కీక |
| ఉ > అ | పటేలు | - పటేల |

హల్లులు :

| మార్పు | | |
|---|---|---|
| ర > ల | కక్కుర్తి | - కక్కుల్తి |
| డ > న | గడియారం | - గన్యారం |
| మ > ప | బొమ్మ | - బొప్ప |
| ద > న | మీద | - మీన |
| బ > వ | గుబిలి | - గువిలి |
| గ > జ | గువిలి | - జివిలి |
| ద > జ | ఉద్దీ | - ఉజ్జీ |
| ప > వ | అడ్డపంచ | - అడ్డవంచ |
| డ > ళ | గొంగడి | - గొంగళి |
| బ > గ | బుక్క | - గుక్క |
| ద > య | ఆదివారం | - అయితారం |
| ల > న | చాలా | - చానా |

## 2 పదాంశ విభాగం :

పదాంశ విభాగానికి సంబంధించి నిరక్షరాస్యుల వ్యవహారంలో కనిపించే కొన్ని ప్రధానాంశాలను మాత్రం ఇక్కడ పేర్కొనడం జరుగుతుంది.

### 2.1 నామ విభాగం ;

**2.1.1 ఔపవిభక్తికాలు :** నిరక్షరాస్యుల వ్యవహారంలో కకార సహిత అవ్యయరూపాలు అధికంగా ఉంటాయని లోగడ వర్ణ విభాగంలో (1.4) పేర్కొనడం జరిగింది. వాటి సామ్యం వల్ల ఏర్పడే ఔపవిభక్తిక రూపాలు ప్రమాణరూపాల కన్నా భిన్నంగా ఉంటాయి.

| | | | | |
|---|---|---|---|---|
| అవి | - | వాటి | గవి | గవిటి / గయిటి |
| ఇవి | - | వీటి | గివి | గివిటి / గియిటి |

**2.1.2 బహువచనం :** నిరక్షరాస్యుల వ్యవహారంలో బహువచన ప్రత్యయం మూర్ధన్యత కోల్పోతుంది. దాని స్థానే దంత మూలీయం వినిపిస్తుంది.

| | | |
|---|---|---|
| రాళ్ళు | - | రాల్లు |
| వీళ్ళు | - | వీల్లు |
| నీళ్ళు | - | నీల్లు |

**2.1.3 నామప్రత్యయాలు :**

| | | |
|---|---|---|
| - కాడ | ఇంటికాడ | (సమీపార్థంలో) |
| -తాట/తాన | ఇంకొకని తాట | ('దగ్గర' అనే అర్థంలో) |
| | దాని తాన | |
| | వాని తాట | |
| -తోని | ఉద్దేశంతోని | (కరణార్థంలో) |
| | దుడ్డుతోని | |
| | వానితోని | సహార్థంలో |
| -తోన | అన్నంతోన | కరణార్థంలో |
| -నుంచి | కత్తినుంచి | కరణార్థంలో |

**2.1.4 సంఖ్యా వాచకాలు :** నిరక్షరాస్యుల వ్యవహారంలో ప్రాంతీయత లక్షణాలు ప్రతిబింబించే సంఖ్యాపదాలు వాడకంలో ఉన్నాయి. వీటిలో మూర్ధన్యత కనిపిస్తుంది.

పద్నాల్గు - **14**

తొ్ంబై - **90**

రాయలసీమ మాండలిక ప్రభావం వల్ల కొన్ని కేంద్రాలలో (గద్వాల, ఆత్మకూరు మొ. కేంద్రాలలో) కింద సూచించిన సంఖ్యాపదం రెండు విధాలుగా ఉచ్చరించడం జరుగుతోంది.

పద్మూడు
పదమూడు } **13**

'**100**' ను సూచించేందుకు 'నూరు' ను '**200**' కు ఇన్నూరు / రెండు నూర్లు, '**300**' కు మున్నూరు / మూడు నూర్లు అని నిరక్షరాస్యుల వ్యవహారంలో ఉంది.

**2.2 క్రియా విభాగం :**

**2.2.1 సమాపక క్రియలు :** క్రియలు కాలవాచక ప్రత్యయాలలో జిల్లా అంతటా నిరక్షరాస్యుల్లో హ్రస్వ రూపాలే ప్రచురంగా ఉన్నాయి.

వర్తమానం : గెల్కు_తున్నారు, తాగ్తున్నావ్, దొబ్బుతుంద్రి మొ||

తద్ధర్మం : పడ్తం, చేస్తవ్, సన్పోతయి, గద్దేస్తయ్ మొ||

భూతకాలం : గొల్తిర్గింది, తెచ్చినయి, కడ్లతయ్ మొ||

భూతకాలాన్ని సూచించడానికి పై రూపాలతో పాటు కింది ప్రయోగాలు కూడా కనిపించాయి.

పడి ఉండె

చేసుకుంటిమి

లేకుండె

ఇయ్యకుంటిమి మొ||

**2.2.2 ఉభయు ప్రార్థన :** -ద్దాం కు బదులుగా - తం ప్రత్యయం అధికంగా కనిపిస్తుంది.

పిలుద్దాం - పిల్తం

చూద్దాం - చూతం

కలుద్దాం - కల్తం

**2.2.3** క్రియాజన్య విశేషణాల ప్రయోగంలో తద్ధర్మార్థకాలు - ఏటి ప్రత్యయ ప్రయోగంతో విన్పిస్తున్నాయి. వీటితో పాటు ఏ ప్రత్యయ సహిత రూపాలు వ్యవహారంలో ఉన్నాయి.

చదివే పుస్తకం - చద్వేటి పుస్తకం

పంచేటీచర్ - పంచేటి టీచర్

దేవులాడే మనిషి - దేవులాడేటి మన్షి

**2.2.4 ప్రార్థనార్థకాలు :** ప్రార్థనార్థకాల్లో కూకో / కూసో, ఇయ్యి, పిలు, కలు, తుడ్సు, లెవ్వు మొదలయిన రూపాలు విలక్షణంగా విన్పించాయి.

**2.2.5 శత్రర్థకం :** శత్రర్థక రూపాల్లో - తూ ప్రత్యయానికి బదులుగా -కుంటా చేర్చి వాడటం ఎక్కువగా కన్పిస్తుంది.

దున్నకుంటా -

చెడాయించుకుంటా -

బగాయించుకుంటా

పిల్సుకుంటా మొ॥

**2.2.6** ప్రశ్నార్థకాల వ్యక్తీకరణలో తానాన్ని ఉపయోగించడం విద్యావంతుల కన్నా నిరక్షరాస్యుల్లో అధికం.

చూశావా చూసినావు ?

చూసినవా ?

విన్నావా విన్నావు ?

విన్నవా ?

కలుస్తావా కలుస్తావు ?

కలుస్తవా ?

పై రూపాల్లో హ్రస్వరూపాల్లో ఉన్న ప్రశ్నార్థకాలు ప్రాంతీయంగా అంతటా కన్పిస్తాయి. తానం ఉపయోగించిన దీర్ఘ రూపాలు మాటుకు ఎక్కువగా నిరక్షరాస్యుల్లో కన్పిస్తున్నాయి.

**2.2.7** భూతకాల వ్యతిరేక రూపాల వ్యక్తీకరణలో అనుకూల రూపాలతో వ్యతిరేకార్థాన్ని సాధించడం ఈ మాండలిక విశేషంగావే పరిగణించాలి.

రాలేదు రాకచ్చిండు

తినలేదు తినకిచ్చింది

ఇదికాక క్త్వార్థక రూపం మీద లే – క్రియారూపాలతో ప్రయోగించిన రూపాలూ వ్యవహారంలో ఉన్నాయి.

వచ్చిలేను

తినిలేదు

విని లేదు మొ॥

**2.2.8** సంబంధ పద బోధక పద బంధాల్లో లేదా ఉపవాక్యాల్లో క్రియా విశేషణాలు 'అప్పుడు' తో వచ్చే రూపాలు మూర్ధన్యంతో కాకుండా దంత్య మూలీయంతో వస్తాయి.

చదువుకునేటప్పుడు - చద్వుకొనేతప్పుడు

వినేటప్పుడు - వినేతప్పుడు

**2.2.9** ఇతర తెలంగాణా ప్రాంతా వ్యవహారంలో ఉన్నట్టుగానే ఇక్కడి (నిరక్షరాస్యుల) వ్యవహారంలోనూ 'తోల్కొని వచ్చు' క్రియారూపం మనుష్య పరంగా ఉపయోగంలో ఉంది. మిగిలిన వ్యవహార మండలాల్లో ఈ క్రియ పశుపక్ష్యాదులకు మాత్రమే పరిమితం.

బిడ్డను తోల్కస్తం

పిల్లగాడ్ని శాలెకి తోలిస్త

తాతను తోల్కస్త మొ॥

**2.2.10** అవ్యయాలు వ్యతిరేక క్త్వార్థక రూపాలకు 'గా' చేరి ఏర్పడుతుంటాయి.

వినకుండగా

పాడకుండగా

చేయకుండగా

## V పదజాలం - కొన్ని విశేషాలు

ప్రాంతీయతా లక్షణాలను గుర్తించేందుకు పదజాలం బహిరంగ ప్రమాణంగా ఉపయోగిస్తుంది. ఇంతకు ముందు విభాగాలలో వ్యాకరణ, వర్ణాంశాలలో గోచరించే విలక్షణతలను గురించి వివరించడం జరిగింది. మహబూబ్‌నగర్ జిల్లాల వ్యవహారం పశ్చిమోత్తర మాండలికానికి చెందింది కనక తెలంగాణా పలుకు బడులు అధికంగా ఉంటాయి. నైసర్గికంగా ద్విభాషా వ్యవహార మండలంగా ఉన్నప్పటికీ చారిత్రకంగా అంతర్గత వ్యవహారంలో కావ్య భాషా రూపాలు నిలిచి ఉన్నాయి. అయితే కొన్నింటికి అర్థాలు యథాతథంగా ఉంటే మరికొన్ని వేరే అర్థాలలోనూ లేదా అర్థపరిమితులను కుదించుకొని గోచరిస్తాయి. ఇవన్నీ ఈ ప్రాంత విలక్షణతను సుస్పష్టంగా తెలియజేస్తాయి. సూత్రప్రాయంగా కొన్ని వ్యవహార రూపాలకు ప్రాచీన కావ్య ప్రయోగాలను ఉదాహరించడం జరిగింది *.

* ఇక్కడ సూచించిన కావ్యప్రయోగాలు శబ్దరత్నాకరం (1989 పునర్ముద్రణ), శ్రీ సూర్యరాయంధ్ర నిఘంటువు (1979 పునర్ముద్రణ) తెలంగాణా మాండలికాలు, కావ్య ప్రయోగాలు (1988 ముద్రణ.సం. డా. రవ్వా శ్రీహరి) ఆధారంగా సేకరించినవి.

| మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహార రూపం | కావ్యభాషా రూపం | మ. జిల్లాలో అర్థం | కావ్యభాష లో అర్థం |
|---|---|---|---|

1. అగ్వ / అగ్గవ | అగ్గువ | చవక | చవక, వెల తక్కువ

చాటుగా బంచెనతడు రాక్షసుల కెల్ల
గ్రోతి మాంస మగువయయ్యె గొనుడటంచు.

రామాభ్యుదయం. 8-25

---

2. అఱ్ఱ | అఱ్ఱు | గది | గది

అర యుచు నుండెదనని భూ

సురయుతుఁడై యధిపుఁడఱ్ఱు సొచ్చెన్ బుద్ధిన్

సింహాసన ద్వాత్రింశిక 4-270

3. ఆగంచేయు | ఆగంచేయు | అల్లరి, దిక్కులేని వారగు | నిరాశ్రయులు చేయు దిక్కులేని వారిని చేయు:

మమ్మునటనాగము చేయఁగ మూర్ఛనందియున్

క్షత్రబంధూపాఖ్యానం 3-152

4. ఇంగలం / ఇంగ్లం | ఇంగలం (<ఇంగాలో. ప్రాకృతం>) | నిప్పు | నిప్పు

ఇంగలములు నాలుగ దెసల నిడుకొని కడఁకన్

5. ఇసం | విసం | చెడువు | విషం, జలం

మించు చూపుచునె నమ్మించి నిల్కడ యేది విసమొసంగెడి మబ్బు గొసర నేల

యయాతి చరిత్ర 1 ఆ.

6. ఎరుక / ఎఱుక తెలియడం తెలివిడి
ఎర్క
నీకెరుక లేని దెయ్యది లేదు

దాశరథి చరిత్ర 1-21

7. ఏర్పాటు / ఏర్పాటు తెలుసు నిర్ణయం నియమం
యేర్పాటు వివరణం
ఎట్టెట్లా వినమైతి మింకనొక మాతేర్పాటుగా జెప్పుమా

కాశీ 8

8. ఒడిబియ్యం ఒడిబియ్యం పెళ్ళికూతురిని అత్తారింటికి
పంపేడప్పుడు కాను కలిచ్చి చేసేతంతు
ఒడిబియ్యమిడి కూర్మి యెలయ గౌగింట -

పరమయోగి విలాసం 5 అ

9. కక్కు కక్కు వాంతి డోకు/ వాంతి
సభలో నులూకుని బంచియాడించిన పరుసఁ దనము కక్కించి

భారతం, భీష్మ 3.97

10. కడుపు / కడుపు పొట్ట/ పొట్ట, గర్భం
కడ్పు గర్భం
జారుశశిబొంది కటా కడుపేల దెచ్చు
కొంటెగ్గు దలంపగా వలదే ... భాగ 9.378

11. కనికరం కనికరం దయ / జాలి కరుణ, శోకం
తనకుందనయులు లేమికిఁ గనికరమందుచును.

భల్లాణచరిత్ర 3 ఆ

12 కాల్మడి కాల్మడి మూత్రం మూత్రం
మడుపులు పసుల కాల్మడి బ్రుచ్చె

హరి. పూ - 5 అ

13. కీడు కీడు హాని అపకారం, హాని
అశుభం
కీడె కురువంశమున కతని రాక భార అశ్వ 4 ఆ

14. కుత్క/ కుత్కె కుతుక కంఠం కంఠం

చేత ముమ్మొన వాలు చిలువ సూడిగములు
నొసల మిక్కిలి కన్ను విసపు c గుతుక

రాజ 3 లి

15. కొంచబోవు కొంచబోవు తీసుకొని పోవు తీసుకొని పోవు

కానుకలు కప్పములు కొంచబోయి స్వామికి
అర్పించి రాయవాచకం 34

16. కొత్త (లు) కొత్తలు డబ్బు పైకం డబ్బు, నాణేలు

ముడుపులు జాళెలు వెలగి దల మూటలు
కడలేని ధనము కొత్తలును తాళ్ళపాక కవుల కీర్తనలు 2.231

17. కొయ్‌గూర కొయ్‌గూర తోటకూర తోటకూర

పాలవాయింట తక్కలి బచ్చలి కొయిగూర
హంస వింశతి 4-133

18. గడ్డపార గడ్డపాఱ నేలను పెల్లగించే సాధనం ఖనిత్రం

వాడు శల్యాసురుండ నవ సుధc బరగు, శల్యరూపత
నునికి cదచ్చులల చయు గడ్డపాఱల కైవడి cగాను పించి
పేర్చుట ఖనిత్ర శలు cడను పేరుగలదు. కళా 6 ఆ

19. గులగుల గులగుల దురద చూర్ణ నలుగుడు దురద

వాడును గులగులలైలావగ, లినమై విదిలించికొనుచు లేచె గిదుకుచున్
పాండు 4 ఆ -4

20. జిమ్మా/ జుమ్మా జిమ్మా బాధ్యత బాధ్యత

మనతో గూడిన కార్య మెల్ల తమ జిమ్మా యున్న, ది
రంగరాయచరితం

21. తంతెలు తంతె మెట్లు మెట్లు
పెట్టించి తంతెలు పెద్దగాలోన
సిద్ధేశ్వర చరిత్ర 130 పే

22. దేవులాడు దేవులాడు వెదుకు వెదుకు
తిత్తి కొలకు జెడును దేవులాడి
వేమన శతకం

23. బోరెం బోరెం గోనెబస్తా ధాన్యం పోయడానికి బండిమీద వేసే - గోనెతట్టు
గోతముల్ నగలు గెంటిపు బోరెము గోనెతట్టు
లాతనింటిలో గణన శక్యమై లెలయు
హంసవింశతి 5-97

'4. వాడకట్టు వాడకట్టు వీధి/బస్తీ వీధివాడ
మన పురిలో మన వాడకట్టునక
సిద్ధేశ్వర చరిత్ర 101 పు

25. సుద్ది సుద్ది వార్తలు, సంగతి విషయం, సంగతి
నా సుద్ది యింతఁగని. శుకసప్తతి 2-113

26. సోయి సోయి స్పృహ స్పృహ
సొలసి పరున్న వాఁడు తన సోయి యెఱంగక
క్షత్ర బంధూపాఖ్యానం 3-29

ఈ విధంగా మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారంలో ప్రాచీన పదరూపాలు పుష్కలంగా కనిపిస్తాయి. కింద ఇచ్చిన మరి కొన్ని పదాలలో మాండలిక లక్షణాలను గమనించవచ్చు.

| మహబూబ్‌నగర్ మాండలికం | ప్రమాణభాషా రూపం |
|---|---|
| బుడ్డలు | వేరుశెనగకాయ |
| గుజ్జుచేయు | పచ్చడి చేయు |

| | |
|---|---|
| బోదేతీయు | పొదుచేయు / కలుపుతీయు |
| గ్రాసం | కొలువు / ఉద్యోగం |
| ఇడెం | తాంబూలం |
| కిరికిరి | గొడవ |
| ముని మనుషులు | పెద్దమనుషులు |
| కుత్కె | గొంతు |
| అంగడి | దుకాణం |
| అయినాతి | ప్రధానమైన |
| కందిబేల్లు | కందిపప్పు |
| ఉప్పరిపని | కూలిపని |
| కూనం | గుర్తు |
| సుళ్ళ | అబద్ధం |
| ఖరా | నిజం |
| బేకయినపని | ఇష్టంవచ్చిన పని |
| నస్కుళ్ళ | పొద్దున్నే |
| దేవులాడు | వెతుకు |
| బల్‌గాగ | ఎక్కువగా |
| చౌళ/షౌళకాయ | గోరుచిక్కుడుకాయ |
| పఱ్ఱిదుము | పగులుబారు |
| ఒప్పను | అంగీకరించను |
| ఉద్దెర | అప్పు |
| గోడుంబి | జీడిపప్పు |
| బాళేపండు | అరటి పండు |
| బోర్లు / బోఱ్లు | గిన్నెలు |
| దుడ్లు | డబ్బు |
| చాలీసా | కళ్ళద్దాలు |
| సాల | స్కూలు |
| పొర్క | చీపురు |
| డావు | వడ్డాణం |
| జగ్గి | బిగ్గరగా |

| | |
|---|---|
| మర్దిగండు | మొద్దు |
| సండి | షండుడు |
| దేవసాలు తక్కువోడు | నెలతక్కువగా పుట్టిన బిడ్డ |
| సోయితప్పినోడు | చేయవలసిన పని తెలియనివాడు |
| బోసు పోయినోడు | భవిష్యత్తులేని వ్యక్తి |
| సోలు దప్పినోడు | శుభాలకుదూరమైన వ్యక్తి |
| చిర్రనెత్తి | చిందర వందర జుట్టు |
| దుబ్బకొక్కు | బలిసినవాడు |
| పొట్టిగిచ్చ | మరుగుజ్జు |
| బరిగాళ్ళు | చెప్పులు లేని కాళ్ళు |
| కొప్పెరగోలుగా | పూర్తిగా నిండుగా |

## VI మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారం – ఆధునిక ప్రమాణ భాష సామ్యాలు, వైవిధ్యాలు

వ్యవహారంలో గోచరించే ప్రాంతీయ భేదాలను అనుసరించి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో నాడుకలో ఉన్న తెలుగు భాష 'యాస' ను నాలుగు ప్రధానమైన మాండలికాలుగా భాషా శాస్త్రజ్ఞులు విభజించారు. అవి : (1) కళింగ మండలం (శ్రీకాకుళం, విశాఖపట్నం విజయనగరం జిల్లాలు – పూర్వాంధ్రం (2) రాయల సీమ – దక్షిణ మండలం (కడప, కర్నూలు, అనంతపురం చిత్తూరు, నెల్లూరు, ప్రకాశం జిల్లాలు) (3) ఉత్తర మండలం – తెలంగాణా (మెదక్, నిజాంబాదు, ఆదిలాబాదు, మహబూబ్‌నగర్, రంగారెడ్డి, నల్లగొండ, ఖమ్మం, కరీంనగర్ జిల్లాలు) (4) మధ్య మండలం (ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు, జిల్లాలు). ఇందులో మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారం ఉత్తర మాండలికానికి చెందుతుంది. ప్రసార సాధనాలలోనూ, ఆధునిక సాహిత్య రచనల్లోనూ ఉపయోగంలో ఉన్న మధ్యాంధ్ర విద్యావంతుల వ్యవహారం ప్రస్తుతం ఆధునిక ప్రమాణ భాషగా చెలామణీ అవుతున్నది*. కనక దీనితో మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారాన్ని

---

* ఆధునిక ప్రమాణ భాష అంటూ ఏదీ రూపు దాల్చలేదని అధివర్ణాంశాల ఆధారంగా ప్రాంతీయ, సామాజిక మాండలిక వైవిధ్యాలగురించి పరిశోధన చేసిన వెకటేశ్వర శాస్త్రి. జె (ఎ స్టడీ ఆఫ్ తెలుగు రీజనల్ ఎండ్ సోషల్ డైలెక్ట్స్, ఎ ప్రసోడిక్ ఎనాలిసిస్, 1994, సెంట్రల్ ఇనిస్ట్యూట్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజెస్, మానస గంగోత్రి, మైసూర్-6) అభిప్రాయం.

పోల్చిచూపటం వల్ల రెంటి మధ్య పోలికలూ తేడాలు స్పష్టంగా గమనించగలం. వర్ణ, పదజాలానికి సంబంధించిన వివరాలను కింద పట్టికలో పొందుపరచడం జరిగింది.

---

పండితుల్లో కొంత మంది ఒక భాషా సామాజిక వైవిధ్యాన్ని మరికొంత మంది మరో వైవిధ్యాన్ని, ఇంకొంత మంది ఎటువంటిదీ లేకుండా వైవిధ్యాల మధ్య పరస్పర ప్రక్రియలనుగమనించక భాషా ఉపయోగాల్ని వివరించడంలో సఫలీకృతం కాలేదు. ఉదాహరణకు కేవలం విద్యనే గుర్తిస్తే విద్యా వంతుల వ్యవహారంలో కొన్ని లక్షణాల లోపాలను వివరించలేం. ఇతరవైవిధ్యాలు ఏక కాలంలో అనువర్తించడం వల్ల ఈ ఇబ్బంది ఏర్పడుతుంది. అందువల్లే వర్తమానంలో ఏది ప్రమాణ భాషగా రూపు దాల్చి లేదు.

తెలుగు భాషలో ప్రస్తుత స్థితి ప్రాంతీయ, సామాజిక వైవిధ్యాలవల్ల ఏర్పడుతుంది. అందువల్ల ఏర్పడిన ప్రమాణ భాష లోపం గురించి వివరిస్తూ ఫెర్గ్యూసన్ ద్విశైలీ సిద్ధాంతం (డైగ్లాసియా), ఫిష్మన్, ఫాసోల్డ్‌లు ప్రతిపాదించిన అంశాల ఆధారంగా తెలుగు భాషా స్థితిని వివరించవచ్చునని, లేపేజ్ ప్రతిపాదన అనుసరించి సామాజిక జాగృతి సూచించేందుకు గుర్తింపు సూచించే చర్యలు అవసరమని, వీటిని లెబోవ్ నమూనాలో రూపొందించిన భాషా సూచికలను కలిపి ప్రమాణీకరణ పురోగతి సూచించ వచ్చని శాస్త్రి - ఇంకా ప్రమాణం ఏర్పడలేదన్న విషయం నిర్ధారించవచ్చని శాస్త్రి అభిప్రాయం.

ఈ సందర్భంలో ప్రమాణ ఆంగ్లానికి లెబోవ్ సూచించిన సూచికల్లాగే ప్రమాణ తెలుగు భాషకు - (మహా ప్రాణత్వం, ఊష్మం షకారం, మూర్ధన్యాలు (పార్శ్వికం అనునాసికం, ఊష్మం), నిమ్న సంవృతాచ్చు (ఏ) ఊనిక లేని రెండో అక్షరం నిలుపుదల) అయిదు సూచికలు ప్రతిపాదిస్తూ చివరి రెండూ ప్రాంతీయమని, మొదటి మూడు సామాజిక గతమనీ వివరించారు.

అయితే గమనించదగిన అంశమేమంటే తాన అంశం (ఊనిక లేని రెండో అక్షరం నిలుపుదలను) తప్ప మిగిలిన సూచికలు ఇప్పటి వరకూ పరిగణనలోకి తీసుకున్నవే.

| అంశం | ఆధునిక ప్రమాణ భాష | మహబూబ్‌నగర్ మాండలికం [1] |
|---|---|---|
| **ఎ. వర్ణవిభాగం** | | |
| **1.** అచ్చులు | ఏ | లేదు |
| **2.** హల్లులు | | |
| i) మహాప్రాణాలు | ఉన్నయ్ | విద్యావంతుల్లోనూ అరుదే. |
| ii) ఫవర్ణం | ఉంది | లేదు |
| iii) శ, ష, స లు | ఉన్నయ్ | ఉన్నయ్[2] |
| iv) న, ణలు | ఉన్నయ్ | నకారం ఎక్కువ |
| v) ల, ళ లు | ఉన్నయ్ | లకారం ఎక్కువ [3] |
| vi) పదాదివకార లోపం | లేదు | ఉంది. |
| **బి. వ్యాకరణ విభాగం** | | |
| **1.** నామ విభాగం | | |
| **1.** బహువచనం | లు ( ~ ళు) | లు (ళు చాలా తక్కువ) |
| **2.** విభక్తి ప్రత్యయాలు | | |
| ఎ) సంబంధార్థకం | -తో | -తోని, తోటి |
| బి) అభ్యంతరార్థకం | -లో | -ల, -లో |

**1.** ఈ జిల్లా మాండలిక వ్యవహారంలో గోచరించే ఆధునిక ప్రమాణ భాషా రూపాలను మినహాయించి తేడాలను మాత్రం ఎత్తి చూపడం జరిగింది. అందువల్ల విద్యలేని వారి భాషనే ప్రాంతీయ మాండలికంగా గ్రహించాల్సి ఉంటుంది.

**2.** 'శ' వర్ణానికి తెలుగు భాషలో రెండు విధాల - వివృత, ద్రోణిత ఉచ్చారణలు ఉన్నాయి. ఈ జిల్లాలో ద్రోణితోష్మ ఉచ్చారణ మాత్రమే వినిపిస్తుంది.

**3.** మహబూబ్‌నగర్ జిల్లా మాండలికంలో ల, ళలలో లకారం విస్తృతంగా వినిపించినా కన్నడ భాషా ప్రభావం ఉన్న ప్రాంతాల్లో (ప్రధానంగా - మక్తల్, గద్వాల, కొల్లాపూర్, కొడంగల్ తాలూకాకేంద్రాల ప్రాంతాల్లో) ళకారం స్పష్టంగా వినిపించడమే కాకుండా అధిక మూర్ధన్యీకరణ ఉంటుంది.

| | | |
|---|---|---|
| సి) అపాదానార్థకం | - నించి | - నుంచి, -నుంటి, - నుండి, -కెల్లి. |
| డి) ఉపర్యర్థకం | -మీద | -మీద, పై, మీన |
| ఇ) నిమిత్తార్థకం | -కోసం | -కోసం -కోస్రం / కోసరం, -కొరకు |
| ఎఫ్) సమీపార్థకం | -దగ్గర | -వద్ద/ వొద్ద -దగ్గర - కాడ, తానే |
| జి) అభిముఖార్థకం | - ముందు | -ముంగట, -ముంగల -ముందగల, ముందుగత |
| హెచ్) నిర్ణీత సమయార్థకం | - వరకు | -కి, -దాకా, -వరకు |
| ఐ) అవధ్యర్థకం | - వరకు | దంక, -దాకా -వరకు |
| జె) అనంతర్యార్థకం | -తరవాత | -అక, తర్వాత |
| కె) సంబంధ బోధకం | - | - యొక్క |

3. భావార్థకాలు

| | | |
|---|---|---|
| ఎ) అవ్యతిరేకం | -అటం/-అడం (అనటం/అనడం) | - ఉడు /-అకం |
| బి) వ్యతిరేకం | -అకపోవడం | - అకపోవుడు |

## 11. క్రియా విభాగం

### 1) భూతకాల ప్రత్యయాలు

| | | | |
|---|---|---|---|
| ఉత్తమ | ఏ | -ఏ / -నా- | -ఇన -/-న- |
| | బ | ,, | ,, |
| మధ్యమ | ఏ | | |
| | బ | ,, | -ఇన్/-న |

| | | | | |
|---|---|---|---|---|
| ప్రథమ | ఏ | మహత్ | -ఏ-/-నా- | ,, |
| | | మహదితర | -ఇన్-/-న- | ,, |
| | బ | మానవ | -ఏ-/-నా- | ,, |
| | | మానవేతర | -ఇన-/-న-/ | -ఇన-/-న- |

2. తద్ధర్మార్థక ప్రత్యయాలు

| | | | | |
|---|---|---|---|---|
| ఉత్తమ | ఏ | | -తా-/-టా- | -త-/ట- |
| | బ | | ,, | ,, |
| మధ్యమ | ఏ | | ,, | ,, |
| | బ | | ,, | ,, |
| ప్రథమ | ఏ | మహత్ / మహదితర | -తుం-/-టుం- | ,, |
| | బ | మానవ | -తా-/-టా- | ,, |
| | | మానవేతర | -త-/-ట- | ,, |

3. వర్తమాన ప్రత్యయాలు

| | | | | |
|---|---|---|---|---|
| ఉత్తమ | ఏ | | -తున్నా/-టున్నా/ | -తున్న/-టున్న |
| | బ | | ,, | |
| మధ్యమ | ఏ | | ,, | ,, |
| | బ | | ,, | ,, |
| ప్రథమ | ఏ | మహత్ | ,, | ,, |
| | | మహదితర | -తున్న/-టున్న | ,, |
| | బ | మానవ | -తున్నా/-టున్నా | ,, |
| | | మానవేతర | -తున్న-/-టున్న- | ,, |

| | | | |
|---|---|---|---|
| 4. | సామర్థ్యార్థకం (తద్ధర్మార్థక రూపాలు ఇదే అర్థాన్ని సూచిస్తాయి) | తుమర్థం + గల | తుమర్థం + గల్గు +జాలు +లేయు (వినజాల్తడు, వినలేస్తడు మొ॥) |
| 5. | ప్రార్థనార్థకం | -అండి - | అంద్రి, - ఉండి, - ఉంద్రి, -న్లి, -న్రి (చేయంద్రి, చేయున్లి, చేయున్రి మొ.) |
| 6. | ఉభయ సంప్రార్థన | -దామ్-/-తామ్ | దామ్, /-దమ్ -జ్దా -/-తమ్ (చేదామ్, చేదమ్ చేజ్దామ్, చేతమ్ మొ.) |
| 7. | నిశ్చయార్థకం | -ఆలి | -ఆల, -ఆలె |
| 8. | శత్రర్థకం | -తూ -/-టూ- | -కుంట/-కుంటా (చేసుకుంట, చేసుకుంటా) |
| 9. | చేదర్థకం | -తే/-టే | -తా /-తె/టె (-తె+గిన -టె+గిన) ఉంటెగిన (=ఉన్నట్లయితే) వస్తెగిన (=వచ్చినట్లయితే ) మొదలయినవి |
| 10. | క్త్వార్థకం | -ఇ | -ఇ |
| 11. | అప్యర్థకం | -ఇనా/-నా | ం /-న |
| 12. | తుమర్థకం | -అ | -అ |
| 13. | తద్ధర్మ విశేషణాలు | -ఏ | -ఏటి |
| 14. | క్తవదర్థకం | -ఇన | - ఇన |

**గమనిక :**

1. పట్టికలో ఇచ్చిన భేదాలు రెండు విధాలుగా ఉన్నాయి. వాటిలో మూర్ధన్య వర్ణాల్లో గల రూపాలు నకారాంత ధాతువుల తర్వాత వస్తాయి.
2. కాలవాచి ప్రత్యయాలు ధాతువు తర్వాత పురుష ప్రత్యయాలకు ముందు వస్తాయి.
3. ఉత్తమ పురుష ఏక వచనంలో రూపాలు సాధారణంగా మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారంలో పురు ష ప్రత్యయ రహితంగా ఏర్పడుతున్నాయి.

15. వ్యతిరేకం

| | | |
|---|---|---|
| 1) భూతకాలం | తమర్థకం + లేదు | తుమర్థకం + లే + లేదు<br>క్త్వార్థకక్రియారూ పం + లే + పురుష ప్రత్యయం |
| 2) తద్ధర్మార్థకం | క్రియరూపం + వ్యతిరేకం ప్రత్యయం (-అ-) + పురుష ప్రత్యయం | ప్రమాణ భాషా రూపమే ఉంది |
| 3) వర్తమానార్థకం | క్రియారూపం + అటం/అడం + లేదు | క్రియ రూపం + -ఉడు/ -అకం + లేదు |
| 4) సామర్థ్యార్థకం | తుమర్థకం + లే+ పురుష ప్రత్యయం | తద్ధర్మ వ్యతిరేక రూపాల్లో ఇదీ ఉంది |
| 5) నిషేధం | +అక్కర్లేదు<br>+కూడదు | + వద్దు/వొద్దు/ఒద్దు<br>+ కూడదు |
| 6) క్త్వార్థకం | +అకుండా | + అక + అకుంట<br>+అకుండ |
| 7) శత్రర్థకం | +అక | +అక<br>+ అకుంట |

8) అప్యర్థకం +అకపోయినా +అకున్న/ అకున్నా
+అకపోయినా

(నిషేధం నుంచి అప్యర్థకం వరకూ గల ప్రత్యయాల్ని తుమర్థక రూపాల మీద చేర్చగా వ్యతిరేక రూపాలు ఏర్పడతాయి)

16. క్రియల మీద విభక్తి ప్రత్యయాలు

1) భూతకాలిక క్రియావిశేషణం మీద + నుంచి + నించి
+తర్వాత +సంది
+ నంక
+ తర్వాత

2) తద్ధర్మార్థక క్రియా విశేషణం మీద +ట్ + అప్పటికి +వరకు

17. పురుష ప్రత్యయం ప్రథమ (ఏక వచన మహదితర వ్యతిరేకం) –దు –దు/ది

## సి. కొన్ని భాషా ప్రక్రమాలు

1. వర్ణసమీకరణాలు

| | |
|---|---|
| వేస్తరు | వేత్తరు |
| అగ్ని | అగ్గి |
| జడ్జీ | జజ్జి |
| లక్ష | లచ్చ |
| ఉత్సాహం | ఉచ్చాహం |

2. లోప దీర్ఘత

| | |
|---|---|
| కసవు | కాసు |
| మగవాడు | మొగోడు |
| మహంకాళి | మాకాళి |

| | | | |
|---|---|---|---|
| | | మహదేవ | మాదేవ |
| | | మహారాజు | మారాజు |
| 3. | వర్ణవ్యత్యయం | పగలు | పల్గు |
| | | మరలు | మ్రలు |
| 4. | విప్రకర్ష | లగ్నం | లగ్గనం |
| | | ధైర్యం | దయిర్నం |
| | | రాత్రి | రేతిరి |
| | | మాత్ర | మాతర |

## డి. పదజాలం

| | | | |
|---|---|---|---|
| 1. | అవ్యయాలు | అట్లా / అలా | గట్ల/అట్ల/ అలా |
| | | ఇట్లా /ఇలా | గిట్ల /యిట్ల/ఇలా |
| | | ఎట్ల/ఎలా | యెట్ల/ఎలా |
| 2. | సంఖ్యా పదాలు | తొంబై | టొంబై |
| | | పద్నాల్గు | పడ్నాల్గు |
| | | పదిహేను | పదైదు |
| | | పద్దెనిమిది | పజ్జెన్మిది |
| | | వంద | వంద, నూరు |
| | | రెండువందలు | ఇన్నూరు, రెండునూర్లు |
| | | మూడు వందలు | మున్నూరు, మూడునూర్లు |
| | | నాలుగు వందలు | నన్నూరు, నాల్గు నూర్లు |
| | | వెయ్యి | వెయ్యి/ఎయ్యి |
| | 2 – 7 | –గురు | –గురు |
| | 8 – | –గురు, –మంది | – మంది |

| | | |
|---|---|---|
| 3. క్రియరూపాలు | పిలవ లేదు | పిల్వలె, పిలలె పిల్వలె |
| | తెలీదు/తెలియదు | తెల్వదు /తెల్వది |
| | కల్వదు/కలియదు | కల్వది/కలది |
| | దున్నతావు | దుంతవు/దున్నుతవు |

4. బాంధవ్య బోధక పదాలు

| | | |
|---|---|---|
| తండ్రి | నాన్న | నాన్న, అయ్య, అప్ప |
| తల్లి | అమ్మ | అమ్మ, అవ్వ |
| తల్లి అక్క | ఆమ్మ | పెద్దమ్మ, పెద్ది, ఆయమ్మ |
| తల్లి చెల్లెలు | పిన్ని | చిన్నమ్మ, చిన్ని |
| తండ్రి తల్లి | బామ్మ | నాయ్నమ్మ, అవ్వ, జేజి బాపమ్మ, అయ్యమ్మ, అవ్వ జేజి |
| తండ్రి అన్న | పెదనాన్న | పెదనాయ్న, పెద్దయ్య పెద్నాన్న, పెద్దప్ప |
| తండ్రి తమ్ముడు | బాబాయి | చిన్నాయ్న, కక్కయ్య, కాక చిన్నప్ప, చిత్తప్ప |
| తోటి కోడలు | తోడికోడలు | యారాలు/యారాన్లు/యారాండ్లు |

(గమనిక :వైవిధ్యం ఉండే కొన్ని పదాలను మాత్రమే ఇక్కడ ఉదాహరించడం జరిగింది. మిగిలిన పదాలను మాండలిక పదబంధ కోశంలో గమనించవచ్చు.)

| | | |
|---|---|---|
| 5. సాధారణ భావాలు | దాహం | దూప |
| | పొగరు | రిమ్మ, మస్తి, పెచ్చులు |
| | దిగులు | గుబులు, బుగులు, భయం |
| | పిచ్చి | పిస, తిక్క, పిచ్చి |

ఈ విధంగా ఆదునిక ప్రమాణ భాషతో పోల్చి చూసినప్పుడు మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారం సామ్యాలతో పాటు వై విధ్యాన్ని, ప్రతిబింబిస్తూంటుంది.

ఈ అధ్యాయంలోని ముందు విభాగాల్లో మహబూబ్‌నగర్ జిల్లా వ్యవహారం లోని వివిధ భాషాంశాలను క్లుప్తంగా చర్చించడం జరిగింది. ఇటీవలి కాలంలో పెరిగిన విద్యాసౌకర్యాలవల్ల, ఇతర విధానాల ద్వారా పెరుగుతున్న జాగరూకత, అక్షరాస్యత వల్ల ఇక్కడి వ్యవహారంలో క్రమేపీ ఆధునిక ప్రమాణ భాషా ప్రభావం పెరుగుతోంది. నైసర్గిక పరిసరాల కారణాల వల్ల కొంత మేరకు కన్నడ భాషా ప్రభావం, రాజకీయ కారణంగా (సంస్థానాధీశులు మహారాష్ట్రీయులు కావడంవల్ల - కొంత మేరకు అంతర్లీనంగా మరాఠీ భాషా ప్రభావం, ముస్లిముల పరిపాలనలో ఉండటం మూలంగా హిందుస్థానీ ప్రభావం ఎక్కువగానే కనిపిస్తుంటుంది. ప్రాచీన భాషా రూపాలు మాండలికంలో రంగరించుకొని కనిపిస్తూనే ఉంటాయి. చాలా కాలంగా ప్రాంతీయంగా అన్నిరంగాల్లోనూ వెనక బడి ఉన్నామన్న భావన వ్యవహర్త అంతరంగంలో ఉండి అది వ్యవహారంలో ప్రతి బింబిస్తూంటుంది. అందువల్ల అధికంగా ప్రమాణ భాషను అనుకరిద్దామన్న కోరిక వ్యక్తమవుతూంటుంది. వీటన్నిటి మిశ్రమాన్నే మహబూబ్‌నగర్ మాండలిక భాషగా గ్రహించాల్సి ఉంటుంది. అందులో వీరి సంస్కృతి ప్రతి ఫలిస్తూంటుంది.

# 1. వ్యవహార ఖండిక

కేంద్రం : జడ్చర్ల
వృత్తి : లాయర్
వయస్సు : 37 సం.
విద్య : బి.కామ్., ఎల్.ఎల్.బి.
కులం : ఒడబలిజ
లింగం : పురుషుడు

......ఓ ల్డు హెచ్చెస్సీ వరకు హయ్‌స్కూల్ల జద్విన. తర్వాత ఇంటర్ పియుసీ బిపిసీ తర్వాత బికామ్ తర్వాత త్రియర్స్ అయిద్రాబాద్ల ఎల్.ఎల్.బి. చేసిన నయిన్‌టీన్ సెవెంటీటు నుంచి జాన్వరి నుంచి మహబూబ్‌నగర్ నగ్గర్ల లాయర్గ ప్రాక్టీస్జేసిన. పందొమ్మిది వందల ఎనబై మూడుల జాబ్‌ల జేరిన యేపీపీగా. స్పెషల్ మొబైల్ కోర్ట్‌ల యేపీపీగా ఫన్జేస్తున్న. జాబ్‌చేయాలని వుద్దేశం లేకుండె అప్పుడు. మా దంత వ్యాపారమే. క్రిమ్నల్‌కేసులు గానీ సివిల్‌కేసుల్గాని మనీ మ్యాటర్స్ ఉంటయ్ గద ఎవర్కో అప్పజెప్పే బదులు మనమే జేసోకోవచ్చని అడ్వకేట్ల ప్రాక్టీస్ చేస్కుంట బాగుంటదని జాబ్ సెక్యూర్టీ గిట్ల బవిష్యత్‌ల ఉండది మనం సహియించేది గుడ్క ఆజోన్ చేసేది దాన్కి ఈక్వాలుంటది ఇప్పుడు యాపారం. అడ్వకేట్ల చేస్తే ఇది బిజ్నెస్ ప్లేస్ పర్టిక్యులర్‌గ జడ్చర్ల మనకు డిఫరెంట్ వరయిటీ సోఫ్ కేసెస్ వస్తాయి. మనీ మేటర్స్‌గానీ వేరేడిస్ ప్యూట్స్ వస్తయి మనం ఈజీగా గెటాన్ కావచ్చు. ఉద్యోగం లేకున్న బత్కొచ్చు అనీ ఈ ప్రకారం గాజేయడమ్. ఇక అడ్వకేట్ల గుడ్క ప్రాక్టీస్ జేస్తే త్రిఇయర్స్‌గానీ టెనియర్స్‌గానీ మనకు జాబ్ సోర్సెస్ గూడా వున్నయ్. యేపీపీగానీ మున్సిఫ్ మేజిస్ట్రేట్గానీ దాదాపు అదే గిట్ల రకంగా కోర్టుల్లోపట కోర్టు క్లర్క్, బ్యాంకు లీగలడ్వయిజర్గగానీ జూడిషియల్‌క్లర్క్ మనం జేయొచ్చు నేను అడ్వకేటున్నప్పుడు, యూనియన్ బ్యాంకు ఆంద్రాబ్యాంకు లీగలడ్వయిజర్గుంటి ఫయినాన్స్ కంపెనీ లీగలడ్వయిజర్గుంటి జాబెట్లంటే మనకు భవిషత్తు సెక్యూర్టీ వుంటదని జాబ్‌ల జేరటము. జేరిన తరవాత గూడా పెద్ద ఇన్సెంటివ్ ఏమీ లేవు. ఇప్పుడెయ్యి రెండువేల లోపట అనుమకొండ అయిద్రాబాద్ల గెటాన్ కాలేము. కాని ఏమయిందంటే రెగ్యులర్స్ సోర్స్ ఆఫ్ ఇంకం ఉంటది కన్క చేయడం జరుగుతది అంతే. సర్కుతెచ్చిస్తే అమ్మిస్తరు. అమ్మిస్తే రూపాయిన్నర కమిషనుంటది. కమీషనొస్తది. దాన్కి మా ఫాదరూ, బ్రదరూ అదే పని చేసినరు. ఏవస్తువు గానీ రాగులు కందులు ఆముదాలు ఏ పంట దాన్యము మన దుకాణం దెచ్చిస్తే అదీ ఈళ్ళమ్మిస్తరు. నూటికి రూపాయి యాబై పైసలు కమీషను. మా తరాలన్నీ అదే బిజ్నెస్ నుంచే సిక్టీ సెవెంటీ

ఇయర్స్ నుంచి గుడ్క్ ఉద్యోగం అంటే ఒప్పుకోలేదన్నమాట. వ్యాపారం మీదట ఉద్యోగం మంచిది. రెగ్యులర్‌సోర్స్ ఇంకం ఉండాల. డైవెడయి పోయి నంగద! మనకు లిమిటెడ్ ఫ్యామిలీకి గావాల అంటే గావాలంటే జేయాల. యాపారం అంటె మన్నుంచిగాదు. పరిస్థితులు బాగాలేవు దాన్కి ఉద్యోగంలజేరినమ్. అసలీడ కోర్టు లేదు.

ఉద్యోగం కొరకు ఇంట్రస్ట్ లేదు మాకు. కోర్టుంటే గుడ్క్ ప్రాక్టీస్జేయొచ్చు. కోర్టు సాంక్షన్ అయింది పది పదేను సంవత్సరాల బ్యాకె .......... చీఫ్ మినిస్టరున్నప్పుడె అయింది తర్వాత ......... వీళ్ళంతా వచ్చినారు కదా! కోర్టు సాంక్షన్ అయింది. బడ్జెట్ సాంక్షన్ అయింది. ఏమయిందంటే ల్యాక్ ఆఫ్ రిప్రజెంటేషన్. ఎవరు ప్రాపర్గ రిప్రజెంట్ చేసి తెచ్చుకుంటలేరు. ఇప్పుడ్గూడ సాంక్షనయింది. బడ్జెట్ అయిపోయింది. నారాయణపేట గదా! కన్నడ ఉంటుంది తెల్గు ఉంటది, హిందీ ఉంటది, డెబ్బై సంవత్సరాలు ఎన్బై సంవత్సరాలు అయిపోయినాయి అంతా కమీషన్ యాపారమే. మొత్తం మీద... తర్వాతేంచేసినారంటే రయిస్ కొన్కం, తర్వాత వేరే యాపారం స్టాట్ చేసినామ్. ఈ వూరికి ఫ్యాక్టయితే సోర్సు మెయిను యాపారమె. అది తప్పితే వేరే యాపారం లేదు. నో యూజ్ పోలాలున్నాయ్‌గాని, అవి పెద్ద పట్టింపు లేదు. ఇప్పుడు ఉన్నోళ్ళంత ఏమయినరంటే యాపారం ఈ దిక్కు సెటిలయిన్రు. ఈ వంద సంవత్సరాల నుంచి కూడా. ఈవూర్లో నేటివ్ ఎవ్వరు లేదు. ఒక వంద రెండు వందల కుటంబాలు తప్ప అయితే ఏమయింది వంద సంవత్సరం క్రితం నుంచి సెటిలయినోళ్ళు ఉన్నారు. యాపారం అంటే యాపారం స్టాట్ చేసినంక. ఉండయి ప్రతి ఒక్కర్కి పొలాలు అవి నమ్మి ఎవ్వరు జేస్తులేరు. ఎట్లుందంటే యాపారంలో పొలాల కంటే ఎక్కొస్తది. వాళ్ళకు పదివేలు రూపాయలు, సంవత్సరానికొస్తె, లక్షరూపాయలు గూడా సంపాయిస్తారు యాపారంలో. అందరు ఆంధ్రప్రదేశ్ మొత్తంల యాపారంల అంటె ఎక్స్‌పోర్టు అమెరికాకి ఈడి కెల్లి. క్యాస్టరాయిలు. ఈటికెల్లి వస్తయి. కరీద్దార్లున్నరు గద. పెద్దయాపారస్తులున్నరు. ఆళేం చేస్తరంటే ఈడ్కొచ్చి.... కొంటరు. ఈడకాక ఏంచేస్తరంటే మార్కెట్ కొరకు ఏడ దొర్కితే ఆడ కొన్కస్తరు. వడ్లు దొర్కుతయ్ అనుకోండి మన నెల్లూర్ల, ఆలంపూర్ కాడ శాంతినగరని వొడ్లు కావల్సి నోళ్లు, దుడ్లున్నోళ్ళు ఏది బడితే అది దీస్కస్తరు. పంట కూలోళ్ళదగ్గరికి బోయి ఉండి కోపిచ్చి తెచ్చుకొంటరు. తెచ్చుకోని ఇక్కడ ఇది జేస్తరు. ఇక్కడ ఆముదాలు యాపగింజలు, ఆసీజన్‌లోపట ఏంచేస్తరు. నూనె ౯యారుజేస్తరు. యాపనూనె తయారుజేసి పంపిస్తరు హయిద్రాబాద్‌కు. హయిద్రాబాద్ ౨ంటె మార్కెట్ ఎక్కడంటె అక్కడవాళ్ళు కొనొక్కపోతరు. సబ్బులు మెడిసెన్సు తయారువుతుంటయి. దాన్నుంచి ఎక్స్‌పోర్టు అవుతుంటది. ఎక్కువ ఈ జడ్చర్లల

ఏందంటే గ్రవుండ్ నట్సు. సీడు పల్కాది తీస్తరు అమ్మేస్తరు. ఇప్పుడు మూడ్నెల్లు ఉంటది వొడ్ల సీజన్. ఆ మూడు నెలలునడుస్తయ్ బాగా అప్పుడు కొన్ని ఏరియాలెట్లుందంటె ఇప్పుడాంధ్రా ఉంది. రాయలసీమ వుంది. కొన్ని వేరే ప్లేసులున్నాయి. మున్నూటర్వై రోజులు వడ్లు పండేటేయి వుంటయ్. వాటర్ సోర్సెస్ నుంచి ఆడికెల్లి తెప్పించుకుంటరు వొడ్లు. తెప్పించుకొని మిల్లింగ్ చేస్తారు రయిస్ . దీంట్లేందంటే కొంత మందికేమొ పడ్తల్ అంటారు.... కొంత మందికి గిట్టుబాటు అయితది. కొంత మందికి గిట్టుబాటు కాదు. గిట్టుబాటు అయితేనేమో కంటిన్యూ చేస్తరు. ఆ యాపారం గిట్టుబాటు కానోల్లు ఏంచేస్తరంటే బంజేసేస్తారు. ఆ మూన్నెల్లు సీజన్ కొరకు.... ఎట్లైంట్లంటే మిల్లు బెట్టాల గవర్నమెంటు వాళ్ళు పర్మిటిస్తరు. ఈల్లు అమ్ముకునాల అమ్ముకొంటె ఏమయితదంటే ఈ డిఫ్రెన్సు వాళ్ళకు అంతాలాస్లవొస్తది. అందుకొరకె వొడ్లు దొర్కాల గద! అందు కొరకె ఏం చేస్తర్గద!.. వొడ్లు సప్లయ్ జేయదు. పర్మిటిస్తరు అవుటాఫ్ స్టేట్ల అమ్ముకోనీకె. కేర్లా, మద్రాసు, మారాష్ట్ర, పంజాబు అక్కడికి పోవాలంటే ప్వర్మిటియ్యర్గద. గవర్మెంటు ఇప్పుడు లీస్ ఇస్తె బెట్టె లీవ్ ప్రకారం దీనికిక్వెల్ల పర్మిటిస్తరు. రెండు లారీలకు బెట్టి నారన్కోండి పెర్మిట్‌కే నాల్గు లారీలకు ఇస్తరు. అయితే రెండు లారీలకు పెర్మిటిస్తర్గద వాళ్ళకు బెడ్తర్గద నష్టమ్‌లబెడ్తరు. నష్టమ్‌తోనె బెడ్తరు. అయితే లాబమ్ రావాలంటే నాల్గు పర్మిట్లిస్తరు. ఇగ మార్కిట్ జూస్కుంటరు. ఏయేర్యాలెక్కువ రేట్ ఉంది. ఆయేర్యాలమ్ముకుంటరు. నష్టమ్ లేదనుకో రెండింతలు లాబమొస్తది వాళ్ళకు. వస్తదీ! కాని కొంచెం పేషెన్స్ండాల ఓప్క పయిసలుండాలి. టయిమ్ ఉండాలి. ఉడక బెడ్తరు బాయిల్జేస్తరు. బాయిల్డ్రయిసు రెండే మిల్లులున్నయ్ ఈడ, షాద్‌నగర్‌లో ఒకటో ఉన్నది అది కేర్లాల దప్ప ఇంకేడవాడరు. ఎక్కడా వాడరు. ఆ ఏర్యాల ఉప్పుడు బియ్యం మంటరు. కేర్లకు బోతాయి. మొత్తం ఇండియాలో ఒక్క కేర్లలలోనే ఇంకెక్కడవాడరు. వుప్పుడు బియ్యం వాడేది. మన దగ్గర వాడరు.... కేస్లు మూడు రకాలు ఒకటి సివిల్, క్రిమ్నలు, రెవెన్యూ సివిల్ మ్యూటరంటే లాండ్ డిస్ప్యూట్ మనీ డిస్ప్యూట్, క్రిమ్నల్ అంటే అఫెన్సంటాది. రెవెన్యూ మ్యాటర్సెట్ల ఉంటాయంటే ముంద్నొచ్చి కొట్టేసిండంటే పట్టా సర్టిఫికెట్ అని ల్యాండ్ అసయిన్‌మెంటు గవర్నమెంటుకు ఇటువంటివి ఉంటయి. జన్రల్‌గ ఈ ఏర్యాలమా దగ్గర ఎట్లుంటదంటే ల్యాండ్ డిస్ప్యూట్స్ తక్వ. మనీ మ్యాటర్స్ ఎక్కువ. జడ్చర్ల ఏర్యాల. ఎందుకంటే ఇక్కడ యాపార్లున్నారు గద! వీళ్ళు లోనిస్తరు. ఎవరికీ ఆసాములకు గాని తర్వాత వేరే బయట పార్టీసుకు గాని, వీళ్ళు వాళ్ళ దగ్గర వుద్దెర దెచ్చుకుంటరు. ఇప్పుడు సూట్‌ఫైల్ చేస్తే ఏంచేస్తరంటే ఫైల్ చేస్తరు. మనీ సూటని పైసల కొరకు ఫైల్ చేస్తరు.

కొన్నిట్ల ఎట్లుంటదంటే ప్రామిసరీ నోటనుంటది మనీ సూట్లు. ఇక్కడ మనీసూటని అంటే ఇక్కడ యాపారస్తులతోటి ఏంటంటే, మనీసూటంటే ప్రామిసరీ నోటు లేకుంట. ఓన్లీ లెడ్జర్ మీదాధారమ్ ట్రాన్జాక్షన్ ఇస్తరు. దీస్కుంటుంటరు గద! కరీద్దారున్నడు ఈఉల్లు మాల్ పర్చేజ్ చేస్తరన్కోండి. ఇప్పుడు ప్రామ్సరీ నోట్ రాసిచ్చి దీస్క బోడు, అదేముంది క్యాషెండ్క్యారీ పయిసలిచ్చి దీస్కోని పోవాలె. కాని, వీళ్ళ దగ్గరేముందని ఉండెనంటే, రెండు రోజులు మనం పరిచయం అయిపోతే మూడోరోజు ఎట్లా క్రెడిటిస్తరు. అట్లా వీళ్ళు వ్యాపారమ్ జేస్తుంటె కంటిన్యూ అయితది గదా! వీళ్ళు లక్షల కొద్ది మాలు క్రెడిట్లిస్తర్. వాళ్ళు నెలకోసారి రెణ్నెల్లకోసారి పదేను రోజులకోసారి ఎట్ల వాళ్ళు కాంటాక్టులుంటే అట్ల ఒక వేళ ఇయ్యకుంట డ్యూపడ్డదనుకోండి వీళ్ళ దగ్గర ఆ లెడ్జరుంటది. వాళ్ళ పేరు మీద కాతా. వాళ్ళిచ్చిన బిల్లులుంటాయ్ సర్కొత్తుకుపోయినయి. దాని పేరు మీద సూట్ ఫయిల్జేస్తరన్నామాట కోర్ట్‌ల... చేయొచ్చు.. కంటిన్యూషన్ యాపారానికి. మనీ ట్రాన్జాక్షన్ పర్పస్ ఫుల్గ మనీ చేబదల్ దీస్కోని చేస్తేనేమో మనీ ట్రాన్జాక్షన్ అయితది. ఇదే బిజ్నెస్ ట్రాన్జాక్షన్ అయితది. ఇప్పుడు కిరానాదుక్నం అనుకోండి సామాను ఉద్దెర తెచ్చుకుంటారు. క్రెడిట్ పయిసలిచ్చి తెచ్చుకోవాలి లెక్కయితే, మన మేం చేస్తమూ. పాత సర్కు పైసలిస్తుంటం కొత్తది దెచ్చుకుంటూంటం. పాతదిస్తుంటం కొత్తది దెచ్చుకుంటుంటం. సర్కులె సపోజ్ వానికి నాల్గు వందలు బాకీ పడిందనుకోండి మీరియ్యరు. అయితే వాని దగ్గర. మీరు రాసిచ్చిన కాయిదాలు లేదుగద. సర్కుల దాని మీదనే బాకీ ఉంటది. తర్వాత డిబీజల్ సూట్స్ చేయనీ కెట్లుంటదంటే చేయనీకెరాదు. పాతది దీస్కబోయినమని చెప్పడు గద. దీస్కబోయినా అనే జెష్టమ్ క్రిడెటుందీ, సంతకాలుండయి అన్నీ ఉన్నాయి తర్వాత బట్టల షాపల్లల్ల కూడా క్రెడిటిస్తర్గద సంతకాలు దీస్కుంటరు ఆటోమేటిగ్గా అతని దగ్గర ఇప్పుడు ప్రావిజన్ నోటు ఎట్ల ఉంటదంట, మనమూ మీ దగ్గర పయిసల్దీస్కోని మనం ప్రావిఓన్ నోట్ రాసిస్తమ్ దాన్మీదముంట్టది. సూట్ పయిల్జేస్తమ్ కోర్ట్‌ల త్రీ యియర్స్ ఉంటది. డిప్యూటేషన్ల ఇచ్చినప్రోజునుంచి, మనకు మూడేండ్ల లోపట క్లియర్ జేయకపోతేనయితే టయింబారయితది. దాని కొరకేంజేస్తమంటే డెప్లెట్‌గా సూట్ ఫయిల్జేస్తమ్ మూడు సంవత్సరాల్లోపట బాంకుంటేనంట మార్ట్‌గేజ్ చేస్కుంటరు. ఇల్లు ల్యాండు తాకట్టు బెట్టుకొని ఇస్తరు. ఇచ్చి దానికేం జేస్తరు, మళ్ళేంజేస్తరు. కొల్లేట్రల్ సెక్యూర్టీ అని ప్రామిసరీ నోట్ రాయించుకుంటరు. అసలు మార్ట్‌గేజ్ చేసింతర్వాత ప్రామ్సిరీ నోటక్కర్లేదు. ఎందుకు రాయించుకుంటరంటే కోల్లేట్రల్ సెక్యూర్టీ ఎందుకూ అంటే ఈ ఆరు వేల రూపాయలు లోన్ దీస్కుంటే ప్రాపర్టీ మార్ట్‌గేజ్ చేస్తరు.

అప్పుడు సీజన్గాద మార్కెట్ బెర్గొచ్చు తగ్గొచ్చు. మిల్లు విల్వ యాభై వేల రూపాయలుందనుకోండి. భవిష్యత్తుల విల్వ లక్షగావొచ్చు. పోనీ ఇర్వైవేలుగావచ్చు ఇర్వై వేలయినప్పుడేం చేస్తరంటే, సూట్ ఫయిల్జేస్తడు డిక్రీ దీస్కుంటడు. ప్రాపర్టీ చేంజేసి పయిసల్దీస్కోవాలి గద! మీ యిల్లు అగ్రరాజుకు బెద్తరనుకో, ఇర్వై వేలొస్తే, ఆనికి సూట్కి ఇర్వైవేలయింది గద! నల్బై వేలయింది గద! నల్బైవేలయితే లక్ష చేస్తడు. మార్కెటు లేదు. అందుకని కొల్లేట్రల్ సెక్యూర్టీ. ప్రామిసరీ నోటు. గీ ప్రామ్సరీ నోటు మీద రాస్తే, పర్సన్ ప్రాపర్టీ ఇప్పుడు మన్షిని గుడ్క జయిల్కితోలియ్యొచ్చు. పయిసల్కట్టకపోతే, అక్చువల్గ మార్ట్‌గేజ్ సూట్ పయిల్జేస్తే, పర్సన్ మీద లేదు. ప్రాపర్టీ మీద లేదు. ఓన్లీ ప్రాపర్టీ మీదనే ఉంటది. ఇది పర్సన్‌కే ఎఫెక్టయితది పర్సన్ కీ గుడ్క పయిసలియ్యకపోతెనంటే లాకప్‌ల బెట్టొచ్చు. అది కొల్లేట్రల్ సెక్యూర్టీ ఇప్పుడు సూట్ ఫయిల్జేయాలంటే, మార్ట్‌గేజ్ మీదనే జేయాలంటే, పన్నెండు సంవత్సరాలు లిమిటేషన్ ఉంటుంది.ఎప్పుడన్నాజేయొచ్చు. తీసుకున్నపట్నించి పన్నెండు సంవత్సరాలలోపట. మూడేంట్ల లోపట చేస్తరు. ఎందుకంటే ప్రామ్సరీ నోటుంది కనక ప్రామ్సరీ నోట్ లేంది మూడేండ్లే లిమిటేషన్. అందుకంటే పన్నెండేండ్ల లిమిటేషన్‌లో మూడేండ్లలోపటనే ఎయ్యాల. కాని ఏయకపోతే ఏమయితది పన్నెండెండ్లలోపటనే ఏయొచ్చు. ప్రామిసరీ నోటూ ఇన్‌ఫెక్ట్‌యితది. ఇది పష్జేయదు. అప్పుడు మార్ట్‌గేజ్ డీడొక్కటే పష్జేస్తది. ఏంజేసి నా దాన్మీదనే జేస్కోవాల రిన్యూజేస్కోవాల లేదంటవా రొస్కోవాల అట్ల ఇప్పుడు వసూలయితదిగాని మార్ట్‌గేజ్ చేసిందే వసూల్జేస్కోవాల ప్రామిస్రీ నోట్‌కు మస్తుసోర్సెసున్నయ్. వట్టి ప్రామిస్రీ నోటుంటే వ్యాలీడ్‌గుంది లైఫ్ వైడుగుంది. ఎట్లయిన చేస్కోవచ్చు. ఇప్పుడుత్త ప్రామిసరీ నోట్ మీదయితే, డిక్రీ తీస్కున్న తర్వాత, నీకు పర్సన్ మీద ఇష్టముంటే పర్సన్ మీద పోవచ్చు. ప్రాపర్టీ మీద పోవచ్చు. నీ పేరు మీద ఇంకేడయినా ఉంటే అదిగుడ్క ప్రాపర్టీ అటాచ్ చేయొచ్చు. మార్ట్‌గేజెట్లుంటదంటే పర్టిక్యులర్‌గా సర్టెన్ ప్రాపర్టే మార్ట్‌గేజ్ చేస్తమ్. దాని కొరకు వేరెవిదీస్కోనీకే రాదు. పెర్సనేంజేసినామంటే ఒక పెర్సన్ దగ్గర గ్రవుండ్‌నట్ దీస్కున్నం దీస్కుంటే రెగ్యులర్ ట్రాన్సాక్షన్ డిక్రీ అయింది సూట్ అయిత వాళ్ళేంజేసినారు సర్కులెత్కపోయేటప్పుడు రిసీటిస్తరు. మీ దగ్గర పద్సంచు లెత్కపోతున్నాను నీకని ఖరీదు చేసినవని, తీసుకున్నవాని దుకానం పేరు ఆ సంతకం సంచులు రేటు అన్నుంటయన్న మాట. అవేంజేస్తరన్నమాట. దీస్కుని పోయింతర్వాతేం జేస్తారు. మామూల్గ క్రెడిట్ బిల్ తయారు జేస్తరు. జేసిఏంచేస్తరు పదిహేను రోజులయింది. మామూల్గా ఇదిగద క్రెడిట్ మీద నడుస్తది. అదేంలేదు ఇస్తానన్జెప్పి. ఏంచేసినాడు ఇస్తానన్జెప్పి ఏంజెప్పిండు లాస్టకూ ఇన్‌సాల్వెంటుయిండు,

దివాళ్లీసిండు, ఉన్నయి పయిసలు దివాలాదీసిడు ఇన్‌సాల్వెన్సీ పయిసలియ్యనంటడు. లెవ్వు నా వద్ద దానికి ఏడేం చేసిన డంటే, ఇప్పుడు పర్చేజ్ చేసినప్పుడు మార్కెట్ యార్డ్ ఏడ ఉందో మార్కెటోల్లు వస్తరు. మీటింగ్‌య్యేటప్పుడు ఒక షాప్‌ల ఒక వ్యక్తి గొన్నానప్పుడు అమ్మినాయన్నెరు. కొన్నాయనెవరు. వాళ్ళు పేరెంట్రీజేస్కుంటరు. జేస్కుంటే వీళ్ళేంజేసినారు క్రెడిట్ బిల్లు, ఆడిట్ డెలివరీ చేసుకున్న సంచుల రీసీటు, మార్కెట్‌కెల్లొక లెటరు స్థలాన వ్యక్తి పర్చేజ్‌చేసినారని, ఇవిపెట్టి ట్రయ్‌జేసినమ్ కోర్టులో. అయితే వాళ్ళేమని అంటరంట్టే పర్చేజ్ చెయ్యలే యార్డ్‌లో కంటెన్షన్ గదా సూట్ పయిల్జేసినప్పుడు ఎట్లాడినే చేస్తరు. ఎందుకు డినే చేస్తరంటే డినేగుడ్క రెండు రకాలుంటయ్. అన్కి ఇచ్చే వుద్దేశమ్ ఉన్న డినయిల్ చేస్తరు. సంవత్సరమ్ నడుస్తది గద కేసు ఆ తర్వాత ఇయ్యొచ్చులే డిక్రీ అయిన్నాడు అట్ల, ఇంకొక దానికేంచేస్తరంటే ఒప్పుకోని ఇన్‌స్టాల్మెంటడ్గుతరు. అట్ల ఇగేమయితది. మార్కెట్ లయిసెన్సు రిపేటు. మన క్రెడిట్ బిల్ ద్వారా కోర్టు కంక్లూషనేంటని అంటరంటే, సరే అమ్మిన వాడు బిల్ జూపించే ఉంటెనంటే మార్కెటోల్లు తప్పుండదుగద! అని కంక్లూషన్ కొచ్చి సూట్ డిక్రి చేసినరు. థరవాత కోర్టులో పయిసలు ఇ.పి. (ఎక్స్‌క్యూషన్ పిటీషన్ పయిల్చేయకుండగనే) పయిసలిచ్చి కాంప్రమైజయితరు. ఆనికి తెల్సుగద. బాకున్నది వాస్తవమెకట్టేడ్డి వాస్తవమ్ కోర్టుకెల్లి వస్తే జవానొస్తడు. థబ్లీక్‌ల తెల్సిపోతె వేరేల్లు తయారుయితరు. ఈ సూట్ పయిల్జేసింది. ఒక్కడే పర్సన్ అట్ల పది మందికి బాకున్నడు. కోర్టోలొచ్చి జవానొస్తే ఏందయింది అంటే పది మంది గుడ్క వస్తరు. ఒకనికిస్తే సబ్బుయిడయి పోతదిగద! ఇది మనీ సూట్‌కి. ఇగల్యాండ్ డిస్‌ప్యూట్స్ ఉంటయనుకోండ్రి. ల్యాండ్ డిస్‌ప్యూట్ ఎట్ల అంటరంటే, ఒక బవుండ్రి ఉంటది. ఆబవుండ్రీకాడికి నాదని వీడంటడు. అయితే ఇది జర్ర్‌కట్టుకుంటడు ఇది బౌండ్రీస్, వాడంటడు ఈ బౌండ్రీ నీది కాదు. వీళ్ళేంచేస్తరు. కోర్టులో సూట్ థయిల్జేస్తే ఇంజెక్షన్ ఆర్డరిస్తడు. ఈ బౌండ్రి మీదికి ప్రాపర్టీ మీదకి రాగూడదని ఆడిస్‌ప్యూట్ సెటిల్ కావాలని అంటె నంటే సర్వేయర్ వచ్చి కొలుస్తడు నీల్యాండెంత ఉంది. ఆయన ల్యాండెంత ఉంది. సర్వే అప్పుడ రాళ్ళు పాతుతరు. కోర్ట్ డిసిషన్ సర్వేయర్ నిర్ణయ మీద రిపోర్టు మీద కోర్టు డిసషన్ ఇస్తదన్నమాట. నీ కుందా ఆయన కుందా నీకుంటే సరే రావాలని జెప్తరు. క్రిమినల్ మేటరెట్లంటె డీల్ చేసేటియి. అఫెన్స్‌లు అఫెన్స్‌ట్లంటె ఇప్పుడు త్రీసెవెంటీనైనంటారు. ఇది థెఫ్ట పాకెట్‌గానీ.. ఇప్పుడు థోర్ థిఫ్టీ సెవెన్ త్రీ అయిటీ అంటరు. అంటె ఇల్లు బద్దలు కొట్టి లోపటి కొచ్చి ఎత్తక పోతరు. రెండు రకాలు దొంగ తనాలు జర్గేటియి సింపులుగా అవి జరిగేటియి. బస్‌ల ఎక్కుంటె పాకిట్ గొట్టచ్చు. కాని ఇంట్ల జొరబడి

కొట్టేది అది యేరు. ఇప్పుడు రెండు రకాలల్ల ఏంజేస్తరంటే త్రిసెవింటీ నైను సపరేట్‌గ ఒక కేసు, ఒకనిది వేరే వోనిది త్రీఅయిటీ హవుజ్ బ్రేకు తెప్ప అయితే వాళ్ల కోర్టుల చార్జిషీట్ ఫయిల్జేస్తరు. త్రీయెయిటీ ఎట్లంటె త్రీసెవెంటీనైన్ ఏకంగా అవుట్ఆఫ్ డోర్ జర్గుతదన్నమాట. అవుటాఫ్ డోర్ - త్రీసె వెంటీనైన్ తేప్తే ఎట్లెట్ల పాకిట్ గొడ్తడు. పొలాల కాడ ఆయిలింజన్ల విపిక్కపోవడం బయట కరెంట్ బల్బుంటె దీస్కబోవడంగానీ బయటేమున్న వస్తువులుంటే దీస్కపోవడంగానీ ఉంటే త్రీ సెవెంటీనైన్ కింద బుక్ చేస్తరు కేస్లు, అయితే దాని కేందంటే చిన్న కాంప్లెయింట్ల మీద సస్పీషియస్గ ఉంటే బెట్కుంటరు. ఎవర్నీ దొంగలను వారూ ఒప్పుకొనొచ్చు ఒప్పుకోకపోవచ్చు. తర్వాతాల్లు కేసు డిటెక్ట్ చేసి త్రీ సెవెంటీనైన్ ఆదారం అంటె స్పెసిపిగ్గా కోర్ట్‌లో కమిట్ చేయనీకె గుడ్స్ రికవరీ పంచనామా అని ఒకటి జేస్తరు. వస్తువు రికవరీ యేడబెట్నివ్ యెవరికి అమ్మినవ్. యేదైనా నీ వస్తువు దీస్కబోయి యేడ బెట్టినవ్. వాడు ఇట్ల కన్ఫెషన్ ఇట్ల దొంగతనం చేసినదీ వాస్తవమే. అయితే ఫలాన వస్తువు ఫలాన తాన దాపెట్టినాను. అమ్మినాను కర్గిచ్చినాను. మళ్ళి దీస్కోని పోయి జూపిస్తడాడు.

సరే బంగారం గింగారం ఏదన్నా యెత్తే అని తోటి రికవరీ జేస్తరు. మార్వాడీ సేట్‌గానీ కోమటాయన కొన్నాళ్ళు అవుసులోళ్ళుగాని, చేసి, కేస్ బుక్‌చేసి, ఆదార ఏంటి దంటె నెంబర్ వన్ను పొడగొట్టుకున్నోని పిల్సను. అదుండాలె గద యెవరి వస్తువు తర్వాత అయిడెంటిఫికేషన్ జేపిస్తరు. ప్రాపర్టీ వోనర్ను దొల్కపోయి, ఈ వస్తువు మీదేనా అని, సరే రెండోది మూడోది కన్ఫెషను రికార్డు కోర్టుల యాదాడ ఉండెనంటే కోర్టులో కంక్లూషన్ కొచ్చింది జర్గింది. దొంగతనం చేసినాడు ఈడు అని పర్సన్నుబట్టి ఫస్ట్ అపెండర్ అయిండు. ఇన్నోసెంటున్నడు చెయ్యాలని చెయ్యలే ఏదో పొద్దులంతోటి చేసినాడంటె, బాండ్ దీస్కోనిడ్స బెడ్తరు. బవిషత్‌ల మంచిగుండాలన్జెప్పి ఇడ్సిపెడ్తరు. తర్వాత హాబిట్యువల్ అఫెండర్ అంటెనంటె కన్విక్షన్. జయిల్కు సెంటెన్స్... త్రీ అయిటీన్ కోపం మీన కొట్టొచ్చు కావాల్సుకొని కొట్టొచ్చు. అప్పుడు దానికేమయితదంటే కాన్ఫిడెన్స్‌లోకి దీస్కుంటరు. స్పెసిఫిక్గా పేరుంటది గద! అన్ని రెస్టు జేస్తరు... త్రీట్వెంటీ ఫోర్, త్రీథర్టీ సెవెన్ అంటే నెత్తికి దెబ్బతగుల్తే అది డాక్టర్ సర్టిఫికేట్ మీద ఆదారపడ్తది. ఇది సింపులంటే త్రీ ట్వెంటీ ఫోర్కిందొస్తది. బుక్ చేస్తరు. గొడ్డల్తోటిగాని ఫ్రాక్చరయితది. ఇంజురయితదనుకో గ్రీవియస్ సంటరనిస్తరు. గ్రీవియసు అంటారని అంటె, ఒక వేళ డయిడాయని సూట్స్ ఉంటయి. గ్రీవియస్ సాక్ష్యే అని సర్టిపికెటిస్తరు. కోర్ట్ కంక్లూజన్కు వొస్తే గిట్ల రెండే ఆధారాలు దాంట్ల. కొట్టి దెబ్బలు దిన్నోడు చూసోడు చూసోడు. సార్ కొట్టాలని చూస్న నిజమే ఫలానోడు

కొట్టినాడు పలానోడు కొట్టైతోటి దెబ్బతల్గింది. వాడు అంత వరకే చెప్తడు. డ్యాక్టరేం సర్టిఫికేటిస్తడంటే చెయ్యిఇర్గినాది. ఇర్గుతే ఏంటిదంటే బ్లంటాబ్జెక్టు ఏదన్నా ఉంటె త ల్గుతదట అని సర్టిఫికేట్ ఇస్తే కట్టెగావచ్చు ఇన్పరాడ్‌గావచ్చు ఏదేగావచ్చు. సాక్ష్యంల ఏంజెప్తడు కట్టె తోటి గొట్టి నాడు అన్చెప్తడు గద, కోర్టు కంక్లూషన్‌కొస్తే వాడికి శిక్ష భారీగ పడ్తదన్నమాట. ఉంటదన్నమాట. రెండ్నెలు, మూడ్నెల్లు, అయిద్నెల్లు, ఆర్నెల్లు వరకుసెన్సిటివ్ ఆబ్జెక్టయితే గుడ్క వన్నియర్ జుల్మానా గూడా ఏయొచ్చు. వన్నియరో సిక్స్‌మంత్సో అయింది. వీడేం చేసినాడు గవర్నమెంటు జీపన్నమాట. ప్రయివేటో గవర్మంటో జీపు మొత్తమ్మీద 14 మందినెక్కిచ్చుకున్నడు. పోతావుంటె మన అప్పన్నపేట దగ్గరడవునుంది. అక్కడికెల్లిడవునుంది. ఇక్కడి కెల్లి అప్పయితది అనుకోండి. జీప్ పోతున్నది లెఫ్ట్ సయిడే అవతలికెల్లి లారీ వస్తున్నది. ఆంధ్ర ఏర్యది కర్ణాటకది. వాడు స్పీడ్‌గవచ్చినడన్నమాట బ్రేక్ లేవు. ఫెయిలయి పోయింది. అయితేడవునున్నది గద. బ్రేక్ సినపడదది. ఆడేమి జేసినాడు. తెల్లవాల్ల కూచోని రయిట్సయిడ్ కట్ చేసినాడు. జీప్ మటుకు లెఫ్ట్ సయిడుంది కదా! అయితే లారొచ్చి ఆస్కారమే లేదు. కనీసం రయిటుకు గోస్కుందామన్నగాని లారోచ్చి జీప్ మీద ఎక్కేసినాదది పూరా. పూరా ఎక్కేసి పోయి దాటింది. ఎట్లా అంటే మొత్తం పద్నాల్గు మంది జచ్చిపోయింద్రు. ఒక్కడు మట్కెల్లు బత్కినడంటె జీపొచ్చి గుద్దినప్పుడు ఎన్క ట్రాలి ఉన్నది. ట్రాలీల గూర్చొని ఉన్నడు. ట్రాలీ ఎగిరవతల బడిండు. వాన్ని మటుకు దెబ్బల్తగిలినయి పద్నాల్గు మంది దాన్లోక అర్వైమంది టీచర్స్ మహబూబ్‌నగర్ల వోల్లు. ఈడున్నేసి పోతరు సాయంత్రం లారీ వాడు తప్పేంలేదు. జీపు వాడు తప్పేంలేదు. అదిఫుల్లుడవున్న ఉంది. జీరోలపెట్న హండ్రెడ్ బోతదది. అంతడవునుంది. ఆస్పీడ్ల బ్రేక్ పెయిలయింది. కంట్రోల్ చెయనీకెవిల్గాదు. స్పీడ్ గుడ్క తిర్గదు బ్రేక్ పెయిలయితే సామాన్యంగా కష్టంగా ఆనికి అయిడియాదొర్కుండదు. ఇప్పుడు నెగ్లి జెన్స్ ఆఫ్ డ్యూటీ అని వాడిమీదనే ఉంటదను కోండి. లారీ వోని మీదనే ఉండదు. ఎందుకని అంటెనంటె. బ్రేక్ఫెయిలయిందని అంటే ఆనిలుకవుటే సూస్కోవాలి. చేస్కోవాలి. కేసు నడుస్తుంది గుడ్క. ఆ పద్నాల్గు మందికి కాంపెన్షేన్ పద్నాల్గు మంది. గవర్మెమెంట్ కెల్లి రావాలంటె నంటే ఇన్సురెన్స్ కంపెనీ మీద పయిల్జేస్తరు. తర్డ్ పార్టీ ఇన్యూరెన్సు ఉంటదిగద! ఓనర్ ఇన్సూరెన్సు పాలసీచేస్తం. అంటె డబ్బులు ఇన్సూరెన్స్ కంపెనీ ఇస్తది. వీల్లకు. ఒక వేళ ఆర్టీసి బస్సు అయితే కార్పొరేషన్ కట్టేస్తది.

# వ్యవహార ఖండిక - 2

| | | | |
|---|---|---|---|
| కేంద్రం | : ఆత్మకూర్ | విద్య | : జి.సి. ఐ.ఎమ్. |
| వృత్తి | : డ్యాక్టర్ | కులం | : గౌడ |
| వయస్సు | : 55 సం. | లింగం | : పురుషుడు |

అప్పుడు ఆత్మకూరులో ఒక కాన్పు కేసు దాదాపు రెండు రోజుల్నించి నెప్పులొచ్చి కాన్పుకాలేదు. అప్పుడు స్థానికంగా ఉన్న మెడికలాఫీసర్ మిగత వాళ్ళు కూడాను ప్రయత్నంచేశారు. వాళ్ళ ప్రయత్నం ద్వారా కాన్పు కాలేదు. ఇప్పుడు నేను చేతిలో సిరెంజ్ లేదు మందులు లేవు తరవాత ఆయుధాలు లేవు. అప్పుడు ఆ కాన్పుకేసును ఒక మిడ్ వైఫ్ దగ్గర ఉన్నఫార్సెప్స్ తీసుకొని కాన్పు చేయాల్సి వచ్చింది. ఆకాన్పు కేసు సక్సెస్ అయింతర్వాత మళ్ళీ ఇక్కడ తల్లీ బిడ్డ బత్కినయి. రెండు గూడ. ఆ తర్వాత ఆ కాన్పుకేసులో దాదాపుగా రెండు మూడు వందల మంది ఇంటి వైపునే ఉన్నరన్నమాట. అద్వర్దాక ఏడ్చేస్తున్నమాట. భగవంతుని దయవల్ల ఆ రెండు గూడాను సక్సెస్ కావడానికి భగవంతుడే కారకుడూ. నా ప్రయత్నం స్ప్లిట్ సెకండ్ డిసిషెన్ చేసిందానికి నాకు ఆరోజు నుంచి గూడాను మంచి పేరు ఖ్యాతీ వచ్చినయ్. ఆ సంఘటన నాకు మరపురానిది, భగవంతుని దయవల్ల అదేరోజు నేను మదురై మున్సిపాలిటీ నాకు కాలొచ్చింది. అది మానుకొని నేను ఇక్కడనే ఉండి పోయాను. తరవాత కొర్ది నెలలకు ఇక్కడనే ప్రయివేట్ ప్రాక్టీస్ చేసి, సెటిలయిన. నిన్న పదారగస్టు ఎనబై అయిదుకు ఇర్వై ఏళ్ళు నిండి ఇర్వై ఏళ్ల వార్షికోత్సవం జర్పుకున్న. ఇది మరపురాని సంఘటన మేం ఎప్పుడూ హవనమూ పూజ జేస్తాము. మొట్టమొదట సరస్వతి. క్లినిక్ నర్సింగ్ హోమున్నది. ఆ క్లినిక్‌ను పూర్తిగా శుభ్ర పరిచి, రంగును సున్నం అదీ ఏసి, అంతా గూడాను ఏదైతే ఒక్క సంవత్సరానికి దాదాపుగా లోపల ఉన్న కచరాగిచరా అంతా దీసేసి శుభ్రపరిచి, సంవత్సరానికి మేము ఉదయం నుంచే అదంతానుపచ్చతోరణాలు ఆకులూ పూలూ, సాయంకాలం హవనం చేస్తం. మేమంతా కుంటుంబ సభ్యులుగా నా కుమారుడు కూడా మూడు సంవత్సరాల నుంచీ, హయిద్రాబాదు ఏ బియె ఎమ్మెస్ పాసయి నాతోనే ప్రాక్టీస్ చేస్తున్నారు. మేమంతా కూర్చొని కుటుంబ సభ్యులు స్నేహితులు తండ్రులు బందువులు పేషెంట్లు కూచోని యజ్ఞం చేస్తం. ఆ తరవాత సనాతన ధర్మం ప్రకారం మనం పూజా చేసి వచ్చిన బంధువుల కందర్కి గూడాను తేనీటి విందు ఏర్పాటు చేస్తం. అది వార్షికోత్సవం చేస్తం తర్వాత ఇల్యూమినేషన్ గూడ చేస్తం. హవనం అంటే యజ్ఞం.

నేను కర్నూల్లో చదుకున్నాను. కర్నూలు మద్రాసు యునివర్సిటీ కోర్సు. మాది నైజాం స్టేటప్పుడు. ఇక్కడ పాసయింతర్వాత ఇంటర్మీడియట్టు విత్ సయిన్స్. మాకు కర్నూలులో ఉన్నట్టు నేటివిటీ దొర్కలేదు కనక మద్రాసు ఎమ్‌బిబియెస్ లో ప్రవేశం దొర్కలేదు. ఇక్కడ గూడాను యెమ్బిబీసియ్యేస్‌కు అప్లయి చేసినాను. చేస్తే అప్పుడు దీన్నంతా మద్రాసు యూనివర్సిటీ ఉంది ఈ చద్వెందంతా మద్రాసు యునివర్సిటీలో కేవలం నేటివ్ ఆఫ్ నిజామ్ స్టేట్ అనీ అప్పుడు గూడా ఇవ్వలేదు. ఆ మరస సంవత్సరమ్ గ్రాడ్యుయేట్ ఆఫ్ కాలేజ్ ఆఫ్ ఇంటిగ్రేటెడ్ మెడిసన్‌లో అంటే మన దేశీయ వైద్యమూ దానికి తోడుగా పాశ్చాత్య వైద్యమూ - మాడ్రన్ మెడిసెన్ రెండూ కలిపి సమన్వయం గవర్నమెంట్ కాలేజ్ ఆఫ్ ఇంటిగ్రేటెడ్ మెడిసెన్ అని మన విదేశీయ వైద్యము. అయిదు సంవత్సరాల కోర్సు అందులో దేశీయం ఆధునికం ఉంటుంది. అక్కడ పాసయి వచ్చింతర్వాత నేను అనంతపూర్‌లో హవుస్సర్జెన్సీ చేసిన తరవాత **1958** అగస్టు **16** నాడు ఆత్మకూరులో స్థాపించాను నా దవాఖానా. డిస్టిక్ హెడ్క్వార్టర్స్‌లో పన్చేసేటప్పుడు .......... అని ఉండె రిటయిర్డ్ మిలిటరీ సర్జెన్ ఉండె వారి అను శాసన యుక్తమయిన అడ్మినిస్ట్రేషన్‌లోను దాదాపు ప్రతి నిత్యం కూడా అవకాశాలు చేసుకోవాల్సి వస్తుంది. కన్క చిల్డ్రన్స్, ఆబ్ స్ట్రాటిక్స్ ఎండ్ గైనకాలజీ, తర్వాత సర్జరీ ఇవన్నీ కూడా అవకాశాలు రాత్రింబవళ్ళు గూడా కష్టపడితే సంవత్సరం పాటు మేం పనిచేశాం. ఆపర్చునిటీ తీస్కున్నాం. యువకులుగా ఉన్నాం కనక ఆ విధంగా కృషి చేసిన దాని మూలంగా ఇక్కడి కొచ్చిన తర్వాత ఆ కృషి ఫలితమే ఆ కష్టాలను గూడా ఏ విధంగా ఎదుర్కోవాలి ఎంత కఠినమైన కేసు వచ్చినా గాని ఏ విధంగా చేయాలి మనం. మొట్టమొదట ఆత్మీయత, రోగిని గురించి హృదయంలో ప్రేమ సద్భావన. తర్వాత మొట్టమొదలు యోగ్యత, తర్వాత ఈ పేషంటు గురించి అతని శక్తికి ఎంత వీలుంటుందో ఆ విధంగానే ఫీస వసూల్చేయడం ఫీసిచ్చేప్పుడు గూడాను ఏదో వాళ్ళకు బాదాకరంగా ఉండకుండా సాధ్యమయినంత వరకు ఏ విధంగా తను ఉంటడో ఆ విదంగానే పరిమితి పెడుతూ మొట్టమొదట పేషంట్ బాగ్గావాల. ఎంత ఖర్చయినా సరే, ఎన్నిమందులయినా సరే ఒక పేషెంట్‌పే చేస్తాడు ఒక పేషెంట్‌పే చేయలేక పోతాడు, ఆ విధంగా మనం ఈ విధంగా మనం ప్రాక్టీస్ నడిపిస్తే, ప్రజల ప్రేమ సహకారం వాళ్ళనుంచి మనకు చాలా చక్కటి ప్రోత్సాహం దొరుకుతుందని నా అనుభవం మీద నేను చెప్తున్నాను. పెద్దగా సంపాదించలేక పోయినా తృప్తి మాత్రం ఉన్నది. ప్రజలకు సేవ చేసిందాంలో దానికి మనకు దానించి ప్రజల చాలా చక్కటి ప్రేమముంటుందని గ్రహించాను.

**1953** లో నేను మద్రాసులో చదుకునేటప్పుడు నేను రెండోసంవత్సరం పాసయి మూడో సంవత్సరం వచ్చాను. క్లీనికల్ సయిడ్ అప్పుడే అదే సంవత్సరం ఆంధ్రా ప్రాంతంలో తీవ్ర వరదల వ్లల అక్కడ బీభత్సం జరిగి తూర్పు గోదావరి కొంత భాగం జలమయం అయిపోయి అనేక బాధలకు గురయిందన్నమాట, కలరా జెరాలు ఈ విధంగా ఉన్నప్పుడు కొంత మంది, మా కాలేజీ విద్యార్థులం ఒక సోషల్ సర్వీస్ చేయాలని, మేము అనుకొని తొమ్మిది మందిమి స్వతహాగా ఖర్చులు భరిస్తూ, రాజమండ్రి వెళ్ళాం. అక్కడ వెళ్ళింతర్వాత రామకృష్ణ మిషన్ హవుస్ వాళ్ళు మాకు కావల్సిన మందులు ఆహారం నీళ్లు కల్పిస్తూ రాజమండ్రి మున్సిపాల్టీ ద్వారా వాళ్ళు మాకు సైకిల్స్ ఏర్పాటు చేశారు. కొత్తగా అసలు ట్రీట్మెంట్ ఎట్లా చేయాలో తెలియదు. ఎనాటమీ ఫిజ్యాలజీ పాసయినం మేం, మేంగూడ వ్యాక్సినేషన్ తీస్కోనేలేదంత వరకూ కాని సరే ఈ బీభత్సంలో చాలా మంది ప్రాణాలు పోతున్నాయి. ట్రీట్ చేయాలి అనుభవం కూడా వస్తుందని నేను నా మిత్రుడు, మిగతా వాళ్ళు సీన్యర్స్‌తో కల్సి వెళ్ళాం. అక్కణ్నించి వర్షం ఎక్కడ చూసినా నీళ్ళ మయమే. అప్పుడప్పుడు నీళ్ళు తగ్గుతున్నాయి. మమ్మల్ని విపరీతమైన వర్షం ఉన్న కండిషన్లో తీస్కెళ్ళి ఇంటీరియర్లో తీస్కెళ్ళారన్నమాట. గోపారం అన్న గ్రామం దగ్గర రాత్రి పూట పన్నెండు గంటలకు పోయినప్పుడు ఆవూళ్ళో ఒక పెద్దమన్షి వాళ్ళింట్లో మేముండడం... వారా రాత్రి పూట మాకు వేడి వేడి కాఫీ దుస్తులు పడుకోడానికి ఇచ్చి ఉదయం పూటనే చూస్తే ఆ వూళ్ళ కాల్రా ఎంత విపరీతంగా ఉందంటే, మనం ఏ ఇంట్కైనా ఇంజెక్షన్ ఇనాక్యులేషన్ ఇవ్వడానికి వెళ్తే, వాళ్ళు తలుపు లేస్కునే వాళ్ళు పారిపోయే వాళ్ళు అన్నమాట... ఆ ఇంజెక్షన్లంటే వాళ్ళు ఇదేదోమారెమ్మనో ఏదో దయ్యం పట్టింది రాత్రంతా గూడా ఏదో చప్పుడు చేస్తుండే వాళ్ళు, ఏ ఇంట్లో కల్రా ఉంటే ఆ ఇంట్లో చప్పుడు చేస్తుండే వాళ్ళు. ఇంట్లో ఇదుంటది గదా! ఏదైనా భోజనం చేసే కంచం ఏదన్నా ఉంటే చప్పుడు చేస్తుంటరు. రాత్రంతా అరుస్తుంటరు. ఉదయం పూట ఇన్‌ఫెక్షన్ వచ్చినా అట్లనే ఉంటరు. మల్ల్ గూడా అట్లనే ఉంటరు. ఈ విధంగా వాళ్ళ పాతకాలం భావమే. కాని ఊళ్ళు పెద్ద వాళ్ళందరూ సహకరిస్తూ అందర్నీ గూడా మా వెంట వచ్చి ఇనాక్యులేషన్స్ తీయించుకొని తర్వాత ట్రీట్మెంట్ అయిన వాళ్ళను ఒక స్కూల్లో చేర్చి వాళ్ళకు సలైన్ సెట్స్ అందరికీ గూడాను చేశ్నాం. తర్వాత ఆ రోజు సాయంకాలం ఎవరికయితే ఇచ్చామో రాత్రికి ఒకరికి పక్షవాతం వచ్చింది. వాళ్ళు రాత్రంతా అనుకున్నారు. వీరు నిన్ననే ఇంజక్షనిచ్చారు. ఇంజక్షన్ ద్వారానే పక్షవాతం వచ్చింది. అని ఉదయం నలభైయాభై మంది ఆందోళన పడి మా మీద దాడి చేయడానికి వచ్చారు. తరవాత మేం వెళ్ళిచూసి చెప్పాము. ఆయన వయస్సు దాదాపు 75 సంవత్సరాలు ఉంది.

ఆ చుట్టు పక్కల గూడా కాల్రా ఉన్నందుకు ఇయ్యాల్సి వచ్చింది. కాని ఈనెకు ఏదయితే పక్షపాతం వచ్చిందో దాన్ని నేనిచ్చిన వాక్సినేషన్ నుంచి రాలేదు. ఆయనకు ఈ విధంగా వచ్చేదే ఉండింది. అని వాళ్ళకు గూడ మేం చెప్పింది కన్విన్స్ అయ్యారు. తర్వాత మాకు మంచి మర్యాద దొర్కింది. అక్కన్నుంచి ఏజెన్సీ ప్రాంతం కొత్తపల్లి. చెంచువాళ్ళు సంత. వాళ్ళందరూ కూడాను అక్కడ క్యాంప్ వేసి అందర్కి వాక్సినేషన్ ఇవ్వడం జరిగింది. మందులు, గోలీలు ఇవ్వడం ఈ విధంగా అనుభవం ద్వారా తెల్సిందే మంటే, మేమే సత్రంలయితే ఉంటున్నాయో దూరదూర ప్రాంతాల్నుంచి కూడాను అక్కడికి రోగులు రావడం వచ్చి రాత్రిపూట మమ్మల్ని లేపడం వాళ్ళు ఇంజక్షన్లు తీసుకోవడం గోలీలు తీస్కోవడం ఈ అనుభవం ద్వారా సమాజ సేవలు మన ప్రాణాలు గూడా మనం అయితే దాన్ని అడ్డుపెట్టి పనిచేస్తే తృప్తుంటుందని, ఆనందం ఉంటుందని మాకు తెల్సింది. ఇదంతానేము గవర్నమెంట్ సప్లయి ఆహారమేము రామకృష్ణ మిషన్ రాను పోను వ్యవస్త అంతానూ మెడికల్ డిపార్ట్‌మెంట్ చేసినారు. ఇక ఇది అనుభవం మరపురానిది. అక్కడ తొమ్మిది పదిరోజులున్నాము. తర్వాత కంట్రోల్ అయింది. ప్రభుత్వంనుంచి కూడాను సాయం వచ్చేసింది వాళ్ళు గూడా వచ్చేశారు. అందరు గూడా వచ్చేశారు. అది మేము గ్రాడ్యుయేట్ కాలేజ్ ఆఫ ఇంటిగ్రేటడ్ మెడిసెన్ తొమ్మిది మందిమీ బ్యాచే చేసింది. దీని తరవాత మద్రాసులో మా కాలేజ్‌లో వార్షికోత్సవ సందర్భంలో గవర్నర్........... వారు మాకు సర్టిపికేట్స్ ఇచ్చారు. తరవాత ఈ సేవా కార్యక్రమాన్ని వారు మెచ్చుకున్నారు కొనియాడారు. ఆరు సంవత్సరాలు డాక్టర్ ................ డీన్ మాద్రాసు మెడికల్ కాలేజ్‌కు మొట్టమొదటి భారతీయుడన్నమాట అంతకుముందు అంతా ఆంగ్లేయులుండేవారు. అతను ఫస్టు ప్రిన్సిపాల్ వారు మాకాలేజీ డీన్ ..........రని ప్రిన్సిపాల్. రైల్లో పోయింటిమి. రైల్లో మద్రాసు కొచ్చాం ఆ కాలేజ్‌లో మళ్ళీ థర్డ్ ఇయర్ కోర్స్ చేశాం. ఆ సంఘటన మరపురానిది.

మా అన్నయ్య మద్రాసు యునివర్సిటీలో టెంత్ వరకు చద్వాడు. వ్యవసాయం చూస్తాడు ఎక్సయిజ్ కాంట్రాక్ట్ చూస్తాడు. రెండవ వాడు నేను ఇక్కడ్నే ప్రయివేట్ ప్రాక్టీస్. మా తర్వాత తమ్ముడు ఎమ్.డీ, సివిల్ సర్జన్ ర్యాంక్‌లో ప్రమోషన్‌లో ఉన్నాడు. గజ్వేల్‌లో చివరి వాడు డబుల్ గ్రాడ్యుయేట్ అతను ఊర్లోనే ఉండి వ్యవసాయం చేస్తూ ఎక్సయిజ్ కాంట్రాక్ట్ చేస్తూంటాడు. పొలం నల్గురికి కల్సి రెండ్వందలెకరాలుండింది. అందులో దాదాపు నూట ఎనబై ఎకరాలు మెట్ట మిగతా ఇర్వై ఎకరాలు తరి ఉంది. రెండు సంవత్సరాల క్రితమే పంచుకున్నాం ఎవరి వ్యవసాయం వారిదే. కాని అందరం కలిసే ఉంటం ముగ్గురు కల్సే ఉంటం పెద్దాయన మాత్రం వేరేనే. దాదాపు ఇర్వై

సంవత్సరాలయింది. పక్కన ఇందిర్యాల అనే గ్రామంలో మెట్టపైరులో ఇక్కడి వ్యవసాయం నష్టదాయకమే. కేవలం మన చేతికింద పనిచేసే వాళ్ళకు సంవత్సరానికి ఇవ్వగలిగే జీతం మాత్రం ఇవ్వగల్గుతం కానీ లాబ దాయకం మాత్రం కానేకాదు. తరవాత సామాన్య రైతుకు మా ప్రాంతంలో మా తాలూకాలో మా జిల్లాలో ఏ మాత్రం లాబదాయకం కాదు. మేంచేసే పద్ధతుల్లో ఏమాత్రం లాబదాయకం కాదు కష్టతరం అంతా వాళ్ళు ఆ భూములను ఏంపండుతుంది. ఈక్రాప్స్ సరయినవి కావు సరయిందేనా కాదా? కాకుంటే వాటినుంచి పండుతుంటే సాయిల్ టెస్టింగ్ అదీ సక్రమంగా చేసి, దానికి ఏ విధంగా విత్తనాలు వేయాలి. ఎటువంటి పంట పండించాలి అటువంటిది ఒకరి సెర్చి స్కేలులో చేస్తేనే గానీ, ఇక్కడ సాధ్యంలేదు అందుకే ఇక్కడ రైతులు, చాలా పేద పరిస్థితుల్లో ఉన్నారు. వారికి ఈ వ్యవసాయం ఏది లాభాదాయకం కాదు. ఒకటి భూమిని ఏ విధంగా ఏ పంటలు వేయాలో మార్పు జేయించాలో తెలియదు. తరవాత వచ్చిందాన్ని గూడాను మార్కెట్‌లో బెట్టె సరయిన ధర లేకుండా, వాళ్ళు చాలా బీద స్థితిలో వున్నారు. అన్నింటికన్నా ఎక్వ ఈ సమాజంలో మనం నష్టపోతున్నది దేశంలో. దేశానికి **85%** వ్యవసాయ దారులే వున్నా వీళ్ళల్లో సంఘటితంగా ఆలోచన చేసి సంఘటితంగా అనుకున్నదాన్ని చేసేట్లు శక్తి లేని వల్ల అన్ని ఇబ్బందులు గూడా వ్యవసాయ రంగానికే ఎదురవుతొంది. అదే నేను చూస్తున్నా అనుభవిస్తున్న మాకు వరి పండుతుంది. వేరుశెనగ పండుతుంది. జొన్నలు ఒక ఎకరాకు రెండు సంచులు బండితే చాలా ఎక్వ. చాలా గొప్ప. సజ్జలు నువ్వులు కొంత వరకు ఆముదాలు, మినప కంది బేడలు వేస్తాము. పంట గూడ చాలా తక్కువ. పంట నూటిలో **25%** పండితే గొప్ప అనుకొండి. దాంట్లో రిసర్చి చేసి వ్యవసాయ దారుడిని ఆదుకోవడం చాలా అవసరం బహుశా మేం ఏసే పంట లేదయితే వున్నాయో అవి సరిపోకవచ్చు. కాని మార్పిడి వల్ల వారికి లాబదాయకంగా వుండొచ్చు అది గమనిస్తే బాగుంటుంది.

ఆత్మకూరు తాలూకా నాలుగువయిపులా నీళ్ళున్నాయి. దక్షిణాదిన కృష్ణ ఉత్తరాన రెండు పెద్ద వాగులన్నాయి. ఇక్కడ ఆత్మకూరుకు రావడానికి సౌకర్యం కేవలం రైలు మార్గమే. ఈ మధ్య చిన్న చిన్నగా రోడ్డ్వేవ్స్ కట్టిం తర్వాత బస్సులు రాగల్గుతున్నయ్. ఈ వూరు పెద్దగా డెవ్‌లప్ కాలేదు. జూరాల ప్రాజెక్టు ఏదయితే వచ్చిందో ఎడమవైపు కెనాల్ ఏదయితే ఉందో ఆ నీళ్ళు ఏ మాత్రం ఆత్మకూరు తాలూకాకు ఉపయోగ పడవు. ఒక పిడికిలి నీళ్లు కూడాను ఇక్కడ ఉపయోగపడవు. కేవలం ఆ కెనాల్ మాత్రమే ఇక్కడొచ్చి ఇక్కడ ఒక కామన్ ఫ్లెక్ట్ డ్యామ్‌లో పడతాయి. ఇక్కడొకరిజర్వాయరుంటుంది. డ్యామ్ తరవాత కిందవున్న తాలూకాలకు పోతాయి. ఆత్మకూరుకు మాత్రం ఇటువైపున్నా ఏ మాత్రం కూడాను లాభదాయకంగా లేదు.

అది ఎప్పుడైతే ఈ డ్యామ్ స్వరూపం రూపురేఖలు దిద్దిందో అప్పుడు ఈ సమగ్రమైన ఆలోచన అందరికి గూడాను అనుకూలంగా వున్నటువంటి పద్ధతిలో చేయకుండా ఏదో రాజకీయంగా వున్నవాళ్ళు ఈ 38 సంవత్సరాల్లో జరిగిన వాళ్ళ విధానాల పట్ల ఎవరికీ పవర్‌లో వుంటే వాళ్ళే లాబం పొందినారు. దేశానికి లాభం పొందేటువంటి ప్రయత్నం చేయలేదు. ప్రక్కననే పోతున్నగానీ దోసెడు నీళ్ళు గూడాన్ను ఈ వూరికి రావడం లేదు. తాలూకాకు రాలేదు. ఇక్కడ మంచి గ్రామాలు కూడను మున్గి పోతున్నాయి. కాని గ్రామాలు మునిగి పోయినా దేశం బాగుపడుతుందంటే , మనం సంతోషించాల్సిందే. ఇంకా కాస్త దూరంలోచన జేసుంటే మిగతా వాళ్ళతో కన్సల్ట్‌చేసుంటే ఇక్కడ గూడానూ ఈ తాలూకాలో బెనిఫిట్సయ్యేది అదిప్పుడు లాభం లేదు. ఎవరు కృష్ణమ్మను పక్కన దాటాలి అంటే ఒక వేళ ఇప్పుడు పోవాలంటే 45 మైళ్ళకిందికి పోయి అక్కడ రంగాపూరు దాటి పోవాల్సి వస్తుంది. అక్కడ పోవడానికి కూడా మధ్య రెండు వాగులున్నాయి. పెద్ద వాగులు. ఇప్పుడిప్పుడే పెద్దవాగుపయిన గూడాను. వంతెన అవుతుంది. రెండు సంవత్సరాలలో పూర్తవుతుంది. రయిలే. రయిలుబండ్లు మొన్నమొన్న 10-15 సంవత్సరాల వరకు ఏ సౌకర్యం లేదు...

# వ్యవహార ఖండిక – 3

కేంద్రం : గద్వాల్ విద్య : బి.ఎ. ఫైన్ ఆర్ట్స్

వృత్తి : టీచర్ కులం : తెలగ

వయస్సు : 28 సం. లింగం : పురుషుడు

నేను సేద్యం జేస్తుంటిని, చిన్నప్పట్నించి చదుకుంటుంటి గోల్లాటలాడుతుంటిని, గోలాట, బొంగ్రాలాట, జిల్ల గోడిలాట ఆడుకుంట ఉంటిమి అంటే నాకు ఇంట్రెస్టు ఆట అంటే ఎక్కువ్గుమ్. ఇష్టమంటే గోలికాయలాటాడేది. సద్వేది తక్వ. అన్ని తెచ్చేది లేదు. ఏం తెచ్చేది లేదు. ఓ బట్వాడా బయటికి బోయేది వచ్చేది తినేది పండుకునేది మల్ల సేని చూసేటానికి బోయేది తాగుడుండేది, చెయిన్లనుంచి ఇంటికి వచ్చేది. తర్వాత ఇట్ల చదుకుంట అట్ల చదుకుంటచేసి పాసయి పోయేది. పాసయింతర్వాత ఇంటర్మీడియట్ కు గద్వాలజేరిన . గద్వాల తలనొప్పి చాలా స్ట్రిక్టుండె వచ్చేసరికి ఫైయిలయితి. మల్ల సంవత్సరమ్ గట్కోని పాసయిన. ఎన్ని సబ్జెక్టుల ఫైయిలయిన బాయికాట్ జేసినమ్ ఒకసారి ఒక పేపరు బాయ్‌కాట్ జేసినమన్నమాట. ఎందుకనంటే స్ట్రిక్టు ఎగ్జామ్ చానా కష్టమనీ మేమేదో ఇంటర్‌లో కాపిజర్గుచ్చని, మాగ్గాడ కాపి జర్గుతదని రిలాక్షన్ చేస్తిమి. తర్వాత వెళ్లొస్తిమి. మొత్తం బాయ్‌కాటే యెవ్వరు గూడ్రాలె కాలేజ్ కాలేజ్ బాయ్‌కాటే ఇప్పుడు చాలా మందిమి బోయినం కంపార్ట్‌మెంట్ గట్టుకొని పాసయినం. అయింతర్వాత నావుద్దేశం ఏమంటే ఈ బియ్యీడీ చేస్తే బాగలేదు. అందులో రెగులర్ జద్వడం నా కిష్టం లేదు. కాలేజీల ఏదో పన్జేస్కుంట ఉండి, ఏదన్నాడ్రయింగూ టైప్ రైటింగ్ నేర్చుకొని ప్రయివేట్‌గ ఉండి ఇచ్చుకొని, ఏదో బియె ప్రయివేటుగ ఇచ్చుకోని కష్టపడి పార్ట్వన్ పాసయిన. పార్ట్ సెకండు పొలిటికల్ సయిన్స్ తోటి పాసయిన.మాండర్న్‌లాంగ్వేజ్ పాస్‌గాలేదు. తర్వాత పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ గూడా పోయినాను. అదే లోపల వుద్యోగం దొర్కదను కోనిపోయిన దొర్కదను కోని చిన్న బిజ్నెస్ స్టార్ట్ జేస్న. మిర్పపాడి దెర్మకోలంటే మాయింట్ల మిషనుండె. ఇంట్ల మిషన్ తోని మా చిన్నాన్న గార్తోని కలసి స్టార్ట్ చేసిన సొంతం తెచ్చి, బిజ్నెస్ స్టాట్‌జేసి, సొంతం స్క్రీన్ ప్రింటింగ్ అని, ఆ తర్వాత కొట్టిచ్చుకొచ్చిన హయిద్రాబాదు నుంచి సొంతం

ఆర్టేస్కున్న నేనె. చిన్న డ్రాయింగ్ ఏస్కోడని, వంశీ ఆర్ట్ ప్రింటర్స్ దగ్గర ప్రింట్ జేయించిన ఒకటొకటి ఇర్వయి, ఇర్వయి పైసలు చొప్పున బడ్తది కవర్ ప్లాస్టిక్ అవీ అయితేనేమొ అయిదు పయిసలే బడ్తది. అయిదు పయిసలూ పావలా ముప్పయి పయిసలయింతర్వాత కిలోకి పది పేపర్లయితే పది పయిసల, పదిపావలాలు కలిసి నాల్నర పోంగ లాబం రెండ్నర మిగిలిన లాబం చూస్కోని ప్లాస్టి కార్డు చేసినందుకు రెండు కార్డులు పడ్తుండె రెంద్రూపాయల్ చార్జి పడ్తుండె. నాల్నర రెండ్నర లాబం పోను మిగిలిన లాబం చేసి అమ్తుంటిమన్నమాట. చేస్తుంటిమి డియివో ఆఫీస్లలోపట . అదికారెంపాడి. పాకెట్స్ సప్లయి జేస్తుంటిమి. మంచిగనేరన్నాయె. రన్నయినంతనె ఉద్యోగంది. కొంచెం అడ్జస్ట్ అయినది. డియివో ఆఫీస్ నుంచి కండక్ట్ చేస్నరు. డియివో పేపర్ ప్రకటన జేసిరి. అప్లయి జేస్నమ్. అదయింతర్వాత ఓరల్ టెస్టూ, రిటెన్‌టెస్టూ అయింతర్వాత అలంపూర్‌కు అపాయింట్‌మెంట్ అయినం. ఈ బిజ్నెస్ మీదింట్రెస్ట్ పుట్టలే. నే చిన్నప్పట్నించి నేను సయిన్స్ దాంట్ల మంచి మంచి బొమ్మలు ఏస్తుంటి . కార్బన్ డయాక్సైడ్ గాని, కప్పలు గానీ, అమీబాగానీ మంచిగా ఏసేటోన్ని. చిన్నప్పట్నించే, బొమ్మలట్ల ఏస్తుంటేగాని డ్రాయింగ్‌ల రాణించేవాడిని. నా కందు నుంచి, నేనెక్కడ గూడ డ్రాయింగ్ టీచర్గ నేర్వలేదు. డ్రాయింగ్ టీచర్గూడలేకుండె. ఎంతో కష్టపడి, డ్రాయింగ్ మెల్లిగ మెల్లిగ చేస్కోని, ఉద్యోగంలో ప్రాముఖ్యం సంపాదించిన. ఈ విధంగా ఇండ్లలోయరిచ్చుకున్న హయ్యరిచ్చుకున్న. టీచర్ ట్రేనింగ్ చేస్కున్న షాద్‌నగర్‌లోపట. డ్రాయింగ్ మాష్టర్......... అని ఉండె అన్నమాట. డ్రాయింగ్ ట్రైవరయిటింగ్ పాసయిన ఎట్లంటే ఒక సారి మావూరికి టీచరొచ్చిందన్న మాట. మా వూళ్ల దన్వాడ ......... అని ఉన్నడు. ఆయనొచ్చినాకు బంద్వాయన. ఇట్ల డ్రాయింగ్ పరీక్ష ఇప్పిస్తం మీ పిల్లగాడు షారున్నడు. డ్రాయింగ్ పరీక్షలిప్పిస్తె బావుంటుండె. ఇస్తెనే జెప్తె షాదనగర్‌ల .......... అనీ మాష్టరున్నాడు. ఆ డ్రాయింగ్ నేరుస్తే డ్రాయింగ్ మాష్టర్గ బోవచ్చు. ట్రేసర్గబోవచ్చు. డ్రాఫ్ట్సమన్‌గ బోవచ్చు అని నాకు జెప్పిండు. అంతకు మున్పు నాకు డ్రాయింగ్ ఉంటదని గాని పరీక్షలు జర్గుతయ్ అనిగానీ, కోర్సున్నదని గానీ తెల్వదు. బొమ్మలయితే నాకుబాగొచ్చు. ఇంట్రెస్టు ఉన్నది. సదువు మీదింట్రెస్టు తక్వ. ఆయన చెప్పడం వల్ల బోయి కునుగొన్న. ఇట్టేట్ల సంగతె త్జెప్తె, పరీక్షిచ్చేదుంటెనెలారెండ్నెల్లుండు నీక్కాయిష్ ఎంతమటుకున్నదో తెలియదు. అని తాననె. నేన్గూడ ఈ నెలా రెండ్నెల్ల వరకున్న . నాకు ఎంకరేజ్ చేసినడు. ఏదియ్యాలో ఏదివెయ్య గూడదో చెప్పిండు. ఇర్వై

రెండు రూపాయలు ఫీజు ఆఫీజు గట్టిన తర్వాత డ్రాయింగ్ పరీక్షలు జర్గినయి. దాంట్ల గూడ ఏడెన్మిది సబ్జెక్టులుంటయి దాంట్ల గూడ. థీరీ అంటే టీచర్ ట్రేనింగ్‌ల కూడ థీరీ ఉంటది. కాని ఫస్టు లోయర్ గ్రేడ్‌ల కూడ ఎన్మిది పేపర్లుంటాయి. అయితే నాలుగురోజులు జర్గతయ్. రోజు రెండ్రెండు పేపర్లన్నమాట. కనక మామూల్గా ఫ్రీహ్యాండనీ, మాడ్రన్ లాంగ్వేజని మాడ్రెన్ ఆర్ట్ అనీ, ప్యాట్రన్ డిజైన్ అనీ, జ్యామెట్రికల్ మాథమెటిక్సనీ ఇట్ల రకరకాలుంటాయి. అన్నింట్ల కనీసం ఇర్వై, ఇర్వై మార్కులు రావాల. కనీసం పాస్ అని లేదు. థర్డ్‌క్లాస్ అంటె ఫైయిలు. టెక్నికల్ దాంట్ల తర్డ్‌క్లాస్ అని లేదు. సెకండ్ క్లాసయితేనే పాస్ తర్వాత హయ్యర్ పాసయిన. టీచర్ ట్రేనింగ్ తీస్కొన్న. బొమ్మ లేస్తనే వుంటం. పుస్తకం లేదు గానీ ఇంట్ల కతల పుస్తకం చందమామ బాల మిత్రలుంటయిగద. బొమ్మలేస్కుంటమూ. దాని మీద జామెట్రీ సబ్జెక్టులుండయి. కాని అవంత ఫయినలియర్లో. ఎక్స్‌పర్ట్ ఉంది. కాబట్టి కొని చేస్కోవాల్సిన అవసరం లేదు. హార్డ్ గూడ ఉండవు ఆ ఎగ్జామ్స్. సులుబంగనే వుంటాయి. దాన్లంచది ఎగ్జామ్ అదీ ఇచ్కోని, ఎగ్జామ్ ఇచ్చుకొని టీచర్ ట్రేనింగయి గాందీ హయిస్కూల్ అని హయిద్రాబాద్‌ల కనుక్కొంటే ఎండకాలంల జర్గుతాయి ఎగ్జామ్స్ అవీ. అప్పుడు వనండాఫ్, ఫార్టీ ఫయివ్‌డే సుంద్రా నాలుగయిదురోజులుంటాయి. ఎగ్జామ్స్ దీనికేంటంటే తెల్గూ మీడియము రకరకాలుంటయ్. పైగా దాంట్ల గూడ డ్రాయింగ్ ఒకటీ కాదు సబ్జెక్టు ఆడ. క్రాఫ్టు, డ్రాయింగు, టెయిలరింగూ, మ్యూజిక్ అని రకరకాలు జర్గుతయ్. నాకు మటుకు డ్రాయింగు ఇంట్రెస్టు. నలబై రోజులు రాసింతర్వాత ప్రాక్టికల్ అని సర్టిఫికెటిస్తరు రాసినటుగ థీరీ పరీక్షనెమొ ఆర్నెల్లు మూడ్నెల్లు వ్యవదుంటది. మళ్ళింటికెళ్ళినంక కాల్ ఫర్ చేస్తరు. అప్పుడాడేటున్నప్పుడు మాసబ్ ట్యాంక్ దగ్గర కాలేజ్ ఉండింది. అక్కడ ఏగ్జామ్స్ కండక్ట్ జేస్తరు. ఒక్కరోజు దాంట్ల పాసయితే సర్టిఫికెటిస్తరు. ఎంప్లాయిమెంట్ చేయిపిస్తే డ్రాయింగ్ మాస్టర్ చెయ్‌నీకె అవకాశం అన్నమాట. ఇగ మామూల్గ టీచర్ ట్రెయినింగ్ చెయకుండా ఉంటె ట్రేసర్గ పోవాల్సిందే తర్వాత డ్రాఫ్టుమన్‌గ పోవచ్చు. ఇటువంటివన్నీ ఉంటయి. అదురుష్టమ్ బట్టి ఇదే వుద్దోగం జేస్తున్న ఎట్లంటె ఎగ్జామ్స్ అయతయ్ డియీవో వాళ్ళు కండక్ట్ చేయడంవల్ల, పరీచ్చ ఉండది. డియ్యేస్సీ వుంటదిగద. కమిటీలోపట తెల్గుపండిట్స్ ఇంగ్లీష్ పండిట్స్, బియ్యేసీ బియిడీ ఎట్ల చేస్తరో డ్రాయింగ్‌ల గూడ అంతే దాంట్ల ఎగ్జామ్‌ల గూడ కొన్ని బొమ్మలెయ్య మంటరు. రంగుల పేర్ల జెప్పమంటడూ ఈ రంగు కర్సెక్టా ఏమొస్తదీ? రంగుల పేర్లు జెప్పుమంటడూ

ఈ రంగు కర్తే ఏమొస్తదీ. రంగు కల్పితే ఏమొస్తదీ? ఫలానా చిత్రకారుడి పేరేమిటి? చిత్రాన్ని ఫలాని ఏముంటంయి? పెన్సిల్ తోని ఏసే చిత్రాలు ఏ విధంగా వుంటాయి. రకరకాలుగా వుంటాయి ప్రశ్నలు. జవాబులు రాసి ఎక్వ మార్కులు దెచ్చుకున్నోల్లు పాసయితరు. మామూల్గా రిటెన్‌టెస్టు ఓరల్‌గ అడ్గుతరు. ఓరల్‌గ రంగులు ఉంటే టెక్నికల్‌గ వుంటె మామూల్గా హోమ్ వర్క్ చేసినవి ఉంటే తర్వాత ఎగ్జామ్‌ల టీచర్ ట్రేనింగ్ చేసినప్పుడు ప్రాక్టికల్ ట్రేనింగ్ బొమ్మలు జూపమంటారు. మామూల్గా అప్పుడా వుద్యోగానికి అర్హులమన్నమాట. మామూల్గా దొర్కదు. సెలక్టయింతర్వాత మళ్ళింటికి బంపుతరు. ఫలాని ప్లేసేసినమ్. సేమ్ మన టీచర్ ట్రేనింగ్ చేసిన స్కేలే ఉంటది. ఎస్జీ బీటీస్కేల్ ఉంటది. ఎస్జీ బీటీస్కేల్ ఉంటది. ప్రతి వూళ్ళ వుండవు తాలూకాల ఉంటయి. ఎక్కువ డివో స్కూల్స్ అన్నమాట. ప్రతి చిన్న చిన్న స్కూల్ల వుండవ్ అస్సలుండవ్...

# వ్యవహార ఖండిక - 4

| | | | |
|---|---|---|---|
| కేంద్రం | : నారాయణపేట | విద్య | : 8వ తరగతి |
| వృత్తి | : రైతు కూలీ | కులం | : బెస్త |
| వయస్సు | : 40 సం. | లింగం | : పురుషుడు |

..... నేను సాలెకు బోయేటప్పుడు, స్రాలె అంటే బడికి బడినుంచి స్రాలెకు వస్తుంటి బోయేదుంటే నేను సేన్నుంచి వొస్తుంటి స్రాలెకు. సేనంటే పొలం కాడ... మా వొంటలు గింటలు అన్నీ సేనుకాడనే మా గాసగాళ్లు సేనుకాడనే. గాసగాడు అంటే నౌకర్లార్! మేం ఆడ నాయనమ్మ యమ్మా, పెద్దప్ప, సిన్నప్ప తాత, మామ అవ్వ అన్నీ సేన్‌కాడనే అడ్నించి నేను బడికి రావాలె. బడికి అస్తాస్త, మాకు సిన్నది వోగుండె. ఆ వోగుల ఒట్టే యాతసెట్లు ఆ యాత సెట్లు కెల్లి రావాలంటె సవుడు. అసవుడుల కె ఆనబడేటాళ్ళకు జారుడు. జూరుడంటే ఏందది. కాళ్ళీడ బెడ్తె ఆంతదూరం బోతడి. అట్లీగ బట్టలన్నీ సవుడంటించ్కొనాలె. సాలెకురావాల సాలెకొస్తే ఊడపంతులేమనాలె. ఏమ్‌ర బడప కొడక ఇట్లొచ్చినవ్ బుర్దంటించుకోని ఏంలేద్సార్ ఈదుల్ల కిందబడ్తీ, కింద బడియిదంత బుర్దంటె, కడుక్కుంట జరగిదంత నీల్లతోని అంటె కొడ్క కడుక్కునేది లేదు. గిడుక్కునేది లేదు. మొదలు సరస్వతి రాయ్ అనాలె రెండు దన్నాలెమొ అట్లె ముర్కిబట్టల్తోని అట్లె గూసోనాలె. పంతులు జెప్పిన కాడికి రాయాలె ఇగ సేన్నుంచి నేను శాలెకొస్తే యెనక మా సిన్నప్పనో లేకుంటె మా గాసకాడు గానీ యెవడొ సద్దితీస్కొనిరావాలె, సద్దంటే గిప్పుడు క్యార్యర్ అంటరు. లేకుంటే తొస్తె కానా డబ్బా అంటని కూడంటరు. గిప్పుడంటే క్యార్యర్ కూడంటరు అప్పుడు తొసెకా నా డబ్బా లేదా సద్ది. గింతపులుసు అంటే పప్పుసర్కే పులుసు అంటమ్ సర్ మేము. పులుసు గింత కారమూ ఇగ పుంటి కూర కారమూ గుచ్చిమిర్పకాయల కారమూ గింత జేస్కొని తీస్కొనొస్తే యాడ శాలలె గూసోనాలె. యింతన్నం దినాలె ఇగ తిని ఆ సద్ది బట్ట జాడియ్యాలె. ఆ సద్ది బట్ట జాడిచ్చి, అక్కడ బెట్టాలె. ఆడ బెట్టి సాలె ఇడ్వంగనె సక్కగ బోవాలె. యాడికి సేన్కి, ఇగ బోత బోత సెనగ సేన్ల అన్పకాయంటనె ఉంటది. అన్పకాయ సెనగ సేన్ల కంది సేన్లన్ల అన్పకాయొస్తది. అన్పకాయింత దొంగతనం చేస్కుంట బోవాల. ఆసేనోడు జూడాల మమ్ముల్ని యేం కొడ్కా! నాసేన్ల అన్పకాయ ఏర్తువ్ కొడ్క పడా పడా నాల్గుదన్నాల ఏమ్‌ర కొడ్క నువ్వు దన్నినవ్ గద నస్కుళ్ళ నీ సేన్ల

యింకింత ఏస్కునాలె మా మనుసుల అన్కొనాలె. మళ్ళ మేం అక్కడికి బోయేదేలేదు. ఊకె ఈడు కొట్టిన జిద్దుకె ఏడ్చుకుంట బోయి మా మనసుల అనుకున్నం. ఇంగొంటేంది నాలుగ్గొట్టం నేను సేనుకు బోతుంటి, సేనికి బోయి మాగాసగాళ్ళని దూళ్లకాడ -దూళ్లంటే పశువులు ఆవులు బర్లు - బర్లంటే గేదెలంటర్ కద్సార్! మేం బర్లంటం, ఆబర్లకాడ ఆవులకాడ, యెడ్లకాడ నాలుగ్గొట్టంగ ఆడికిబోవాల ఆడున్న గాసగాడిని సేన్ల పనిచెయ్‌పోరా నేనెడ్లకాడుంటనాల . సేన్ల ఆ సేన్ల ఆవు పాడువడానికి వొచ్చేతల్కి దూరమ్‌గ ఉర్కేతల్కి పాడ్వనీకె రావాల అని సేన్ల బోయి మేతమెయాల అవి మేత మేసే తల్కి దాన్ని గొట్టనీకె బోయేటోల్లకు దాన్ని గొట్టనీకె బోయేటాల్లకు ఇవన్ని సేన్ల బోయిబడాల. మావి దగ్గర దగ్గర ఒక పద్దెన్మిది ఎద్దులు ఇగ ఒక పది ఆవులు నాల్గు బర్లు . ఇవన్నీ దూళ్లన్ని మర్ల బోయేటోల్లకు పాడ్వటానికొచ్చేటోల్లకు . ఆకర్కి. పోయేటల్కి సగం సేను మేసె. మళ్ళ మా గాసగాన్ని రారో రారో అని కూతగొడ్తి. ఇట్ల సేనంత మేపాలె మాసేను మంది సేను గాదు. మాకు మాయబ్బతోని తన్నులుంటయ్. మా నాయనకు అప్పొ అంటమ్. ఇకా మా అప్పతోని తన్నులు తిన్న. కొడ్కా నిన్ను ఎవడు బొమ్మన్నడ్ ఎడ్లకాడికి ఊకే ఇంత కడూ దీని ఈడ బంద్రా అంటె నువ్వు ఎద్దులు కాస్తవా పీకుడుమొనగాన్లెక్క అని నాల్గుతన్నులు దినాలె పెయంత అల్కగ అయితుండె. అల్కగ కాంగనె సక్కగా శాలెకుర్కాలె .... సిలేట్ పారేయాలె మట్టసం తినాలె పండుకొనాలె మా పనిట్లుండది. ఇహ అందుట్ల మంచిగా సాలె అక్కడ ఇక్కడ నాలుగోతరగతిదంక డుమ్మకొడ్తి. నాల్గోతర్గతి నాలుగేండ్లు చద్వినను. ఇంత్యాన్ ఇస్తె గదా! ఇప్పుడు అసలు ఏం జెయాలె సాలె షురు అయినకాన్నించి బోవాలె. ఆర్నెల్లు పరీక్షకట్టింది లేదు. యాడాది ఇంత్యెహాన్ కట్టేడ్డి లేదు. ఇహ అప్పుడు మల్ల అందుట్ల గూసోబెడ్తె ఎక్కువ తక్కువల తోల్తరా? అయిదిట్ల దోల్తరా ఏడిట్ల దోల్తరా అప్పుడెవరడుగుతుంటిర్సార్ అది మాకు రారా రారా అంట పట్క పట్క బోతుంట్రి సాలెకు తర్వాత నాల్గు సద్విన. తర్వాత నాల్గవ తర్గతి ఇప్పుడు తెల్గుల చారువ్ అంటుంటిమి చారువ్ పంజువ్ ఇట్లనుకుంటుంటిమి. ఆరుకుసిక్సు అంటుంటిమి అంతె ఏడో తర్గతి ఇగ సెవెంతు. సెవెంతు దెలవది పివెంతు దెలవదిగాని అక్కడిక్కడ నాల్గో తరగతి, అయిదో తరగతి అయింతర్వాత ఒకటికీ మొదటి వాచకం అంటుంటిమి.. రెండోవాచకం, మూడవ వాచకాన్కి మూడోవాచ్కం, నాల్గో వాచకాన్కి నాల్గోవాచ్కం అయిదోతర్గతికాన్నించి, ఇంగ్లీష ఇంగ్లీష్‌ల ఏడోతర్గతి కూడా ఏబిసిడి లు సరిగ్గా వచ్చేది లేదు. ఊకె మాకు తోడెం ఉర్దూ గూడ చెబ్తుంట్రి ఆ ఉర్దూ గూడ సరిగ్గింత నేర్వలేదుగాని ఇంగ్లీష్ కూడ సరిగ్గింత నేర్వలే . ఇప్పుడు మాకు బుద్దొచ్చిన కాన్నుంచి మేం ఇంగ్లీష్ నేర్చుకున్నంగాని

సాలెలయితేం లేదు. బాగ సదుకుంటె గూడ యాడనైన పెద్ద పెద్ద పనులు దొర్కు-తుండె గాని మేం సద్వలేదూ ఏంలేదు ఎందుకంటే మాకు బూములుండయ్. ఆ బూములొస్త మీదనె మా యప్పోల్లు మమ్ములను గొట్టసీకొస్తె కొడ్కా-సాలెకు బోరాసాలెకు బోరా నాల్గు తంతే తాతా! మాయప్పగొట్టె తాతా మాయప్పగొట్టె అంటె మా తాత తోన్కి- బోతె కొడ్క- దేనికి కొడ్తవ్. అంటే అనాల మాయప్పను తాతా గొట్టాల మల్ల సాలె లేకుంటే లేదు. ఆడుగుజేస్కోని బత్కు- తడపో మేం చాలా మందిమి బూముల మీదయినంగాని మంచిగ మేం సాలె నేరిస్తే ఈ పొద్దు మేం గూడ డాక్టర్లమొ కలెక్టర్లమొ అయ్యే సుద్దిగాని అదేమంటే మమ్ములను మా పెద్ద మన్సులు మా తాతోల్లు మమ్మలను బాగా సద్వనిచ్చేవిమి లేదు. మేం ఒకల్లమొ ఇద్దరమొ పిల్లలము వాళ్ళకు. ఇగతినుడు తిర్గుడు కొడ్క- అన్నరు. తిప్పిన్రు అడ్వపాలు జేసింద్రు సూడు ఇంకేంలేదు మాకు సాలెనేమొ ఇప్పటిలాకె బయం పెట్టి సాలెదొర్కితె మేం బాగానె సద్వుతుంటిమి. బయంలేదు ఏం లేదు మాయప్ప గొట్టెటోల్లకు, మాతాత దగ్గరకు బోయేడ్ది. మా తాత పిరకు చేసెటోల్లం నీయవ్వ సాలెకు వద్దే వద్దుర సాలెకు, నువ్వు నద్ర దుళ్ళకాడికి అనేది మా తాత . మాతాత యాడుంటే నేనాడనె ఉన్న. అందుట్ల మా సాలెలలో గుడా వంతు ఒడుదిడిస్తే గాడ్దులు గాయనీకె బోయిండన్నట్టు వొంతుల లేదుగద! సాలె నేర్పెడ్ది మావొంతుల లేదు ఇగదాన్కోరకె ఇట్లె సగం నేర్సినమ్. ఇగ అందుట్ల మాయప్పోల్లు అదలైరి. అదలైంతర్వాత జర సంసారమ్ పరిస్తితి అంటె సంసారమే నడ్సెడ్ది కష్టమ్‌యింది. అట్లయినగాని అక్కడ ఇక్కడ మా కొక పెద్దమన్షి. లీడర్ అతన్కి తెల్సిండె. అతన్ని బట్టుకొని నేనుగింత జదుకున్న నప్ప నాకేమన్నగాని నాకొకటి సిన్న పని మార్కెటాపీస్లపనున్నది. నాకి ప్పయ్యంటని అంటె ఆ పెద్ద మన్షి అడనిప్పించె అదే దానిమీద జీవనాదారం అంటె అక్కడ సేన్ల పని నడుస్తుండయ్ ఇక్కడ యాపన్లు గూడ నడుస్తుండయ్..... యేం గొండబోవాలంటె గూడ ఎన్మిది దినాలకోపారి గాస్‌నూనె మిర్పకాయలు పస్పు ఎల్లిపాయలు, అన్ని మేం ఎన్మిద్దినాలొకటేపారి కొన్కపోవాలె. ఎట్ల గొన్కపోవాలంటే ఒక దుక్నం తాన సవుకారితానకు రావాలె అయ్యా ఇది మాకు. ఇన్నిదినాలు ఇయ్యి మాకు. ఇన్ని సామానేమొ ఇయ్యి. ఇగ పదేనుదినాలకో, నెలకో, రెండ్నెల్ల కోనీదుడ్లు తెచ్చిస్త. దుడ్లంటె పయిసలు దుడ్లు తెచ్చిస్తమని చెప్తుంటిమి. అవి తీస్కోని పోతుంటిమి మళ్ళ నెలకో అయినంక ఆ షావుకర్ దుడ్లు తెచ్చి అతనికిస్తుంటిమి. మున్పటి పెద్దమన్షులు గూడ దర్మం మీద నడుస్తుంద్రి. యెట్ల ఇప్పుడు సూడప్ప పలానమన్షి అంటె ఒక రంగన్న

మల్లన్న ఉండడనుకోన్రి. ఇగ మల్లన్నేంజెప్తుండె ........కు అయ్యా ఇగ సిట్టెల్తుండె. నోట్‌తోన మామన్వోస్తడు. మామన్నికి నూర్రూపాయాలిచ్చి తోల్తుండె. ఇప్పుడేమున్నద్సార్.

నువ్వు స్టాంపుల్రాసియ్యి. యేమంటరది. నువ్ పెద్దగ౦ ఓ బోర్డు గూడ రాసియ్యి దుడ్లు బెట్కోని షవుకర్లయ్యరు పేదోళ్ళకు. పేదోడు గూడ అట్లేంజేస్తరు. ఇచ్చిన దుడ్లు తీస్కపోయి కల్లుల్ సారాయి దాగిరేమొ కలాసింగ ఇంట్ల బెండ్లంపిల్లల్ని సాకరు. సెల్లని సాకరు తాగుడ్కు సరిపోయినరు. షవుకర్ అప్పు ముట్టియ్యక పోయిరి. షవుకార్ గూడ దివాలా తీసినరు. ఇటువంటి యాపారాలుండయ్ ఈ తాలూకాల. తాలూకాంటే కొంచెం ఈ యేర్యాసంగతంటున్న యేర్యాంటె మా సుట్టు ముట్టు పల్లెల సంగతి... అదలంటె బాగాలు. ఎట్లంటె సార్ జూడు మా ఇంటి సంసారమ్ మొదలే ప్యేద సంసారమ్. మా జమానలంటే దగ్గర ధర ఒక ఇరవయ్ ఇరవయ్యేదేళ్ల కింద మా మాటజెప్త నేను అప్పుడు ఏమున్నది అడ్విల ఉండేడ్డి. అడ్విల ఉంటె జర మాయన్మొల్లు పీరు ముగ్గురు మా అన్నదమ్ముళ్ళు మా వాళ్ళు ఒక్క ఇంటికి ఆడ్బిల్లలయితె కాకపోయిరి కద! ఒక్క ఇంటోల్లు కారుకద ! ఒకామెది ఒక వూరు ఒకాయమ్మెదేమొ ఒకవూరు వాళ్ళు పీకులాట పెట్టుకున్నా మొగోళ్ళకు జగడమ్ బెట్టను చెయ్! నీ ....... నాపాల్ నాకియ్యని నీపాల్ నీకియి నీపాల్ నీకియి అని బాగాలు బంచుకొనిరి. ఎట్లయితేంది. నెర్రోజ్ల దీస్కొన్రి ఇప్పుయాడ్నేగాని అప్పట్లెక్కిప్పుడు ఒగడు జెప్తెయింటుండ్రి. ఇప్పుడదేం లేదు పదేనేండ్లకు పదారెండ్లకు అదలయిపోతుండరు ......

# వ్యవహార ఖండిక - 5

కేంద్రం : షాద్‌నగర్     విద్య : లేదు

వృత్తి : స్వీపర్     కులం : యాదవ

వయస్సు : 45 సం.     లింగం : స్త్రీ

నేను ముందుగాల సొంతం మతలబుండె. కతలయి గన్యారం ఎత్తుకెళ్ళిండు. యెయ్యి రూపాయలు. ఎత్క పోయిండు. దొంగతనం జేసిండు. వాళ్ళింట్ల పన్జేస్తుండె. ఎత్కబోయిండు దొంగతనం చేసిండు వాళ్ళింట్ల పని చేయనీకె పోయియెయ్యి రూపాయలు. ఈడవుండ్సిండనుకో ఆళ్ళింట్ల పన్జేస్తుండె. ఎత్కబోయిండు. ఎత్కబోతె ఇగ నన్ను పిల్చి ఒక వాచ్మెన్ ఉండె ఈడ అరబ్బోడు. పురానాపూల్కాడ ఉంటుండె వాచ్మెన్ ఆ వాచ్మెన్ చూవించి తెచ్చిండన్న మాట ఇర్వైరూపాయలు, ఇర్వై రూపాయల్ కొన్ని సంవత్సరాల్జేసిన. ఇగ ఈ సారొచ్చినంక అర్వైరూపాయలయినయి. పది సంవత్సరాలయినయి ఈ సారు ఈ బ్యాంకులకు వచ్చి అర్వై రూపాయలయినయి. అర్వై పోయినంక పదిరూపాయలు ఎక్కువ జేసిండు. ఇగ గిట్లనే మ్యానేజర్లు వచ్చినప్పుడల్ల మూల్గుతుంటె, బర్లు మూల్గతుంటెక్కువ జేసింద్రు. మొన్న గిట్ల జేసిండు. ఇప్పుడు రెండు వందల తొంబయి వచ్చింది. చాయ్‌దుక్నం బెట్టిండు. సచ్చిపాయె. చాయ్ డబ్బ అయింత సచ్చిపోయిండి సీరామనవ్మినాడె సచ్చిపోయిండు. మూడు రోజులునుస్తుండె ఒకపెద్ద కొడ్కు సచ్చిపోయిండు కష్టమొచ్చింది. సాతబడి జేసింద్రు. అయిదునెల్లుబడిండు బూమీమ్మద. ఇర్వైవెఌలు కర్చుసేసింద్రు అనికి పైసలు ఎక్కడ వేడ్చుల్ కాన్పించి, తాండూరంటె తాండూరుకు ఇక్కడ గంగా పురమ్ అంటే ఎక్కడ్నో తోల్కపోయినమ్. మంత్రాలు దీసినమ్. ఇగ ఇంట్ల నిమ్మకాయలు కొబ్బరికాయలు పద్దెద్మంటె పది. కొత్త బట్ట అయిద్మీటర్లు దెమ్మంటె దెచ్చిన. అన్ని ఊద్బత్తీలు ఆర్తికర్పూరం ఏమేమిటివో దెచ్చి ఇర్వయివేలు, ఇర్వయి రెండువేలు కర్చు చేసిన కొడ్కుబత్కపాయె. ఇయ్యాల్టికి సరింగా అయిదేండ్లు అయిదు సంవత్సరాలు. శ్రావణ మాసం అమాస రేపనంగ జచ్చిండు. చేసింద్రోమో. కష్టంచేస్తుండే బాగా పెద్దోడు ఏమోఽ ఎవల్తోని పగ లేకుంటిమి. ఏం లేకుంటిమి. ఏమన్నా ఏంజేసినా దేవుడూ దేవుడ్కే దిష్టమొచ్చినా, ఇగ పండినందుకయితే భాస్జేయాల్సార్! నోటిమాట బందాయె. కన్లు కాన్రాకపోయె చిన్నబాద కాదు

అన్నాదజూస్తే, మింగకుంటాయె పాల్గాడ మింగకుంటాయె బాదబాద. సూపించిన సర్కారి దవాకాన్ల నెల్లాల్లుంటి. ఇగ లష్కర్ల నెల్లాల్లున్న తక్వగా లేద్గాని ఎక్వనే అయింది. మల్ల ఈడ... డాక్టర్ కాడున్న అమాసకు ముందర్నే బాయెమల్ల. ఏదో గిట్లనే ఊడుస్తున్న చేస్తున్న. ఇన్నేళ్ళ సంది చేస్తుఃఎ రెండు వందల ఇరవై మొన్న మే నెలల మూడొందల అరవై అయింది. నీళ్ళు దేవాలి గిన్నెలు బిన్నెలు గడ్గాల ఈ పన్జేయాల మల్ల ఏంజేసినవ్ ఏంజేసినవ్ అంటరందర్. పని మంచిగలేదు ఏంచేస్తవ్ జరంతపని అంటరు వున్నరు. అయిదు మంది బిడ్డలు అయిదు మంది కొడుకులు ఇద్దరు కొడుకులు సచ్చిపోయిన్రు ముగ్గురు పెండ్లిళ్ళకున్నరు. పదోతరగ్గతి సదువ్తున్నరు. ఇద్దరు పిల్లలు ఒకామె బట్టలుత్కుతున్నది, ఒక కొడుకు పొన్దుకానమున్నది. పిల్లల్లేరు. ఒకాయనకు పెల్లి చేస్తి అట్లగు ఉండ బుద్ధిగా లేదామెకు ఆడ్పిల్లలున్నరు. ఏంజెప్పేదామెకు. వీల్లకిక్కడ పిల్లాటు దొర్కుతుండే నాకు దొర్కితె పయిసల్లేవ్ ఏమ్లేవు. వొట్టి పిల్లను దింపింన్రు. తోలిస్తే ఆ పిల్లగాడు జర్రకాల్లుండెటోడు తాగ్పేతు ముండకొడ్కుండె నాకొడ్కని దాస్కుండేట్టి ఏంలేదు గాని, ఏం చెప్పిండని తల్లి జెప్పిండని ఉండాల. రెండు జీతాల్లేవని పయిసల్లేకుంటె మానె, బత్మిలాడ్కోని, సారె ఇప్పించి, ఇగ పంటుండె, కొట్టె. ఇగ ఆమె ఉండనని అలగున్నది. అలగున్నరు. ఇగ నా పిల్లలు కొసం బాదపడాల సచ్చేవరకు, ఆడ్పిల్లలు ముగ్గురు పెండ్లిల్లు అయిపోయనయ్. ఇగ ఒకరు పదోనాడు. సేయ్మన్నాగాని ఊకె సెక్రలేటర్ మేనేజరెంబడిదగలంగ ఊకె ఏడ్చిన నేను ఆమాటలన్నడు. మేం మన్సులో దయాదాచ్చిన్యమ్ లేని మన్సులు. బీదోల్ల మీద కన్కరం లేదింత గూడ. ఏం ఆఫీసర్లయా అని అడ్గుతుంటి . మేనెజర్ని ఇప్పుడీ మేనేజరయితే కోపమ్ . కస్సుమంటదీ. ఏంగాదు నాదేంబోయింది తప్పన్ననా అంటే అనగూడ. నాకేం గుగులు. ఆరెంసాబ్ జేసిండు. సర్కోర్జేసిండు. నేనేజేయలేగద! అట్ల నేజేయలేc గీషవుకార్జేసిండు. అరెంజేసిండు మల్లొకసారి గీ............. జేసిండు. అందరు అల్లైజేసిండు ఎప్పుడు గట్ల ....... నిన్నటి దినెం మంచిది. ఊకూక్నె కోపం ఆపీసరాయె. తొమ్మిది మూడు మార్కులల్ల బోయిండు.. మూడ్నేల్లయినంక పరీచ్చ ఇయ్యాల్నంట. ఇప్పుడాడ్పిల్లలు పదోతర్గతి జద్వుతున్నారు. మంచిగ పాసయింన్రు ఫష్టొచ్చిన్రు. ఇద్దరాడోళ్ళు. ఒకేకామెను...... జేస్కున్నడు. ఇంకొకామెను కిషన్ నగర్ల ఇచ్చిన. డాక్టర్ పెండ్లాగిట్టున్నది. ఆమె చిన్నగున్నప్పుడు పన్లు చేస్తది. అడ్గిన్రు. పెండ్లిగాకుండా గర్భవతి అయింది. ఎట్ల అని అంటె వుస్తెగడ్త అని గట్టిండు. ఇల్లుగట్టిండీడ మూడ్నాల్లు ఇండ్లున్నయి. పిల్లె బుట్టింది. ఆడనె ఉంది పెద్దామె . నా మొగనికి రూపాయిస్తున్నది ఆడ్పిల్ల నుంచి నేను ఆడ్పిల్లను

తెచ్చిచేసి, మాత ..స్తుంది కల్వకుర్తిల ఉంటె ఆమె ఆడ్బిడ్డను తెచ్చి చేసింది. ముసలాయన తెస్తే ఊకె. చేయంగ చేయంగ కష్టాలు రాత్రి పదకొండుగంటల్దాక మేల్కొండి మల్ల నాల్గు గంటల రాత్రికి లేవాల. వంట జెయ్యాల. బోతడు. మా యిల్లు మా సంసారమ్ అన్కొనె నేను జేస్తే ఇప్పుడెమొ మా కిదంతా అయి కిరాయి ఇంట్ల ఉన్నమ్. ఒక్క రూపాయొస్తుండె దినామాయ్నకు. అ దొక్క రూపాయికి అటానా, గోదుమ పిండి డెచ్చి అంబల్లాకజేసి పోస్తుండె పిల్లలకు అంబల్లా చేసి పోసి నేను నీల్లాగ్గా వుండె. తాగ్తే రేవనంగానే పోయి వాళ్ళింట్లనే ఉంటుండె. అడిగిన పనికొరకు. నేను మీ దగ్గరుంట వస్తేస్త, ఏంజేస్తవు జెయ్యాదుర ఇట్లనే అన్నడు. ఒక పదిహేను రోజులు పెట్టుకోని సూతాం మరి ఇగ తరవాత ఉంటెజేసె లేకుంటె లేదు. సరింగ జేస్తే పెట్టుకుందాము లేకుంటె లేదని అని అన్నడు. పెద్ద కొడ్కు అంటె పదిహేను రోజులు పాయె, నెల్లాల్లు జేస్తి, ఆరేండ్లు జేస్తి, అళ్ళింట్ల నల్గురు పిల్లలు బుట్టింద్రు నాకు ఆళ్ళింట్ల ఉన్నప్పుడు ఆళ్ళకు నాల్గు కాన్పులు జేసిన నేను నల్గుర్ని కన్న ఆళ్ళింట్ల ఇగ ఇప్పటికి ఆళ్ళ బిడ్డల పెండ్లిండ్లయినయి. ఒక కొడుకు పెండ్లయింది. ఆళ్ళింట్ల గింత చిన్న దానికి, ఏదానికి అయినా కాదనకుంట, పిల్చి నాకు నా మొగడు సచ్చిపోతె గూడా, మూడ్నెల్ల లోపట రెండు రైకలు బెట్టింద్రు యాభైరూపాయలిచ్చింద్రు గింత గోదుమ్ పిండిచ్చింద్రు. మాయన్నలేరు యెవర్లేరు. నాయ్న నాకు. ఒక్కదాన్నే ఉన్నా. ఆల్లే తల్లి దంద్రుల్లాక ఒచ్చీడ ఉన్నరు... ఒకన్న వుండె వొడ్ల గిర్నిలుండె మలక్‌పేటల. అన్న జచ్చిపోయిండు పన్నేండ్లాయె. నేను బెంక్‌ల జేరినప్పుడె జచ్చిపోయిండు. పన్నేండ్లాయె. నేను బెంక్‌ల జేరినప్పుడె జచ్చిపోయిండు, ఒక అక్కుండె, ఒక అన్నుండె మాయమ్మ నా చిన్నప్పుడె జచ్చిపోయింది. నాకు తెల్వది మాయమ్మ తల్లుంటె మాయన్నకు బాగనె బంగారమిచ్చింది. నాకు బాగానె ఇచ్చింది. మాయాడబిడ్డకు ఇచ్చింది. నీకు పిల్లలయితున్నరు. నాకు పిల్లయితున్నారు. ఎవరంతల అల్లుంటున్నలు. అంటె ఇగ అట్లనా అని అలాగయితున్నారు. అలాగయినప్పుడు ఉన్న పదేండ్లు చేసినంక బెంక్‌ల బిల్సిండు. ఇర్వై రూపాయల్సంది అట్ల ఇర్వై, ముప్పై అయిదు సల్లగుండ. ఆయ్నకెంత మంది పిల్లలున్నరోగాని, బాగా తగు బెట్టుకుంటుంది నేను ఇన్నేండ్లు జేసిన, నాకెందుకు జేయవు. నేనేంజేసిన అంటని మస్తుమాట్లు పైసలాడ వడేసిన గాని తీసిచ్చిన. ఆఫీస్‌ల గట్ల యేమ్ లేదు. సంసారమ్ లేదు. మా ఇల్లు సంసారం అంత మా ఆడ్బిల్లమ్ముకున్నమ్ గట్ల. అమ్ముకున్నంక అలాగ్ జేసిండు. అలాగున్నారు పోని మేం బత్కుంతలేం మీరు బత్కుత లేరు సెప్పిచ్చునంక. పిల్లయినంక.. నేనడ్గలే మా తమ్ముడయితే పట్టించు కోకుండా వుండెనా డబ్బును మాయమ్మ గారిచ్చిన సొమ్ములు

గూడ యాబై తులాల బంగారం గూడ ఇయ్యలేదు. అంత తీస్కున్నరు. అమ్ముకున్నరు. ఇప్పుడు కంచె బట్టింది. నా పెండ్లికి, అంత సొమ్ము బిడ్డ బెండ్లికి అన్నకొడుకు బెండ్లికి పెట్టింది. అంతా అలాగ్ అయింద్రు. మంచిగ బత్కినమ్ అయ్నచాయే జేస్తుండె ఓటల్లల్ల ఒక రూపాయి అది దెచ్చి అంబల్కాచ్కుంట, మా పిల్లలమ్ మేమ్. అప్పుడు రూపాయికి రెండు కిలోలు ఇస్తుంద్రి బియ్యం . ఆటానా బెల్లము ఒక కిలో, అంబల్లాక్క జేసి పిల్లల్కిస్తుంటి. కష్టాలు చానా కష్టాలు. అది నాకు దెల్వదు. నాకు పెండ్లే కాలేదప్పుడు. చెప్పంగ విన్నగానీ దెల్వదు. పటం రాస్తరు. పటం రాసీ ఆ పటంల నూనె పెట్టి వత్తి రాసి సిగం నిండిందని నిమ్మకాయలు అవీ ఇవీ గోసి మంతిరిచ్చికుంట ఊదుపోగేసి ఊపుతరు. యాప కొమ్మ లూపి సిగం నిండిందని, ఆమె మీదికిగ దయ్యాన్నో భూతాన్నో ఇడుస్తరు. మంతరాలు వొచ్చినోళ్ళు... శనివారం శనివారం పూజలు జేస్తం గోద్మలు వొండి పరవాన్నం బెల్లం జేస్తం. మల్లింటి కొచ్చి తింటం. బోనాల్జేస్తమ్. సంవత్సరానికొకసారి, ఊరందరు ఒకసారి జేస్తరు. పాలోల్ల బోనాలు తుర్కోల్ల బోనాలు ఒకసారి గొల్లోల్లవి ఒకసారి రోజొక్కపారి మైసమ్మకు జేస్తము. పోసమ్మకు జేస్తమూ. పోసమ్మకు జేసిన. తెల్లారి పోసమ్మకు జేస్తము. ఇగ మైసమ్మ బోనాలయితుంటె, గట్ల గుడికాడికి కొండబోతమ్ గుడున్నది పోసమ్మగుడి. ఆ గుడికాడికి కొండబోయి గుడ్వార్గ అయిదు సుట్లు దిర్గి దగ్గర బెట్టుకోని అందరు ఇంతింతన్నం బిందెలకెల్లిదీసి తాంబాలం పెద్దది దీసి అందరు దీపం పెట్టి టెంకాయ జోతి ఉంటదిగద! ఆ జోతి అండ్లనే పెట్టేస్తమ్ ఆయాపకొమ్మలనీ గుడికి దగ్గర్నె బెట్టేస్తమ్. మల్ల సర్వసెంబు అన్నం దాన్ని బూజిచ్చి ముందు పసుపు అద్దుకొనాల ఎత్తుకొనిపోవాల, మల్ల బోయేటప్పుడు యాపకొమ్మలూ దీపం అక్కడ్నెబెట్టి కుంకుమాపసుపంత అక్కడ్నే ఇడ్సి గింత బండారది పిల్లలకోసం దీస్కోని కోళ్ళని కోస్కోని, గొర్లనీ కోస్కోనీ, కూరనే కోస్కోని ఇగ తింటుం. ఇంట్లకెల్లే మనింట్ల కెల్లే కొండ బోతం. వొండం, ఇంట్లనే వొండి పూజిస్తమన్నమాట. ఇన్ని బియ్యం పోసి సున్నం బెట్టి నడ్మయింత నూనె మంచి నూనె దానికింత రుద్ది, పూజిస్తమ్ బొట్లు బెట్టి, ఇగ పత్తి గింజలు బట్టలేసి, దీపం బెడ్తం, యాప కొమ్మలు అండ్ల అన్నంల గుచ్చి, మల్ల రెండు యాపకొమ్మలు పత్తి చెంబులేసి రెండు బోనాల్లెక్కబెడ్తం, మల్ల దాన్మీద దీపాలు. అకండంజోతి లెక్కపెట్టి ఎత్కోని పోతమ్. మన్షి మన్షి మంచి మంచి చీరలు గట్టుకొని ఆనందంగా పాటలు బాడుకుంట బోతమ్. ఇగ అమ్మతల్లి గానీ, ఏదిగానీ రాదని మొక్కుతరు. పదైను రోజుల బోనాలు పండుగున్నదనంగ కుమ్మరోనికి జెప్పాల ఎయిగండ్ల కడ్వలు. పొక్కలు దండిగ రంద్రాలు కొడ్తడు. అయిదు పది ఇర్వైదు

చిల్లులుంటాయి. దాంట్ల యెల్గియ్యాల. గోద్మపిండి, ఇంతంత జోతి లెక్కజేసి, నూనె బోసి. మాకు తక్వయితె యెయ్యి గండ్ల తెచ్చిస్తమ్ తల్లీ అంటని మొక్కుకుంట పెట్టిరావాలాడ. పోచెమ్మ గుడికాడ. వల్ల నీకు కొడుకు , కోడిపుంజలాక లేస్తే, కోడిపుంజులు కోస్తమని మొక్కకోవాలె. పిల్లలు అల్కాగ అమ్మతల్లి గిట్టయితె, అట్ల. అన్ని పూలు గున్నుపూలు బంతిపూలు, యెత్తుపెడ్తరు. అయిదంతస్తులు ఎత్తులు పెడ్తరు. గులాబ్‌పూలు ఎంతెత్తయిన జేయనీ అయిందంతస్తులు ఎత్తులు జేయాలె. గుడికాకికి కొండ బోతరు. కొండబోయి అందరు సొమ్ములు బెట్టుకుంటరు. పదిహేను రోజులనుంచి ఆడుతరు. సకల బత్కమ్మ అంటె పాశెం దిన్నంక సకల బత్కమ్మ జేస్తరన్నమాట. జేస్తే అప్పట్సంది పదిహే(న్రోజు లాడి, అందరు బోయి బొడ్డెమ్మె నేసి వస్తరు.....

# వ్యవహార ఖండిక – 6

| | | | |
|---|---|---|---|
| కేంద్రం | : మహబూబ్‌నగర్ | విద్య | : ఎమ్.ఎస్.సి., బి.ఇడి. |
| వృత్తి | : టీచర్ | కులం | : బ్రాహ్మణ |
| వయస్సు | : 33 సం. | లింగం | : పురుషుడు |

...ఫస్టు మేమ్ పోరియర్స్‌కె వూళ్ళునె సద్వినమ్. ఫోర్త్‌క్లాస్ల ఆ తర్వాత మేం ఈడికొచ్చింతర్వాత బాయ్స్‌స్కూల్ల ఫిఫ్త్ క్లాస్ కంప్లీట్ జేసి సిక్స్ నుంచి నైన్తు వరకు హెం.బి.ఎస్ హైయస్కూల్లో కంప్లీట్ జేస్తి. టెంత్ లెవెంత్ ట్వల్త్ మల్టీ పర్పస్ స్కూల్లో అయిపోయింది. ఆ తర్వాత ఫస్టియర్, బియెస్సి జడ్చర్లలో జేస్న. జడ్చర్లలో బి.యెస్సీ జేస్నప్పుడు కొంచెం ఇంటి దగ్గర యవ్‌సాయ్ జేస్కుంటూ యవ్‌సాయంపైన దృష్టి కేంద్రీకరించి బి.యెస్సీ లో కొంచెం అవక వచ్చి సెకండియర్ బి.ఎస్సీ.డిస్కంటిన్యూ జేస్నం. వ్యవసాయంపనుల్లో ఇంట్రస్టుతో ఎక్కువ మొత్తంటయింత మాత్రం కేటాయించడం నుంచి ఆ విధంగా అట్లయిపోయింది. అన్నలు . ఒకాయ్న ఇంకంటాక్స్ అనంతపూర్లో ఇంకమ్‌టాక్స్‌ల పన్జేస్తుండె. ఇంకో అన్న కోపరేటివ్ ఆడ పన్జేస్తుండె. మూడో అన్న టీచర్ల పన్జేసుండె.నాల్గో అన్న ఇంత తాగుతుండె కాబట్టి వ్యవసాయంల నేను ఎక్కీటయిందీస్కోవాల్సి వచ్చింది. ఊరి పరిస్థితి కూడా కొంచెంబాగలేకుండె ఆ వూర్లో కొంచెం విబేదాలొచ్చి, దాంట్లో నేను ఉండాల్సొచ్చిందక్కడ అని వార్యమయి పోయింది. కాబట్టి ఊర్లో కొంచెం పారిటషన్స్‌లో వచ్చి. ఆ పార్టిషన్స్ మా పొలాన్ని ఆక్రమిద్దామని కొంచెం ప్రయత్నాలు జర్గినయి. జరక్కుం దాంట్లో ప్రతిఘటనగా దాన్నుంచి నేను సెకండియర్ డిస్కంటిన్యు జేస్న. ఏ రూపాన్నో మమ్ముల బెదిరిచ్చి ఆడి నుంచి బయటకెల్ల గొట్టాలని ఉద్దేశమ్‌తో పార్టిషన్స్ జేశారు. ఆ తరవాత సెకండియర్ డిస్కంటిన్యుజేసి తరువాత తర్డియర్‌లో ఆ నెక్స్ట్ ఇయర్లో నిజాం కాలేజ్‌లో సెకండియర్ కంటిన్యుచేస్న. బి.ఎస్.సి నిజాంకాలేజ్‌లో కాని ఎగ్జామ్స్ మాత్రం మహబూబ్‌నగర్లనే రాసొచ్చిన. తరవాత ఎమ్మెస్సీ స్టాటిస్టిక్స్‌లో ఉస్మానియా యునివర్సిటీలనే ఎమ్మెస్సీ ఫస్టియర్ మొత్తం ఓ పదిరోజులు పేయింగెస్టుగా ఉండి, సెకండియర్ మొత్తం బి హాస్టల్ల ఉండి హాస్టల్లో ఉండి మొత్తం కంప్లీట్ జేసిన సవెంటీసిక్స్‌లో సెవెంటీఫైవ్ మే లో ఎమ్మెస్సీ

అయిపోయింది. సెవెంటీసిక్స్‌లో మైరేజ్ అయిపోయింది. ఫైవ్‌లో ఎమ్మెస్సీ అయింతర్వాత మా దేవరకద్రలోనూ అన్నయ్య ఒకటి అగ్రో సెలక్షన్లో బెట్టింటడు. దాంట్లో జాబ్ జేస్తుంటి అవర్క్ జూస్తుంటి. మేనేజర్‌గ అప్లయి రిసిస్టెన్స్ తర్వాత యయిటీ యయిటీ వన్‌లో బియెడ్ ఎగ్జామ్ రాసి కంప్లీట్ జేశాను. యయిటీటూ జూన్ల బియెడ్ అయిపోయింది. యయిటీ వన్ జూలైనుంచి స్కూల్లో టీచర్గ పనిజేస్తున్న ఆ తరవాత యయిటీవన్ నవంబర్ ల వేరే పోస్టొచ్చిందిక్కడ అప్పున్నించిక్కడ టీచర్గా పజ్జేస్తున్న. ఈ మధ్యన ఎక్స్‌ట్రాకరిక్యులర్ యాక్టివిటీసంటే కేవలం సమాజిక కార్య క్రమాల్లో పాల్గొనడం అంటే పాల్గొంటుంటి. వేరే ఎక్స్‌ట్రాకరిక్యులర్ యాక్టివిటీస్ ఏమ్ లేవు. అంటే నేను చాలా మటుకు ఎక్కువ వర్క్ చేసేది రాష్ట్రీయ స్వయం సేవక్ సంగ్‌లో పాల్గొంటూ ఉంటాను. బాగా జేస్తాను అంటే ఇవ్వేకొంచెం సోషల్ ఏక్టివిటీస్ ఉంటే అందులో పెళ్ళిళ్ళంటే ఇందూ కల్చర్ పయినే అయితయ్. మొదటి రోజు యెదుర్కోల్లజ్జేప్పి, యెదుర్కోల యింతర్వాత నెక్స్ట్‌డే, హిందూ కల్చర్ పైనే పెళ్లిళ్లయితుంటయ్. అంటే సామాన్యంగా బ్రాహ్మిన్ కల్చర్‌లో ఫస్ట్ పిల్లగాండ్ల వచ్చిం తర్వాత పిల్లగాండ్ల వాళ్ళను దీస్కోని వస్తరు. వరపూజల్ జేస్తరు. పిల్లగాని తండ్రి ప్రమాణాలు జేస్తర్. పిల్లగాణ్ని దీస్కొనొచ్చి కాళ్ళుకడిగి బట్టలిచ్చి, అక్కడ నిశ్చితార్థం అంతకుముందె నిశ్చితార్థం అయిపోయింది. అక్కడ కంప్లీట్‌గ అంతకు ముందు ఫార్మల్‌గ నిశ్చితార్థం అవుతుంది. అప్పుడు నెక్స్ట్‌డే పెళ్ళికి సంసిద్ధమ్. ఆ విధంగా చేస్తర్ నిశ్చయం చేసుకుంటరు. ఆ తర్వాత నెక్స్ట్ కార్య క్రమాలు పుణ్యావచానాలు అయితుంటయ్. అవన్నీ పెళ్లికోసం తయారీ చేస్కుంటర్. నెక్స్ట్‌డే యూజ్వల్‌గా పెళ్ళయితుంది. కంకణం గడ్తర్. మాంగల్య దారణవుతుంది. నాగవల్లయింతర్వాత పెళ్ళి పూర్తి అయితది. ఇంగ మన పెద్దవాళ్ళ ప్రకారమవుతే పదహారు రోజుల వరకు గూడ పెళ్ళి జేసేంద్రు. పదహారు రోజుల కార్యక్రమంలో పెళ్ళిజర్గింది. ఆ తర్వాత తగ్గు తగ్గుతూ మూడ్రోజులదాకొచ్చింది. ఇప్పుడు ప్రస్తుతానికయితె ఒక్క రోజులో అయిపోతున్నది. మొత్త మొక్కరోజులలోనే పెళ్ళి అయిపోతుంది. రాత్రస్తరు. పొద్దునె లగ్గమయితది. మర్సటి దినానికెళ్ళి పోతరు. ఆటల్లోలేను పాటల్లో నేను ఎక్వపాడలే.... ఊళ్ళ ఉంటె ఏ మాటలు ఇక్కడికచ్చింతర్వాతాటలే ఈ కబడీ వాలీబాల్ మాత్రమే ఎక్వ ఆడుకుంటుంటిమి. ఈ రెండాటలే ఎక్వ చాలా వరకు మాకు మా నాన్నగారు పోలీస్ పటేల్ల పనిజేసేవారు. మొన్న అబాలిషన్ అయేటల్కికూడ పోలీస్ పటేల్గనే ఉన్నారు. టవున్లో ఒక యస్సయి ఏ విధంగా లా ఎండార్డర్ మెయింటెన్ చేస్తడో ఆ విధంగా పల్లెటూళ్ళల్ల పోలీసోళ్ళు లెక్క ఉంటరు. అల్సోస్టైల్ లాఎండార్డర్ చూస్తడు. లాఎండార్డరు మెయింటెయిన్ జెయ్యాలని... కాలేజ్ లైఫ్ ఎంజాయ్‌మెంట్ ఉంటది. అందరికీ గూడ

ఒకేరకంగా ఉంటది. ఫ్రెండ్ సర్కిల్లో ఫ్రెండ్స్‌తో అందరికీ ఎక్కువ మొత్తం కాలక్షేపమ్ చేస్తుండె. చదుకునే లైఫ్ ఏందంటే , ఒక స్నేహితం అనేది ఉంటది. ఇక్కడి కొచ్చింతర్వాత సంసారమ్ లైఫ్ఐయితది. అక్కడ స్నేహితులతో ఎక్కువ మొత్తమ్ గడుపుతమ్. ఇక్కడికొచ్చి సంసారంతో ఎక్కువ మొత్తమ్ గడుపుతమ్. దీనికి దానికీ బేదమ్ అదన్నట్టు. అంటే ఈ చుట్టు పక్కల జరిగే జాత్రలకు మన్నెంకొండ అనేది కొంచెం గొప్పది. పది పదేను రోజులు జర్గుతది. జాత్రనడుస్తది అక్కడ మారుమూల పల్లెల నుంచి వస్తరు. ఇక్కడ డేరాలవన్నీయేస్తరు. దేవరకద్రరూట్ల ఉన్నది. అక్కడ తొల్తరోజు అక్కడ గట్టుపయిన వెంకటేశ్వర స్వామి విగ్రహం ఉంది. దేవుడు వెంకటేశ్వర స్వామి అక్కడ రదోత్సముయితది. అక్కడ పెద్ద మైదానం ఉంటది. మైదానం నుంచి రదాన్ని లాగుకొని వస్తర్. సంక్య చాలా పెద్ద మొత్తంలో ఉంటుంది. చిన్న పిల్లలయితే దీన్ని దిగుతరా ఇట్ల నెట్టి నమ్మకం ఉన్నది. ఉత్తరోజు వస్తమనికూడా అన్కోవచ్చు. అంతరష్షుంటుంది. ఆరదోత్సవం అయింతర్వాత రోజు వారిగ పదిహేనురోజులు నిత్య పూజలయితమ్. దాదాపు హయిద్రాబాదు నుంచికూడ వస్తర్. వస్తుంటరు మొదటి మూడు నాల్గు రోజులయితే, ట్రయిన్లల్ల గూడ వస్తరు. ట్రయిన్ టాప్ మీద కూసొని, అట్ల పదముడ్రోజులట్ల పశువుల సంత సాగుతది. ఈ చుట్టు పక్కల ఉన్నటు వంటి అన్ని విలేజెస్ నుంచి కూడ పశువులొస్తయ్. అమ్మడానికీ కొనడానికి గూడా చాలా మంది వస్తరు. చాలా పెద్ద జాత్ర అది. ఈ ఏర్యాలో పది పదేను రోజులు జర్గేది. దాంతర్వాత నెక్ట్స్ జాత్రంటే ఈ జిల్లాల గద్వాల దగ్గర అదీ ఇదే టయిమ్‌లో జరుగుతుంది. గద్వాల్ జద్చర్ల ఆ రెండు జాతర్లు గూడా దాదాపు మన్నెంకొండ జాత్ర టయిమ్‌లోనే జర్గుతుంది. అక్కడ గూడా ఈటయిమ్‌లో క్రయవిక్రయాలు బాగా నడుస్తుంటయ్ పశువులయి. పశువులంత గూడ బాగా నడుస్తయ్. ఆ తర్వాత మన్నెంకొండ దాటిం తర్వాత ప్రాముఖ్యం ఉన్నది కురుమూర్తండీ. యమ్మపూర్ రూట్ల ఉంటుంది. యమ్మపూర్ దగ్గిరే కురుమూర్తి జాత్ర. అక్కడ నాల్గు రోజులు మంచిరష్గ ఉంటుంది. అక్కడ దాదాపు ఈ నెల పందొమ్మిది, ఇర్వయి ఆ ప్రాంతంలో స్టాటవుతుందను కోండి. అక్కడ గూడ చుట్టు పక్కల ఉన్నటు వంటి విలేజెస్ నుంచి పాలమూరు జిల్లాలో ఫిఫ్టీ పర్సంట్ వస్తరు. అక్కడ పశువుల జాత్రజర్గుతుంది. అక్కడ పది రోజుల వరకు మంచి రష్షుంటుది. జాత్రలు ఇక్కడ చాలానే ఉన్నయ్. చెప్పాలంటే ఆత్మకూర్, కురుమూర్తి, బిజినేపల్లి, గంగాపూర్ గద్వాల్ నెకరేకల్ అన్నిచోట్ల జాత్రలు నడుస్తయ్ అన్నిట్లల గూడ ఏందంటే దీంట్లో చాలామటుకు పశువులక్రయ విక్రయాలు చాలా ఉంటయ్. గంగా పూర్లేంటి, లింగా పూర్ల గూడ పశువులు చాలా అమ్ముడుబోతయ్.

గంగాపూర్ మన్నెం కొండ కురుమూర్తి ఇవన్నీ పశువుల యొక్క క్రయ విక్రయాలు నడుస్తయ్. మిఠాయంగళ్ళు మామూలంగళ్లు, చిన్న చిన్న వస్తువులు, బొమ్మలు చిన్న చిన్నవి పిల్లలాడుకోనే బొమ్మలు గూడ ఉంటయి. అంటే ఇక్కడ అడ్వీ ఏర్యా చాలా తక్వ కాబట్టి పశువులు పెంచుకోవాలన్జెప్పి అంటే పశువులను పెంచే అంత బిజ్నెస్... పెంచి, అమ్మే బిజ్నస్ తక్వ. కేవలం పెంపకం అమ్మకం మాత్రమే ఉంటది. ఇప్పుడు అచ్చంపేటుంది. అచ్చంపేట్ అమ్రాబాద్‌ల అడ్వులున్నయ్. ఆ ఏర్యాల. పశువులు చాలా బోతయ్. ఈ ఏర్యాల పెంచడానికి వీలుండదు. కేవలం వ్యవసాయ విషయంల దృష్టితోనే బెంచాలి. కాని వ్యవసాయానికి అమ్ముడుకాదు. కాని అమ్మడానికి మాత్రం రాదు. వేరే అడ్వియేర్యాల లేదు. ఇంతకు ముందు దాదాపు ఈ గుట్టల ప్రాంతంలన్ని గూడా మేపడానికి ఉండేది. ఇప్పుడుజూస్తే దాదాపు యాభై శాతం గూడా వ్యవసాయం జేస్తున్నారు. గుట్టల ప్రాంతం గూడా సాఫ్ జేస్తుంద్రు. కాబట్టి మేపడానికి స్తలమ్ ఉండదు కాబట్టి ఎవరుగూడ తమకు కావలసినంత వరకె పశువులుంచి మిగత గూడ దీసిపడేస్తరు. కాని దాదాపు ఈ మెట్టప్రాంతంలో పన్జేసే వాళ్లంతా ఈ జొన్న సజ్జ ఇయన్నీ సాగు జేసే వాళ్ళు సీజన్లల్ల పశువులనుంచుతర్. వర్షకాలం మొదలవుతుంది. వర్షాకాలమ్ మొదలయ్యే ముందు పశువులను గొంటరు. మన్నెంకొండ జాత్రల పశువుల క్రయ విక్రయల కారణమేందంటే అది జన్వరి ఫిబ్రవరి ప్రాతంల వస్తది. మార్చి ఎండింగ్ వరకాజాత్రయిపోతది. ఆ ప్రాంతంల పశ్వులు కాని ఉంటే ఈ వేసవి కాలంలో ఉన్నప్పటి చిక్కులన్నీ విడగొట్టి తయారుచేస్తరు. పొలాలన్నీ రొప్పుకుంటరు. దున్నుకోని తయారుచేస్తరు. వర్షాలొచ్చేప్పుడు ఫస్టు తొల్కరి మాసంలో పెట్టుకొని ఇత్తుకోని ఆపనయిపోయింతర్వాత అమ్మేస్తర్నుమాట కొని మళ్ళి అమ్మేస్తే ఈ మధ్య కాలం ఉంటది గద ఎట్లంటే సెప్టెంబర్నుంచి ఈ మళ్ళీ ఫిబ్రవరి మార్చి వరకు వాటిని మేపే పనుండదు. మేపడానికి పనులు దగ్గిపోతాయి. అవి చిన్నప్పుడంటే ఎక్కడంటే అక్కడుంటయ్. కాబట్టి వ్యవసాయం దృష్ట్యా అదేందంటే మేలి పనులుంటే అమ్ముకునే అవసరముండదు. ఆ మేలిపనులు కాబట్టి అవసరమ్ ఉన్నప్పుడు కొంటారు మళ్ళీ అమ్మేస్తారు. ఇక్కడ బీదవాళ్ళకు పనికొచ్చే క్రాపంటే జొన్న. అ తరువాత వరి కొంత పల్లిక్రాప్ గూడ. ఈ మధ్యనే వేస్తున్నరు. ఫిఫ్టీయర్సుంచి మాత్రమే పల్లి అంతకుముందుయితే జొన్న వరి సజ్జ రాగి ఇవే. రొట్టె ఎక్కువ వాడతమ్ మిడిల్ క్లాస్‌లయితే అన్నమ్ ఎక్కువ వాడతర్. లోక్లాస్ ఫామిల్సయితే రొట్టె అదిగూడ జైదరొట్టె ఒక జైదంబలి గురించి పౌష్టికంగా ఉంటుందని చెప్పి ఎక్వ వాడుతుంటరు. ఈ జిల్లాలో ప్రముఖంగా చెప్పుకోదగిన

నాయకుడంటే ఇక్కడ లేరు. ఇది గుట్ట ప్రాంతం ఒకటి, ఇరిగేషన్ వనరుల్లేవు. దాదాపు మొత్తం జిల్లాలనే ఎక్వ బాగంల ఒక నది ప్రవహిస్తున్నది. కాని ఇరిగేషన్ తక్వ. బీమా నది ఒకటుంది కృష్ణానదొకటుది. మహబూబ్‌నగర్లనే ఎక్వప్రవహిస్తున్నది. ఆ కృష్ణానది ప్రవహిస్తున్నా ఆ వాటర్ ఈ జిల్లాలో తక్వ ఏర్యల మాత్రమే పంపయితయండి. పెద్ద ఏర్యా అంతా కోస్తా జిల్లాకే పోతది. మన మహబూబ్‌నగర్‌కు మాత్రం చాలా తక్కువ. కినాల్స్ లేవు ఇక్కడ. కాబట్టి తొల్త నుంచి కూడా మహబూబ్‌నగర్ను లేబర్ క్లాస్‌గానే పరిగణించబడింది. పెట్టుబడి గూడా వ్యవసాయమ్ మీద లేదు. కొంత ఏర్యాలో ఇంతకు ముందు సీలింగ్‌కు గానీ. అయిరాకముందు హండ్రెడ్స్ ఆఫ్ ఎక్రాలుండేవి. ఈ మధ్య అందరిగూడ యాబై అర్వయ్యెకరాల కంటె మించిలేదు. ఎక్కువేంలేదు. అందుకే దాదాపందర్గూడి చాలా మటుకు వ్యవసాయం ఎరిగిన వాళ్ళుమే, మోస్టాఫది పీపుల్... నేను సెవెంటీసిక్స్ నుంచీ ఎయిటీ వరకు దాదాపు దగ్గర దగ్గర్నే ఉన్న అక్కడెందర్తో సొంతంగా వ్యవసాయదార్లతో దాంతరువాత ఏజెంట్స్‌తో సంపర్కం ఉంది. దాంతో వాళ్ళతో సంపర్కమ్ ఉన్నది. దాంట్లో ఎమయితదంటే.... అపారమైన అనుభవం అయింతర్వాత ఎనబై ఎనభయ్యొకట్లో బిఎడ్ కంప్లీట్జేసి ఫస్ట్ చర్గ అప్లికేషనిచ్చాను. ఇచ్చినంక నాకా స్కూల్లో అపాయింట్‌మెంట్ ఆడరొచ్చింది. ఫస్టొచ్చినప్పుడు ఇంగ్లీష్ మీడియమ్ స్కూల్లె వొచ్చింది. నాకేమొ ఈనాల్గు సంవత్సరాల గ్యాప్‌లో దాదాపు ఇంగ్లీష్ మీద కమాండ్ పోయింది. ఇంగ్లీష్ మాట్లాడే కష్టమ్‌గుంది. పల్లెటూరొళ్ళతో సంబంద బాందవ్యాలు ఎక్కువ. దాదాపు పల్లెటూరి వాతావరణానికి అలవాటు పడ్డాను. ఈ స్కూల్లో ఏ విధమ్‌గా గెటాన్ కాగల్గుతనా అన్జెప్పి ఒక భయం ఉండేది. ఫస్ట్‌ఫస్ట్ ఆ భయమ్ కొన్రోజుల వరకట్లనే ఉన్నది. కొన్రోజుల వరకు ఏం మాట్లాడినా సరే తూచి తూచి మాట్లాడటం, ఏదయినా మాట్లాడతా ఉంటే జంకుగా మాట్లాడటమ్ స్టాటయింది. కొన్రోజుల తర్వాత ఏ ప్రకారంగానయినా కల్సిపోవడమ్. ఎప్పుడయితే నాకు నా వృత్తికి అనుకుంటెదుంటే వృత్తి పరంగా వృత్తికి నేను న్యాయమే చేకూరుస్తున్నానుకుంటున్నాను. ... ఆ తర్వాత స్కూల్ విషయమ్‌ల వస్తే, స్కూల్లో చాలా పెద్ద స్కూల్లది. పదేనువందల వరకు స్ట్రెంతుండె. ఇక్కడ కోయెడ్యుకేషనుంటుంది. టీచర్లు కూడా దాదాపు నలభై మంది దాకా ఉన్నారు. ఇంతా యెల్కేజీ నుంచి టెన్త్ క్లాస వరకు మొత్తమ్ అంతా గూడా ఇంగ్లీషు మీడ్యమే. స్కూల్లో వర్క్‌లోడు బాగుంటుంది. దాదాపు ప్రతిరోజు ఆరు పీర్యెడ్లు మేం చెప్పాల్సిందే ఒక్కోరోజు ఏడు పీర్యెడ్లు చెప్పాల్సి వస్తుంది. వర్క్‌లోడున్నప్పటికీ స్కూల్లో ఉన్నటు

వంటి ఆ టీచర్స్ లో ఉన్నటు వంటి కోపరేషన్ ఒకరుతో ఒకరు సంబంద బాందవ్యాలు ఎట్ల ఉన్నయంటే అంతపన్జేసేటప్పటికి సాయంత్రమ్ నాలుగయిందంటే, ఒకరి ల్యాగ్జేషన్ ఫీలయితరు. ఏంటంటే, ఒకరుతో ఒకరు మంచిగుంటరు. మాలో ఒకరి మధ్య ఒకరి కోపరేషన్ ఉంటుంది. ఆ కోపరేషన్ వల్ల మాలో పెద్ద అసూయ అనేది కనిపించదు. నేను చాలా వరకు చూస్తుంటాను . వేరే స్కూల్ టీచర్స్‌కూ మాకూ కంపేర్ చేస్తే, ఈ స్కూల్ టీచర్స్ పన్జేస్తరా అనేది అనుమానం వస్తది. అట్లన్పిస్తది. అంటే పని చాలా ఉన్నది. ఆ టీచర్ల మధ్య ఉండే కోపరేషన్ వల్ల వాళ్ళెక్కువ ఫీల్‌గారు. వాళ్ళంతట వాళ్ళు వీళ్ళంతట వీళ్ళు, ఎవరంతట వాళ్ళు గిరిగీసుకుంటరు గాబట్టి వాళ్ళందరూ ఫీలయితరని అన్పిస్తది. ఇంతమందున్నప్పటికీ ఇంతస్ట్రెన్తున్నప్పటికీ మా కన్పిస్తుందంటే, ఒక ఇంటి వాతావరణమ్ స్కూల్ల కన్పిస్తది. పిల్లల్తో ఉన్నప్పటిగ్గాని టీచర్స్‌తో ఉన్నప్పటిగ్గాని ఇంట్లనే ఉన్నమేమొ అనే ఫీలింగ్ మాకొస్తది...

# మాండలిక పద (బంధ) కోశం

| | | |
|---|---|---|
| అక్కిడి/అక్కిలి | = | వేర్వేరు పప్పుదినుసులు వేసుకోవడానికి చాలు; మిశ్రమ వ్యవసాయం |
| అగత్యంగా | = | తప్పక |
| అగసాల/అవసాల /ఔసల | = | కంసాలి |
| అగా | = | తాకట్టు |
| అంగడి | = | కొట్టు, సంత |
| అంగన్లు | = | దుకాణాలు |
| అంగళం (< అంగణం) | = | ముంగిలి |
| అంగిడి/అంగడి | = | సంత |
| అగ్గవ/అగ్వ | = | చౌక |
| అచ్చి/అప్పచ్చి | = | పిండివంట |
| అటెంకల | = | ఆ తర్వాత |
| అట్క | = | కూరచేసే కుండ |
| అడ్డగోలుగా | = | క్రమంలేని విధంగా, అస్తావ్యస్తంగా |
| అండా /హండా | = | పెద్దకాగు |
| అండ్ల | = | అందులో |
| అత్తెలు | = | గోధుమ పిండి ఉండలు |
| అత్ర/హత్ర | = | దగ్గరగా |
| అదన/అదను | = | సరయిన కాలం |
| అద్దంగట్టు | = | ఫ్రేంకట్టించు /వేయు |
| అద్దతలు | = | వస్తువులు (బట్టలకు సంబంధించినవి) |
| అద్దశేరు | = | శేరులో సగ భాగం |
| అన్ల | = | అందులో |
| అబి | = | మొదటి పంట |
| అమాని /అమానీ | = | ప్రభుత్వం |
| అమీన్‌కచేరీ | = | పోలీసు స్టేషన్ |

అమ్మరి (<అంబలి) = పిండితో చేసిన గంజి

అయవారు / అయ్యవారు / అయ్యోరు = పంతులు, టీచర్, పురోహితుడు

అయినాతి = ప్రధానమైన

అరకువ = జీర్ణం

అరాయ్ = అగ్నిగుండం చుట్టూ తిరిగే ఆట

అరువు/ అరివు/ అరివి = తెలివితేటలు

అల్కన = తేలిక

అల్క (వరి-) = చల్లు, నాటు

అవిటిని = వాటిని

అసుంటి = అటువంటి

ఆగమవు = తప్పిపోవు

ఆగే / హాగే = అట్లానే

అలావున్న = అక్కడ

ఆబ్కారీ = ఎక్సైజ్ సుంకం

ఆయకం = తాకట్టు

ఆయం = ఇంటి కొలతలు

ఆర్సీలు = కళ్ళద్దాలు

ఇక్సాల్‌నామా = డబ్బు వివరాల పట్టీ

ఇగుంట/ ఇసుంటరా = ఇక్కడికిరా!

ఇగ్గు = లాగు

ఇంగితం = విచక్షణ

ఇంగ్లం = నిప్పు

ఇచ్చకాలు = ముఖస్తుతి

ఇన్లు = ఇళ్ళు

ఇబూతి = విభూతి

ఇలాత్‌కాయ (<విలాయత్) = వేరుశెనగకాయ

ఇల్లారి = బూజు

ఇసం = చెడువు

ఈనం = హీనం

| | | |
|---|---|---|
| ఈర పట్నం | = | ఇబ్రహీం పట్నం |
| ఉగ్గాణి/ఉగ్రాణి/వగ్రాణి/ (<ఒగ్గరణె) | = | తిరగమాత, తాలింపు వేసిన అటుకుల ఉప్మా |
| ఉచ్చ | = | మూత్రం |
| ఉడ్కు | = | వేడి |
| ఉర్ది | = | ఇష్టం |
| ఉర్దీ (< ఉజ్జీ) | = | సరిజోడు |
| ఉద్దెర | = | అప్పు |
| ఉప్పలాయి | = | బొటన వేలుకు చూపుడువేలు మధ్య ఉండే ప్రదేశం |
| ఉబ్బసం | = | ఆయాసం |
| ఉరుకు | = | పరిగెత్తు |
| ఉర్సు | = | ముస్లిం ప్రవక్త స్మారకంగా జరిపే ఉత్సవం. |
| ఊకిపోవు | = | ఊడిపోవు |
| ఊకె | = | ఊరికె |
| ఊర్బిండి (<ఊరుబిండి) | = | ఉప్మా |
| ఊరోల్లు | = | పల్లెటూరి వాళ్ళు |
| ఎక్కబుడ్డి | = | దీపంబుడ్డి |
| ఎక్వ/ఎక్క | = | ఎక్కువ |
| ఎచ్చులు | = | గొప్పలు |
| ఎడవు కొను | = | తట్టుకొను |
| ఎడ్డెం (మాటలు) | = | వంకర |
| ఎణుసు | = | ఎంచు |
| ఎతిమీనార్గ (<ఎతిమినాన్గ) | = | తిరిగ్గా |
| ఎత్తురోడవు | = | పరాయి ఊరి వాడివి కావు |
| ఎదురు కోళ్ళు | = | ఎదుర్కోవడం, ఎదిరించడం |
| ఎనికెలు (<ఎంట్రుకలు) | = | జుట్టు |
| ఎనుములు | = | గేదెలు |
| ఎన్కకారి (<వెనకసరి) | = | తర్వాత |
| ఎంపగొడ్డు | = | బర్రెగొడ్డు |

| | | |
|---|---|---|
| ఏకజాం | = | తెల్లవారుఝాం |
| ఏగిన కోమటి | = | అన్ని విధాల అనుభవాలు ఉన్నవాడు |
| ఏణి | = | నిచ్చెన |
| ఏర్పాటు | = | తెలుసు, తెలియు |
| ఒక్కటిగ్గు | = | ఒక్కటి కొట్టు |
| ఒక్రేణి | = | వగ్రాణి |
| ఒప్పు | = | అంగీకరించు (వ్యతిరేకంలో - ఒప్పను) |
| ఒయ్/వయ్ | = | పుస్తకాలు |
| ఒల్లె (<వల్లె) | = | 'సరే', అంగీకారం |
| ఓగు | = | వాగు |
| ఓగెం (<యోగ్యం) | = | అర్హతగలది /సరయింది |
| ఓడపని /గేండ్లపని | = | తాపీపని |
| ఓడు | = | పరిగెత్తు |
| కక్కాయ | = | చిన్నాయన |
| కంక | = | వెదురు |
| కంజని/కందని | = | కందెన |
| కట్కా | = | మీట, స్విచ్ |
| కట్టాయం/కడ్డాయం | = | తప్పని సరి |
| కండషక్కర | = | కలకండ |
| కతల్‌ముకద్దమా | = | హత్యకేసు |
| కందిల్ | = | లాంతర్ (చార్‌కందిల్ - కళ్ళద్దాలు పెట్టుకున్నవాడు) |
| కన్లు /కళ్ళు | = | కళ్ళకలక (ఆనికి కన్లయినయ్) |
| కమురు | = | మాడు వాసన |
| కరగాసాలు ?(<క్రకచం) | = | రంపాలు |
| కరంగె | = | సరయిందే |
| కర్సా | = | చాలాకు |
| కల్లులొట్టి | = | కల్లుకుండ |
| కసవు/కసువు | = | చెత్త |
| కాగిత | = | ఉత్తరం |

| | | |
|---|---|---|
| కానా | = | రోడ్డుమీద నడవడానికి కట్టిన కట్ట |
| కాయకం | = | అల్లరి |
| కారువాయి | = | వ్యవహారం |
| కాలంచేయు | = | మరణించు |
| కాలుండేవాడు | = | వేగం ఉన్నవాడు |
| కాయకం | = | అల్లరి |
| కాళ్ళు పాడవగు | = | తన్నడానికి వచ్చు |
| కాస్త | = | సొంతం |
| కిరాయ్ | = | అద్దె |
| కిలుము | = | చిలుము |
| కిస్కింత | = | కొంచెం |
| కిస్తీ | = | వాయిదా |
| కీసె/కిసురు | = | జేబు |
| కుత్తికె | = | గొంతు |
| కురుపు | = | పుండు |
| కులాయించు | = | తెరువు |
| కుల్లాచెప్పు | = | స్పష్టంగా వివరించు |
| కువ్వాడం | = | పరిహాసం, గేళి |
| కూనం | = | గుర్తు |
| కూర్పాట్లు | = | కునికిపాట్లు |
| కేరి (బ.కేర్లు) | = | వీథి (బ. వీథులు) |
| కొంచబోవు | = | తీసుకుపోవు |
| కొట్టిడి (< మ.కొరడీ) | = | గది |
| కొడువు | = | విదిలించు |
| కొండబో /కొంచబో | = | తీస్కొనిపోవు |
| కొనెంగ/కొండెంగ | = | కొండముచ్చు. |
| కొప్పెర గోలుగ | = | పూర్తిగా, నిండుగా |
| కొలువు | = | జీతం |
| కోడిగం | = | పరిహాసం |
| కోదెం | = | విచారం |

| | | |
|---|---|---|
| కోర | = | బకెట్, బావినుంచి నీళ్ళు తోడటానికి ఉపయోగించే సాధనం |
| ఖరనా! | = | నిజమా! |
| ఖరా | = | నిజం |
| ఖైరాతీఇనాం | = | బ్రాహ్మలకిచ్చిన మాన్యం |
| గంటు | = | ముడి, బొడ్డు (గంటుకదిలింది) |
| గండు, గండ | = | మగ |
| గద్ద | = | చిన్నపిల్ల |
| గద్వ/గద్మ | = | గడ్డం |
| గలీజ్ | = | చెడు (అశుచిగా ఉన్న పదార్థం) |
| గవాచి (<గవాక్షం) | = | కిటికీ |
| గసుంటి/గస్వంటి | = | అటువంటి |
| గారపోతు | = | సింహానికి /పులికి ఎర |
| గాసగాడు | = | జీతగాడు |
| గిచ్చులు/పిచ్చులు/పిక్కలు బిచ్చులు | = | గింజలు, బిళ్ళులు |
| గిల / గిల్లి | = | కర్రాబిళ్ళా |
| గిల్లకట్టె | = | జిల్లాకోడు |
| గుంజు | = | లాగు, ఇగ్గు |
| గుటికెడు | = | గుక్కెడు |
| గుడుమబొంద | = | (నడుమ) పిల్ల |
| గుడ్లు తేలేయు | = | అశక్తుడవు |
| గుడ్లు వెళ్ళబెట్టు | = | కోపంతో చూచు |
| గుండీ | = | బటన్, బొత్తాము |
| గుండ్ల పోచలు | = | స్త్రీల ఆభరణం |
| గుత్త | = | ఒప్పందం, కంట్రాక్టు, కౌలు |
| గుత్ప | = | గుదికర్ర |
| గుంత | = | గుంట, గొయ్యి |

| | | |
|---|---|---|
| గున్నప్పుడు | = | చిన్నప్పుడు |
| గుప్తి | = | చేతికర్రలోని కత్తి |
| గుమాన | = | అనుమానం |
| గురిపిణకలు | = | గట్టిది |
| గుల్బ / గోల | = | బల్బు |
| గూన | = | ఎడ్లు నీళ్ళుతాగే తొట్టి |
| గెట్టు | = | మెట్ట పొలంలో ఉండే అడ్డుకట్ట |
| గెడెం | = | నాగలి |
| గెంటిపోచ | = | స్త్రీల అభరణం |
| గెల్క | = | వెతుకు |
| గేర్లు | = | గీతలు |
| గొంగ్డి | = | కంబళి |
| గొట్టంగోలీ | = | కాపుల్యాల్ |
| గొండెలు | = | జడ కుచ్చులు |
| గొత్తు | = | తెలుసు |
| గొల్కలు | = | గుత్తులు |
| గొల్లగోడు | = | తెలుగు వంకర |
| గోడుంబి | = | జీడిపప్పు |
| గోరల్ జిమ్ముడు | = | వాగులో కాల్వలు తీయడం |
| గోళంబి | = | ముంతమామిడి |
| చద్దర్లు | = | దుప్పట్లు |
| చప్పజవి | = | రుచి లేకుండ |
| చప్పసరుకు | = | కారం లేని |
| చల్క / చెల్క | = | ఉప్పునేలలు |
| చాలీస్ / చాలీసా | = | కళ్ళద్దాలు |
| చినవాడు | = | బ్రహ్మచారి |
| చిన్ని | = | పిన్ని, తల్లి సోదరి |
| చింతకాయతల | = | జడలు కట్టిన తల |

| | | |
|---|---|---|
| చిమ్నీ | = | బుడ్డిదీపం |
| చియ్య | = | తునక |
| చిరాగ్ | = | దీపం |
| చీమ కళ్ళు | = | చిన్నకళ్ళు |
| చీరైక అవు | = | (స్త్రీకి) రెండో పెళ్ళి అవు |
| చెట్టచే బియ్యం | = | చెరగనిబియ్యం |
| చెడ్డచేదు | = | అతిచేదు |
| చెండు | = | (పూల) బంతి |
| చెలకలు | = | పార |
| చైనాలు | = | పట్టాగొలుసులు |
| చౌళేకాయలు | = | గోరు చిక్కుడుకాయలు |
| జగ్గ | = | బెరడు |
| జగ్గి | = | పైకి, బిగ్గరగా |
| జంకె | = | మద్దెల |
| జంత్రి | = | క్యాలండెర్, పంచాంగం |
| జందెంపోచ | = | జంధ్యం, యజ్ఞోపవీతం |
| జప్పున | = | తొందరగా |
| జమాబందీ | = | (పొలాలకు సంబంధించి) ఆదాయ/వ్యయలెక్కలు |
| జర్ర | = | కొంచెం |
| జర్రుమను | = | అసహ్యాను కరణం |
| జల్దిచ్చింది | = | జలదరించింది |
| జవిరి చూడు | = | పట్టిచూడు |
| జాగా | = | చోటు |
| జాతర | = | తిర్నాల |
| జాయయ్య | = | తండ్రి తండ్రి, తాత |
| జాయి/జాయమ్మ | = | తండ్రి తల్లి, నాయనమ్మ |
| జారాడు | = | మోరీ |

| | | |
|---|---|---|
| జిన్నుగిర్నీ | = | వడ్ల గిర్నీ |
| జిలకర్ర పోచ | = | జీలకర్ర |
| జివిలి | = | గుబిలి |
| జిష్టిపూసదితి | = | దిష్టిపూసలు |
| జుమికీలు/జుమ్కీలు | = | బుట్టలు |
| జూట (< ఝూట) | = | అబద్ధం |
| జోకుడు | = | తూకం |
| జోగు | = | దేవత పేర బిక్ష |
| జోపు | = | కొట్టు |
| జోయ్ర | = | జల్సా |
| జోరా | = | గొంగడి |
| జోరుండు | = | తీరికలేకపోవు |
| టిక్కీపోచలు | = | ఆభరణాలు |
| డక్కుమను | = | భయంవేయు |
| డలకరం | = | పుష్టిగా |
| డాగు | = | మరక |
| డావు | = | వడ్డాణం |
| డుకడుకమను | = | ఎడతెగని భయానుకరణం |
| డోంగులు | = | మోసాలు |
| డోంగే | = | పెద్ద గరిటె |
| ఢక్కుమను | = | భయంకలుగు |
| తక్వ | = | తక్కువ |
| తగవు/తగూ | = | కొట్లాట |
| తట్టు | = | గోనెసంచీ / గోనెపట్టా; వైపు (మాతట్టు) పాడుపుకథ (< తట్టే) |
| తప్పెటముఖం | = | వెడల్పుముఖం |
| తబాదిలా | = | బదిలీ |
| తంపు | = | తడి |

| | | |
|---|---|---|
| తరి | = | మాగాణి |
| తర్కారీ | = | కూరగాయలు |
| తలె/ తల్లె | = | కంచం |
| తాటు/ తట్ట | = | కంచం / పళ్ళెం |
| తాతకాయ | = | పెద్దగోలీ |
| తాతకు సద్దికొని వెళ్ళు | = | మరణించు |
| తాంబాణి/ తావండి | = | పెద్దబేసన్ |
| తాళం బుఱ్ఱ | = | తాళం |
| తాళీ (< థాళీ. మరాఠీ) | = | ప్లేటు |
| తిండి | = | టిఫిన్ |
| తినబెట్టు | = | తినిపించు |
| తీగపోచ | = | స్త్రీ ఆబరణం |
| తుకం | = | (వరికి మాత్రం) నారు |
| తుట్టి పెదవులు | = | లావు పెదవులు |
| తుష్ట | = | గొర్రె బొచ్చు |
| తుమ్మతుల్ల | = | (అత్యర్థంలో) |
| తూతుల్ల | = | (అత్యర్థంలో) |
| తొక్కు | = | పచ్చడి |
| తొందర | = | ఇబ్బంది, కష్టం |
| తొయ్యించు | = | తవ్వించు |
| తోకపీకు | = | వెళ్లిపోవు |
| తోకబారు | = | ఒకదాని వెనక ఒకటి |
| తోకూపు | = | లోకువై పోవు |
| తోడెం | = | కొంచెం |
| దాదాసాబ్ | = | పెద్దవారు / డాక్టర్ సాబ్ (సంబోధనలో) |
| దిండు | = | తలగడ |
| దీవెలు వెళ్ళుబోయు | = | దరిద్రంగా వినిపించు |

దుక్నం = కొట్టు
దుగూడు = ఇంటి మధ్యలో గూడు
దుడ్లు = డబ్బు
దుత్త (< దుహిత) = పిల్ల, కుండ
దుంప గడుపు = తామసప్ర వృత్తి ఉండేవాడు
దేవులాడు = వెతుకు
దేసకు (< ధ్యాసకు) = జ్ఞాపకానికి
దొడ్డు = పెద్దది
దొబ్బెడు = చాలా
దొబ్బెడు మంది = చాలా ఎక్కువ మంది
దొల్కలు = పల్టీలు కొట్టడం, పరీక్షలో పెయిల్ కావడం
దోన్లు = నీళ్ళు పడే గొట్టాలు
దోషం = దుష్టజ్వరం
ధారణం = వేడిమి
ధ్యాసంచేసు కొను = గుర్తు చేసుకొను
నడిగడ్డ = గద్వాలకు మారు పేరు
నడ్మీతర = నడిమధ్య
నవుకరి = ఉద్యోగం
నస్కుళ్ళ = పొద్దున
నూకు/ఊకు = ఊడ్చు
నూనె ముంత ముఖం = నల్లగా ఉండి జిడ్డోడుతున్న మొహం
నెర్రి/నెర్రె/పర్రె = పగులు
పగటింతల/పగటేడి = పగటిపూట
పటుగడుపు = దిట్టంగా తినేవాడు
పట్వ = చిన్నకుండ

పడుగులు = నడుము కిందిభాగం

పణ = నుదురు, నొసలు

పత్ల = పల్చన

పత్తా = చిరునామా

పత్తాలు = ఇస్పేటాకులు, ప్లేయింగ్ కార్డ్స్

పనాయి = తాయిలం

పరక/పొరక = చీపురు

పరిగడుపు = ఏమిూతినని కడుపు

పరేశాన్ = చిరాకుపడు

పర్రె = పగులు

పాపనం = చదును

పయుమన్నం = పరనాన్నం/పరమాన్నం
(< పాయసమన్నం)

పాశెం = ,,

పిట్ట-ఈఃసినట్లు = గున్నగీకినట్లు

పిచ్‌డి = కొప్పు అలంకారం

పుక్యం ?(< పుణ్యం) = ఊరికే

పుండి/పుంటి = గోంగూర

పునుకనెత్తి = పుర్రెలాకనిపించే తల

పురికోన/పురికొస = సుతిలీతాడు

పురుగుతాకు = పురుగుకరుచు

పులకరం = జ్వరం

పుల్లబుడ్లు = పుల్లగా

పుసాటు/పుకాటు/పుకట్ = ఉచితం

పూంద్రం = పూర్ణం

పూల్ = బ్రిడ్జీ

పెరుగుబొడ్డిమొకం = పడిసెంతో ఉన్నవాడు

| | | |
|---|---|---|
| పెల్లలు | = | (ఇటుక) ముక్కలు |
| పేష్కార్ | = | సూపరింటెండెంట్ |
| పొక్కిలి | = | చిన్నగుంటలు |
| పొట్టిగిప్ప | = | గిత్త |
| పొట్టెగాడు | = | పిల్లగాడు |
| పొద్దటింతల/పొద్దటేడి | = | పొద్దున్నే |
| పొద్దుపోవు | = | ఆలస్యం అవు |
| పొద్దుతానం | = | రోజంతా |
| పొరుజు | = | కట్టెపొట్టు |
| పొర్క | = | చీపురు |
| పోయెదవ్వడె | = | పోయినదే తడవు |
| పోరి | = | పిల్ల, అమ్మాయి |
| బగోండి/బగోన/బగోని | = | అన్నం /కూర చేసే పెద్దగిన్నె |
| బగ్గ | = | బాగా |
| బచ్చిట్టుకొను | = | దాపెట్టుకొను |
| బటాయ | = | కౌలు |
| బద్వ | = | దుడ్డుకర్ర, పనికి మాలిన వాడు అనే అర్థం (నిందార్థం) |
| బడ్స | = | గరుకు |
| బద్‌నియత్ | = | దురభిప్రాయం, నిజాయితీ లేకపోవడం |
| బబ్బుర్లు/ బెబ్బుర్లు/ బొబ్బుర్లు | = | అల్సందలు |
| బరిగాళ్ళు | = | చెప్పులులేని కాళ్ళు |
| బరిబత్తల | = | నగ్నం |
| బర్రెటెంకలు | = | పక్కటెముకలు |
| బర్రెపళ్ళు | = | వెడల్పు దంతాలు |
| బరే | = | ఒట్టి, ఉత్తగా |
| బల్‌గాగ | = | ఎక్కువగా |

| | | |
|---|---|---|
| బస్వీరాండ్రు | = | సిడికి కట్టిన స్త్రీలు |
| బాకీ | = | అప్పు |
| బాకీనోరు | = | వెడల్పు ఉన్ననోరు. |
| బాట | = | రోడ్డు, రహదారి |
| బారుకోళ్ళు | = | చేతి కర్ర |
| బాళేపండు | = | అరటిపండు |
| బిజ్జోడు | = | పిసినారి |
| బిస్తరు | = | పరుపు, పక్క |
| బీగం | = | తాళం చెవి |
| బీం | = | బియ్యం |
| బుక్క / గుక్క | = | పిడికెడు |
| బుడం | = | కాండం మొదలు, దోస |
| బుడుకు | = | వెతుకు |
| బుడ్డ | = | వేరుశెనగకాయ, గిత్త (కోలెబుడ్డ) |
| బుడ్డమ్మ | = | చిన్నపిల్ల |
| బుబ్బాలు | = | పొంగణాలు, బొంగరాలు |
| బురగ (<బొరగ, <బొరక) | = | బొక్క, చిల్లి |
| బుర్రముక్కు | = | లావుపాటి ముక్కు |
| బుసి/బూసి | = | కంకపట్టేప్పటి పొట్టు |
| బెణ్ణ | = | వెన్న |
| బెర బెర (<బిరబిర) | = | త్వర త్వరగా |
| బేకయినపని | = | ఇష్టంవచ్చినపని |
| బేకు | = | కావాలి |
| బేగరి | = | హరిజనులభూమి |
| బేగి | | త్వరగా |
| బేరిగ | = | తొందరగా |
| బేళ్లు | = | (కంది) బేడలు, (కంది) పప్పు |

| | | |
|---|---|---|
| బైక | = | వేవిళ్ళు |
| బైలాట | = | బయట తిరగటం |
| బైను (<బహెస్) | = | వాదన |
| బొనుగులు | = | బొరుగులు |
| బొప్ప | = | బొమ్మ |
| బొయ్యారం / సొరక | = | పెద్ద సొరంగం |
| బోకులు/బోర్లు | = | గిన్నెలు / అంట్లు |
| బ్యాళ్ళు | = | కందిపప్పు |
| భాగేలా | = | ఏడాది కూలితో పనిచేసేరైతు |
| మక్త | = | (దానం) ఇచ్చిన గ్రామం |
| మంకురి / మంకుర్ | = | తుంపర |
| మచ్చు | = | మంచె, అటుకు / అటక |
| మజ్కూరీలు | = | గ్రామ పోలీసు |
| మడిగ | = | దుకాణాలు |
| మండి | = | మార్కెట్ |
| మతికి | = | జ్ఞాపకానికి |
| మతికి లేక | = | జ్ఞాపకం లేక, గుర్తులేక |
| మదర్సా | = | పాఠశాల |
| మదినె | = | వదినె |
| మంది | = | మేము |
| మర్లబడు | = | తిరగబడు |
| మళాలు | = | మొలలు |
| మాపటింతల/మాపటీడి | = | సాయంత్రం, చీకటి పడే సమయం |
| మామ్లత్‌దార్ | = | తాలూకా కార్య నిర్వహణాధికారి |
| మాల్ గుజారి | = | ఆదాయం |
| మాల్గాడీ | = | గూడ్స్ బండి |
| మాతె | = | మిద్దె |
| మిర్రు | = | ఎత్తుపల్లం |

మిల్లి = చిన్నచెంబు

మీన = మీద

మీన మోటర్ = హెలికాప్టర్

ముక్కిరుచు = వెక్కిరించు

ముంచె = ముందర

ముంజాత = మొట్టమొదట

ముషారా = కవిసమ్మేళనం

ముసాఫిర్ఖానా = ప్రయాణికుల విశ్రాంతి గృహం.

మూగలు (< మువ్వలు) = గజ్జెలు

మూత = తలుపు

మెదె = కుప్ప

మేల = పైన

మొండేళ్ళు = పందిమాంసం తినేవాళ్ళు

మొరం = ఎర్రమట్టి

మొల్కసీమ = ఆలంపురానికి మారుపేరు

మోటోళ్ళు = అనాగరికులు

మోడం = మబ్బు, ముసురు

యాగల్లు = చిల్లర డబ్బు

యాది = ఏది

యారు = ఎవరు

యాళం = జిగురు

యాసట = చిరాకు

రంగం ఎక్కు = సవారైపోవు

రసీద్ టికెట్ = రెవెన్యూస్టాంపు

రస్తా = దారి

రాత్రిటింతల = రాత్రికి

రిమ్మ = తిమ్మిరి

రిమ్మపట్టు = కొవ్వుపట్టు

| | | |
|---|---|---|
| రెక్క | = | చెయ్యి, జబ్బ, సిగ్నల్ |
| రెబ్బ/రెంబ | = | రెమ్మ |
| రేణిపండు | = | రేగిపండు |
| రొండి | = | రొమ్ము భాగం |
| లగ్గం | = | పెళ్ళి |
| లగ్గి | = | పెద్దగా |
| లంద | = | చర్మాలు నానవేసే తొట్టి |
| లాగోడి | = | ఖర్చు, సత్తువ |
| లాసిగా | = | గట్టిగా |
| లిఫ్ఫాఫా | = | కవరు |
| లెంకు | = | వెదుకు |
| లొయ్యలు | = | లోయలు |
| లోటా | = | గ్లాసు |
| లొత్తి | = | గుంట |
| వచ్చిలేదు | = | రాలేదు |
| వచ్చెదడువె | = | వచ్చిన తడవుగా |
| వట్టిగనె | = | ఊరికనె |
| వదురుడు | = | ఎక్కువగా మాట్లాడటం |
| విసుక్కుమను | = | ఏహ్యార్థకం |
| వెన్నరవ్వ | = | వెన్న |
| వెన్నుపూసలు | = | వెన్నుపాము |
| వైనాలు | = | పట్టాగొలుసులు |
| షక్కెర | = | పంచదార |
| షవలాకాయ | = | గోకర కాయ |
| షానా | = | తెలివిమంతుడు |
| షికం | = | చెరువుకట్టప్రాంతం |
| షికార్ | = | వేట, బయటకు ఊరికే వెళ్ళడం |
| షికారీ | = | వేటగాడు |

షిక్మీదార్ = భూమిని దత్తుచేసుకున్న రైతు

సత్తువ = శక్తి

సదురుడు = సర్దుకోవడం

సందెకాడ = సాయంత్రం

సన్ని = సన్నిపాతం

సమస్తరాలు = సమర్తై అయిన యువతి

సంబళం = జీతం

సరం = దూలం

సర్కార్ చెట్టు = మురికి తుమ్మ చెట్టు

సర్ది = పడిశెం, జలుబు

సర్వలు = పాత్రలు

సర్వీసు = ప్రయివేటు బస్

సస్త/అగ్గవ = చౌక

సాకు = చాలు

సాన్పి = కళ్ళాపి

సారం = దమ్ము

సాలె (<శాల) = స్కూలు

సాలెపిలగాడు = బడిపిల్లవాడు, విద్యార్థి

సిక్కా = నాణెం

సింగిడి = ఇంద్రధనుస్సు

సింతపాల కాయ = సీతాఫలం

సిళ్ళు = పిడుగులు

సుదరాయించు = సరిఅవు, సరిచేయు

సుద్దపూసవా = నంగనాచివా, అమాయకుడివా ?

సుద్ది = వార్త, కబుర్లు, సమాచారం

సున్నంరవ్వ = సున్నం

సుబా (<సుభా) = మూడుజిల్లాల మేర ప్రాంతం

సుళ్ళు = అబద్ధం

# మహబూబ్‌నగర్ జిల్లా మాండలికం

| | | |
|---|---|---|
| సూజి | = | సూది |
| సూత్క్యం | = | మైల |
| సేవెపోచలు | = | సేమ్యాలు |
| సొంగ | = | చుక్క |
| సొంగలు | = | వడియాలు |
| సొడ్లు ?( <సడలు) | = | వదులగు |
| సొలు | = | ఓడు |
| సొల్గు | = | కునుకు |
| సొసిలు | = | నార్లు |
| సోగి | = | ఆవకాయ, ఊరగాయలో ఉండే కారం |
| సౌలత్ | = | సౌకర్యం |